

# ఈ సంచికలో



ముఖచిత్రం : భూతపతి అమ్మాయితో భూపతి అబ్బాయి

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య


యువ సాలుచందా రూ. 36-00
దీపావళి సంచికతో రూ. 42-00
యువ, హైదరాబాదు - 500001




ఈ సంవత్సరం దీపావళి సంచిక ముఖచిత్రం చాల బ్రహ్మాండంగా ఉందని తెలియజేయడానికి ఎంతో సంతోషిస్తున్నాను. షీలా శివరాంగారి నిరీక్షణ నవల మా హృదయాన్ని కదిలించి, ద్రవింపజేసింది. కథల్లో పద్మరాజు గారిదీ, మల్లాదిగారిదీ, చండీదాస్‌గారిదీ, శ్రీధర గారిదీ, కుటుంబరావుగారిదీ నాకు మిక్కిలిగా నచ్చాయి. మిగతా కథలు కూడా బాగా ఉన్నాయి.

—రావులపల్లి రాజ రాజేశ్వరి.
రాజోలు.

ఈ సంవత్సరపు దీపావళి సంచిక అన్నివిధాలా, అన్ని హంగుల్లోనూ అద్భుతంగా ఉంది. ప్రతి ఒక్క కథా ఎంతో స్టాండర్డుగానూ, పది కాలాల పాటు మనస్సులో ఉండిపోయేదిగానూ ఉంది. దుర్గాప్రసాదరావుగారి 'పెళ్లయింది,' సి. ఎస్. రావుగారి 'గుర్రం ఓడిపోయింది' సీతాదేవిగారి 'ఆమె నవ్వింది' నాకు ప్రత్యేకం నచ్చినాయి. భానుమతీ రామకృష్ణగారి 'తలమీద తల' నిజంగా ఈ సంచికకే హైలైట్.

—పి. ఎల్. సుందరరెడ్డి,
జమ్ములమడుగు.

ప్రతి దీపావళి 'యువ' తెలుగు కథా సాహిత్యంలో ఒక ధ్రువతారగా ఉంటున్నదని అనడంలో అతిశయోక్తి ఏమీ లేదు. పోటీలలో నెగ్గిన కథల కంటె మంచి కథలు కొన్ని ఈ సంవత్సరం దీపావళిలో యువలో ఉండటం పాఠకుల అదృష్టమని నేను భావిస్తున్నాను. ఒకే సంచికలో ఇన్ని చక్కని కథలూ, గొప్ప అనుభూతిని రేకెత్తించిన నవలా అందించినందుకు నా ధన్యవాదాలు.

—సయ్యద్ హుస్సేన్,
బీబీనగర్.

నవంబరు యువ మాకెంతో బావుంది. 'బ్రతుకుదెరువు' నవలిక ఒక హైలైట్. కథలన్నీ వెరైటీగా, మనస్సుకు హత్తుకొనేట్టుగా ఉన్నాయి అరేబియన్‌నైట్స్ ఉపక్రమణిక —శాంపుల్ కథ చదివేటప్పటికి, ముందు ముందు కథలు చదవాలనే ఉత్కంఠ మాలో ఉరకలెత్తిస్తున్నది. ప్రస్తుతం మీరు యువద్వారా మాకు అందిస్తున్న సాహిత్య సరుకుకు వెల మూడురూపాయలైనా మాకు ఏం ఫర్వాలేదు.

— పి. రాజగోపాల్, పి. వెంకటేశ్,
పి. బాబు.
—రామచంద్రాపురం.




డిస్ట్రిబ్యూటర్లు :

**మెస్సర్స్ హుండాల్‌దాస్ నారాయణ్‌దాస్**

పత్తర్‌గట్టి, హైద్రాబాద్.


కొత్తది! నాన్చి శుభ్ర పరిచే ఓమో
తెల్లని తెలుపు పరిశుభ్రమైన
ఉతుకు ఇస్తుంది
Soak-n-See
OMO
Washes totally white.
thoroughly clean
It's power-
అమోఘ
శక్తి గలది!

# రుజువు: ఓమో ముడి ప్రయోగం

(ఇది ఉతికే పద్ధతి కాదు. మామూలుగా ఉతికే సూచనలు ప్యాక్ పైన ఉన్నాయి.)




1. రోజూ ఉతికే బట్టల్లోంచి వంటింట్లో వాడే బాగా మురికి అయిన బట్టను తీసాము.

2. మురికి బాగా దాక్కునే విధంగా ఆ బట్టను ముడి వేసాము.

3. ఆ ముడి వేసిన బట్టను యితర బట్టలతో బాటు ఓమోలో 4 గంటల సేపు నానబెట్టాము.

4. 4 గంటల తర్వాత: దానిని ఆ ద్రవంలో పిండి... జాడించాం.... మరి ఆ ముడి బయట పరిశుభ్రంగా ఉంది. ముడి లోపలో మరి?



5. మేము ముడి విప్పాము— అది లోపల కూడా పూర్తిగా తెల్లని తెలుపుతో పరిశుభ్రంగా ఉంది. వదలని దాక్కున్న మురికిని ఓమో నాన్చి తరిమేస్తుందనటానికి రుజువు యిది. లోపలికి చొచ్చుకుపోయి పరిశుభ్రమైన ఉతుకు యిస్తుంది.

## అవును, అమోఘ శక్తిగల ఓమోలో 4-గంటలు నాన్చితే, దాక్కున్న వదలని మురికి పోతుంది.

దీనికి హిందూస్థాన్ లీవర్ వారి హామీ ఉంది.

హైదరాబాద్‌లో/సికింద్రాబాద్‌లో మాత్రమే లభిస్తుంది.

లింటాస్-OMO.2B-776 TL (HS)

# 1947, స్వాతంత్ర్య దినానికి ముందు మీరు జన్మించినట్టయితే ఈ ప్రకటన పూర్తిగా చదవండి.



## 30 ఏళ్ళ వయస్సు సమీపిస్తున్న ప్రతి పది మందిలోనూ తొమ్మండుగురి జుట్టు రాలిపోతోంది. అయితే వారికి ఈ సంగతి తెలీదు

**ఆ తొమ్మండుగురిలో మీరూ ఒకరయితే ఇవాళ్టినుంచి ప్యూర్ సిల్వీక్రిన్ వాడటం ప్రారంభించండి**

మీరు దువ్వుకుంటున్నప్పుడు దువ్వెనతో వచ్చిన శిరోజాలు మీకు చెబుతున్నాయి — మీ జుట్టు ఊడిపోతోందని మీ జుట్టు పల్చబడుతోందని అర్థం స్పష్టం చేసే ముందరే మీరు జాగ్రత్త పడవలసిన సమయం ప్యూర్ సిల్వీక్రిన్‌ని ఇవాళ్టినుంచి వాడటం ప్రారంభించండి

**ప్యూర్ సిల్వీక్రిన్ జుట్టు ఊడిపోకుండా నివారిస్తుంది**

జుట్టు ఆరోగ్యానికి అవసరమైన 17 ప్రధాన అమినో-ఆసిడ్స్ ప్యూర్ సిల్వీక్రిన్‌లో ఉన్నాయి ఇది త్వరితంగా లోపలికి ప్రవేశించి, జుట్టు కుదుళ్ళవరకూ చేరుకుంటుంది జుట్టుకి సహజంగా లభించే ఆహారంలో గల లోటుని భర్తీ చేస్తుంది జుట్టు బలంగా ఆరోగ్యంగా పెరిగేటట్టు చేస్తుంది

**సత్ఫలితాలకోసం క్రమం తప్పకుండా వాడాలి.**

ప్యూర్ సిల్వీక్రిన్ వాస్తవంగా మంచి ఫలితాలు యివ్వాలంటే కనీసం 6 నెలలు క్రమం తప్పకుండా వాడాలి అప్పుడప్పుడు వాడితే లాభంలేదు ప్రతిరోజూ, రోజుకి రెండుపూట్లు కొద్దిగా ప్యూర్ సిల్వీక్రిన్‌ని మీ తలపై మర్దనా చేయండి మీ జుట్టు మామూలు స్థితికి చేరుకునేవరకూ రోజూ యిలా చేయండి ఆ తర్వాత సిల్వీక్రిన్ హెయిర్ డ్రెస్సింగ్ మీకు అవసరం చమురు, ప్యూర్ సిల్వీక్రిన్ మిళితమై ఉన్న ఒకే ఒక హెయిర్ డ్రెస్సింగ్ ఇదే ముందు ముందు ఏళ్ళతరబడి మీ శిరోజాల సంపూర్ణ సంరక్షణ అవసరం

**ప్యూర్ సిల్వీక్రిన్ ఎలా పనిచేస్తుంది!**

(1) ఒక చుక్క ప్యూర్ సిల్వీక్రిన్‌ని పెద్దది చేసి పరీక్షించారు ప్యూర్ సిల్వీక్రిన్‌కి సాటి మరేదీ లేదు. శిరోజాలకి శరీరంనుంచి సహజంగా లభించే చమురులోని 17 అమినో-ఆసిడ్స్ ప్యూర్ సిల్వీక్రిన్‌లో సమ్మిళితమై ఉన్నాయి

(2) శిరోజాలకి సహజ ఆహారమైన ముఖ్య అమినో-ఆసిడ్స్ లోటువల్ల జుట్టు అనారోగ్యంగా, పల్చగా పెరుగుతుంది ఈ లోపాన్ని సరిదిద్దకపోతే జుట్టు రాలిపోతూనే ఉంటుంది

(3) ప్యూర్ సిల్వీక్రిన్ జుట్టు కుదుళ్ళవరకూ చేరుకుని లోటుగా ఉన్న సహజ ఆహారాన్ని తిరిగి సమకూర్చి, మళ్ళీ ఆరోగ్యంగా పెరిగేటట్టు చేస్తుందని వైజ్ఞానిక పరిశోధనా పద్ధతులవల్ల ఋజువైంది.




# ప్యూర్ సిల్వీక్రిన్

శిరోజాల సహజ ప్రొటీన్ ఆహారం.

mcm/ps/997

# యువ

సచిత్రమాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 30　　డిసెంబరు-1974　　సంచిక 6


జనవరి నెల

## భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

డిసెంబరు నెల

# భావపరిచయ పోటీ

*బహుమతి పొందిన వ్యాఖ్య*



*కలికి హొయలు జూడ కాంక్షలు రేకెత్తి,*
*మరలిచూచు చతడు మరియుచుండె,*
*నాతిమైక మందు గోతిని కనడయ్యె,*
*ముందుచూపులేక మోసపోరె ?*

వజ్రేంద్ర
లక్కవరం.




# శకటం

ఆనంద్ కుమార్

'మూసా! ఒక్క ఆట వేద్దామా?' అన్నారు పూర్ణచంద్రరావుగారు.

'చిత్తం!' అన్నాన్నేను

కిటికీనుండి మలయసమీరం చిరునవ్వులు చిందుకుంటూ తొంగిచూసింది. అక్కడ, దూరంగా గేటువగ్గరున్న బోగన్‌విలియా — మధ్యలోనే కొన్ని నవ్వుల నేరుకుని కెంపులు పూసింది. గేటు మీద ఆ కెంపుల్ని చూసి ఏరుకుందామని మొహమంతా చిరునవ్వు పులుముకుని చింపిరి జుత్తు నెగదోసుకుంటూ గుండెల్లోని దైన్యాన్ని, కళాకాంతుల్లేని చర్మంతో కప్పుకుని బిలబిలమంటూ వచ్చారు కొంతమంది పిల్లలు.

వాళ్ళను చూచే గామాలు 'టైగర్' గుర్రుమంది, ఇంటి ముందునుండి.

నా ముందు చిన్నని గుండ్రటి బల్ల మీద చదరంగం పరిచాడు పనిపిల్లవాడు. అట్టపెట్టెలో పడివున్న పావుల్లోంచి పచ్చ వాటిని తీసి అమర్చుకుంటున్నాను.

టైగర్ ఈ సారి గట్టిగా మొరిగింది కిటికీలోనుండి బయటకు చూశాను. ఈ సారి పిల్లలు దూరంగా పరుగెత్తారు.

గేటుదగ్గరి పిల్లలు తప్పితే ఇంకేమీ కనపడటంలేదు. ఎత్తయిన ప్రహరీ గోడ తప్ప. ఇంటిముందు నినాదాల్లా పెరిగిపోయిన బోగన్‌విలియా చెట్లమీద పిట్టల కిచకిచలూ... రోడ్డు మీద... తల్లి రొమ్ములో పాలు లేకపోవడం చూసి ప్రేవులు తెగిపోయేట్లు ఏడిచే బిచ్చగత్తె కొడుకు ఏడుపులూ ఇంతదూరం... ఇక్కడకు వినిపించవు.

అప్పుడప్పుడు అరమూసిన కన్నులతో, 'అమృతం' నిండిన జీర్ణకోశంతో, నచ్చిన అతివల పయ్యెదల మధ్య చిక్కువడి పూర్ణచంద్రరావుగారు వేసే భాగోతపు వేషాలన్నీ బయటవాళ్ళకు కనిపించవు... వినిపించవు.

అంత పకడ్బందీగా కట్టిన మేడ ఇది.

నేను పూర్ణచంద్రరావుగారి గుమాస్తాని. వారికి నా మీదున్నంత నమ్మకమూ, ప్రేమా వారికి వారి భార్యమీద కూడా లేదు. అయినా రోగిష్టిదానిమీద ప్రేమేమిటి లెండి! కాని, వారి ధర్మపత్ని సాక్షాత్తూ మహాలక్ష్మి. (అందునా అనారోగ్యంగా వున్నవారి గూర్చి చెడు మాట్లాడటం నాకు సుతారమూ గిట్టదు) ఆమెగారు మేడదిగి ఎన్నడూ కిందకు రాలేదు. పూర్ణచంద్రరావుగారు మేడ ఎక్కి ఆమె గదిలోకి ఈ మధ్య ఎన్నడూ వెళ్ళలేదు.

ఇంటి కుక్కను చూసి యజమాని గుణగణాలను వివరించవచ్చని అన్నారెవరో - కాని నన్నడిగితే ఇది సమంజసం కాదేమో ననిపిస్తుంది. ఇంటి ముందు చీటికీ మాటికీ గుర్రుమనే 'టైగర్'లా కాకుండా ప్రశాంతంగా నిదురబోయే 'టైగర్ లాంటి మనిషి పూర్ణచంద్రరావుగారు. వా రన్నమాట తప్పరు. ఆకలివేస్తే తప్ప నిద్రలేవరు. మనుషుల్ని మెల్లగా దువ్వుతూ, బుజ్జగిస్తూ మాట్లాడ్తారు.

పూర్ణచంద్రరావుగారు నా కెదురుగా వచ్చి కూర్చున్నారు. కుడినుండి మూడో వేపున్న గదిలోని ఎర్ర సిపాయిని ముందుకు కదలిస్తూ పనిపిల్లవాడి వేపు చూసి 'పోతులూరు వచ్చాడుట్రా?' అని అడిగారు.

'రాలేదయ్యగోరూ!—' అని జవాబిస్తూనే వున్నాడు పనిపిల్లవాడు - 'దండాలండీ' అన్నాడు పోతులూరు.

'రావయ్యా రా! ఇప్పుడే నీ గురించి అడుగుతున్నాను—' అంటూ పనిపిల్లవాడ్ని వెళ్ళిపోమని సైగ జేశాడు పూర్ణచంద్రరావుగారు.

పోతులూరు వేపోసారి దృష్టి సారించాను. వాణ్ణి చూసినప్పుడల్లా నాకు జాలి వేస్తుంది. అంటే పోతులూరు అర్భకుడనీ కాదు, అసమర్థుడనీ కాదు. వయసు మళ్ళిన వాడనీ కాదు.

'కండగలవాడేను మనిషోయ్ —' అన్న చరణం పోతులూరుకు అక్షరాలా సరిపోతుంది. అతడ్ని చూసినాక ఒలింపిక్స్‌లో పాల్గొనాల్సిన మల్లయుద్ధ ప్రవీణుడ్ని భారతదేశం పొరబాటున వదిలేసిందేమోనన్న అనుమానం వస్తుంది. చర్మాన్నంతా సాగదీసి కండలమీద బిగించినట్లుంటుంది వాడి శరీరం. దానికి తోడు అందమైన కోల మొహమూ, పెద్ద పెద్ద కళ్ళూ, కోర మీసమూను.

పోతులూరు చెంపమీద దెబ్బపడితే రెండో చెంప చూపిస్తాననే మనిషీ కాదు.




కోపం వచ్చిందంటే అది పరశురాముడి కోపమే. పట్టినపట్టు విడవాలంటే పోతులూరు తర్వాతేను భగీరథుడు.

అయితే ఇంకెందుకయ్యా జాలి ?

ఇంతటి మనిషీ పూర్ణచంద్రరావు గారిని చూస్తే పిల్లిలా మారిపోతాడు వంగిపోయి నడుస్తాడు. ఆంజనేయుని భక్తినైనా శంకించాలేమోగాని పోతులూరు స్వామి భక్తిని శంకించలేం. అయితే స్వామి భక్తి వుండటం నేరం గాదు. ఆ స్వామిగా రెటువంటి వారనేదే ప్రశ్న.

వాడి నేరమల్లా (నా దృష్టిలో) వాడి భార్య అనసూయకూ, పూర్ణచంద్రరావు గారికీ వున్న సంబంధం తెలిసీ వాడు మిన్నకుండటం. మనిషిని మనిషి అర్థం చేసుకోవటం బ్రహ్మవిద్యేనని - అనుకుంటాను. నా బేగం సాహెబా రెండు మూడుసార్లు నన్నడిగింది. 'ఈ విషయం

పోతులూరుకు తెలవదా ?' అని. కాని, సమాధానం నే నివ్వలేను.

పూర్ణచంద్రరావుగారూ, నేనూ చిన్నప్పుడు ఒకే బడిలో చదువుకున్నాం. కాని, మా ఇద్దరి మధ్యా అంతస్థు అడ్డం వచ్చేది. చిన్నతనాన కలిసిపోయినప్పటికీ జ్ఞానం వస్తుండేసరికి మా మాటల్లో, చేతల్లో, పెద్దవాళ్ళ మందలింపులలో ఈ భేదం ప్రస్ఫుటంగా కనపడటం మొదలైంది.

మా నాన్నగారు పూర్ణచంద్రరావుగారి నాన్నగారి దగ్గర గుమాస్తాగా పని చేశారు. పూర్ణచంద్రరావుగారి పొలాల మీదా, ఇండ్లమీదా అజమాయిషీ మా కుటుంబానికి తరతరాలుగా వస్తున్నది. వారికి సంబంధించిన తహసీలు వ్యవహారాలన్నీ మేమే చూస్తాం.

మా నాన్నగారు గతించిన తర్వాత వారసత్వంగా, ఆ గుమాస్తాగిరీ నాకు సంక్రమించింది. మా నాన్నగారి తరానికీ, మా తరానికీ భేదం ఏమిటంటే మా నాన్నగారు పూర్ణచంద్రరావుగారి నాన్నగారితో చదరంగం ఆడేవారు కారు. నేను ఆడుతున్నాను.

శకటాన్ని ముందుకు నెడుతూ పోతులూరు నడిగారు పూర్ణచంద్రరావుగారు, 'ఏమయిందిరా నీ కప్పగించిన పని ?' అని.

మాట్లాడలేదు పోతులూరు.

'ఏం ? దారికి రాలేదా ?'

పోతులూరు చిన్నగా నవ్వాడు. 'దొరా! మీ బంగళావుంది. అమావాస రాతిరుంది. అందకుండాపోతే పట్టుకుంటానికి పోతులూరూ వున్నాడు—' అని కోరమీసం దువ్వాడు.

పొదుపు కథల్లో మాట్లాడుకుంటున్నారు ఇద్దరూనూ.

'ఎప్పుడింక?—' అన్నారు పూర్ణచంద్రరావుగారు.

వారి శకటం ముందుకు చొచ్చుకుని వచ్చి నా పచ్చ సిపాయిల్లో ఒకదాన్ని తినేసింది.

'రేపు మీరే చూస్తారు దొరా!'

నవ్వేశారు పూర్ణచంద్రరావుగారు. 'చూస్తూనే వున్నాను గదరా—' అన్నారు.

పోతులూరు వెళ్ళిపోయాడు.

'నా శకటం వీరవిహారం చేస్తున్నది మూసా!' అన్నారు పూర్ణచంద్రరావుగారు.

తూరుపు దిక్కునుండి గాలి ఉధృతంగా వీచింది. కిటికీరెక్కలు టపటప కొట్టుకుంటున్నాయి.

రెండ్రోజుల తర్వాత ఊరిమీద కాకులు విచ్చలవిడిగా ఎగిరాయి. కాకుల్ని చూస్తే నాకు భయం. దేనికైనా తట్టుకుంటానేమో గాని కాకిగోలని తట్టుకోవాలంటే నాకు గుండె సరిపోదు. కాని, ఊరవతల పాడుబావిలో కనిపించిన వరలక్ష్మి శవం కాకిగోలకు సమాధానం చెప్పకుండా ఉలక్కుండా పడివుంది.




ఆ సాయంత్రానికి అనుమానంమీద పోతులూరు అరెస్టయ్యాడు. మా ఇంటిలో నా బేగం సాహెబా 'ఇది పూర్ణచంద్ర రావుగారు పని-' అంది.

'ఛస్!' అన్నా న్నేను. నా ఒంట్లోని ఉప్పు ఇగిరిపోలేదనుకుంటాను. ఆ రోజు రాత్రి ఎనిమిది గంటలవేళ కొన్ని వ్యవహారాలు మాట్లాడటానికి పూర్ణ చంద్రరావుగారి ఇంటికి వెళ్ళాను. టైగర్ నన్ను చూసి తోకాడించింది. ఈ జంతువులకు ఎంత విశ్వాసం!

ఆకాశంలోని నక్షత్రాలు అలవాటు ప్రకారంగానే నవ్వుతున్నాయి. బోగన్ విలియాపూలు గాలిపాటకు యధావిధి గానే లయవేస్తున్నాయి.

లోపలకు వెళ్ళబోయిననాకు ముందు గదిలోనే అనసూయ తారసిల్లింది. చక్కగా అలంకరించుకుని వుంది.

అందం! అనసూయ పుట్టినాక అందం పుట్టింది.

నన్నుచూసి నవ్వుతూ- 'దొరగా రిప్పుడు మాట్టాడరు-' అంటూ లోపలి కెళ్ళిపోయింది. ఉస్సురని నిట్టూర్చి వెను దిరిగి వచ్చాను.

పోతులూరు కేసు విచారణలో ఉన్న ప్పుడు ఒకరోజున చదరంగం ఆడుతూ పూర్ణచంద్రరావుగారు నాతో అన్నారు- "మన జీవితాలు చదరంగం ఆట లాంటివి-" అని.

"పాతమాటే సుమీ!" అనుకున్నాను మనసులో.

'ఆటలో కొన్ని జంతువులు బలయి పోతుంటాయి-'

నిజం!

'నే నెప్పుడూ ఎక్కువగా ఉపయో గించే శకటమూ యిచ్చేస్తుంటాను అప్పు




తప్పుడూ_' తప్పదు మరి కొన్నిసార్లు.

"మన ఉప్పు తినేవాళ్లను మనం ఉపయోగించుకోవడం తప్పుకాదు. ఏమంటావ్?"

ఖురానూ, బైబిలూ, భగవద్గీతా- నాకేవీ గుర్తురాలేదు.

నా బేగంసాహెబా నాతో అంది. "పోతులూరుకు అనసూయంటే చాలా ప్రేమ. దానికోసం ప్రాణం పెడతాడు"

నిజం కావచ్చు. కాని, అనసూయ పూర్ణచంద్రరావుగారికోసం ప్రాణం పెడుతుంది మరి!

ఆకాశం పడిపోలేదు. భూమ్మీంచి చంద్రుడి మీదకు మానవుడు గంతు వేసాడు.

కొన్నాళ్ళకు మళ్ళీ పూర్ణచంద్రరావు గారితో ఆటాడ్తున్నప్పుడు నా ఎర్రని పావుల్ని చూస్తుంటే శకటాన్ని ఆప్యాయంగా నిమురుదామని నా చేయి ముందుకు వచ్చింది.

ఆ తర్వాత నా అంతరాంతరాలలో మెదిలిన ప్రశ్న ఇది.

"ఇప్పుడిక శకటం ఎవరు?"

"అల్లా! నేను కాదు గదా!"



# అమ్మ

ఇచ్ఛాపురపు రామచంద్రం

“పోస్ట్...”

గట్టిగానే పిలిచాడు పోస్టుమన్ . కేక విని-కళ్ళు తెరచి-ఒక్కసారి అటునుంచి ఇటు కదిలింది.

పోస్టుమన్ వెళ్ళిపోతున్నాడు కాబోలు. అడుగుల చప్పుడు.

ఎక్కడినుంచో ఉత్తరం?

విశాల మనసు ఆత్రతతో కొట్టుకోసాగింది. ఎవరినుంచి వచ్చిందో ఉత్తరం? కర్రకోసం చూసింది.

మంచానికి దూరంగా పడిఉంది.

మంచంమీదనుంచి వొంగి-అందుకోవాలని ప్రయత్నించింది.

ఊహుఁ. అందలేదు.

విశాలకి దుఃఖం ముంచుకొచ్చింది.

బలవంతాన కన్నీరు ఆపుకుంది. తనమీద తనకే జాలివేసింది.

ఏం జీవిత మిది?

ఏ జన్మలో చేసిన ఏనేరాని కీ శిక్ష? దీనికి నిష్కృతి ఎప్పుడు? ఎలా?

"బాబూ!" పిలిచింది.

జవాబులేదు. ఎక్కడ ఆడుకుంటున్నాడో, ఏంచేస్తున్నాడో?

పాప-? కాన్వెంటుకి వెళ్ళిపోయి ఉంటుంది.

వెళ్ళేటప్పుడు తనకి చెప్పలేదు.

చెప్పదు. పాపకి తనకి మధ్య మరీ దూరం.

పిలిచినా దగ్గరకు రాదు-ఎప్పుడో తప్ప.

చిన్నపిల్ల. ఏమీ తెలియని వయస్సు. తనని చూసి భయపడుతుంది. తప్పదంటే తప్ప దగ్గరకు రాదు. వచ్చినా-ఎంత త్వరగా అవతలికి వెళ్ళిపోతామా అని నిప్పులమీదున్న ట్లుంటుంది తనదగ్గర. తననిచూసి భయం!

భగవాన్! నేనేం పాపం చేశానయ్యా?

పాపంటే నా కెంత ప్రేమ! అంత ప్రేమకి ప్రతిఫలం యిదా!

పోనీలే. పాప నా దగ్గరికి రాకపోయినా ఫరవాలేదు. దాని జీవితం సుఖంగా సాగితే చాలు. అదే పదివేలు.

పాప రాలేదంటే న్యాయమే.

తను-అందరి అమ్మలలాగ ఉండదు.

ఎప్పుడూ జుత్తు చెదరే ఉంటుంది. బట్టలు నలిగే ఉంటాయి. ముఖం మలినంగానే ఉంటుంది. శరీరం మురికిగానే ఉంటుంది.

మరి-పాప?

పులుకడిగిన ముత్యంలా ఉంటుంది. నీటుగా బట్టలు వేసుకుంటుంది. చక్కగా, రబ్బరు బొమ్మలా, పాలిష్ చేసిన దంతపు బొమ్మలా-ముట్టుకుంటే మాసిపోతుందేమో అన్నంత యిదిగా ఉంటుంది.

పదికాలాలకీ పాప అలాగే ఉండాలి. ఎంత మాత్రమూ తన మురికి ఆమె కంటకూడదు.

పాపని ముద్దుపెట్టుకోకుండా-ప్రేమనంతటినీ కన్నులతోనే కురిపిస్తాను.

కొంచెం జ్ఞానంవస్తే-ఊహ తెలిస్తే-పాప తప్పకుండా తనమీద జాలిపడు

తుంది. అశుభమూ శుభమూ తెలిస్తే—అమ్మా అని చేరవస్తుంది. సౌజన్య పేరుకి తగ్గ పాప. దురదృష్టవశాత్తు తనవంటి తల్లి దొరికింది.

బాబు కింకా ఏమీ తెలియదు.

చాలా అల్లరి చేస్తాడు. ముద్దుగా ఆటలకి రమ్మంటాడు తనతో.

మారాము చేస్తాడు. గారాలు పోతాడు.

తన తల్లి ఎంత అశక్తురాలో ఆ పసివాడికి తెలియదు.

తను విధి వంచిత. కన్నకొడుకుతో ఆటలాడుకుందుకు నోచుకోలేదు. ఇది -వాడికెలాగ చెప్పడం? వాడి కర్థమౌతుందా?

అర్థంకాదు. వాడు పసివాడు.

ఏమీ తెలియనిదశ కనకనే వాడు తన కోసం ఆరాటపడతాడు.

కొంచెం కాలూ చెయ్యీ వస్తే—యీ అమ్మ అవసరం వాడికేమిటి?

తను ఒక ఆటబొమ్మ. అంతకంటె అధ్వాన్నం ఏమో! కొన్ని బొమ్మలు కీ యిస్తే కదులుతాయి-ప్రాణం లేకపోయినా. తనకి ప్రాణం ఉంది.

ఐనా కదలలేదు! ఎంత దురదృష్టం.

తన దురదృష్టం యింటిల్లిపాదినీ కుట్టికుడుపుతోంది.

తనవల్ల ఎవరికీ సుఖంలేదు.

తను-పిల్లలకి తల్లికాదు. భర్తకి భార్యకాదు.

ఎటువంటి దుస్థితి!

ఏ దారుణమైన నేరానికీ దుర్భరమయిన శిక్ష?

ఇంతకంటె మరణం వేయిరెట్లు మేలు కాదూ?

విశాల వణికిపోయింది.

ఆమె కళ్ళు దుఃఖాశ్రువులతో నిండిపోయాయి.

పిల్లలిద్దరూ కళ్లముందు మెదిలారు.

ఆమె కళ్ళు తుడుచుకుంది మెల్లగా.

నేను చచ్చిపోను. ఎలాయిలాగ బ్రతుకుతాను. మీకోసం బ్రతుకుతాను. మీకు రెక్కలొచ్చి మీ మానాన మీరు హాయిగా జీవించగలిగే రోజువరకూ ఎంత దుర్భరమయినా సహించి రోజులు గడుపుతాను.

పాపనీ బాబునీ దగ్గరున్నట్లే భావించుకుంది.

ఆమె ముఖం ప్రశాంతం అయింది.

కొన్ని క్షణాలు.

ఎందుకో గోడవైపు చూసింది.

ఫొటో.

ఫొటోలో తనూ వేణూ.

ఆ ఫొటో మాసిపోయింది.

ఫ్రేము బూజులు పట్టింది.

విశాల హృదయం దీనంగా రోదించింది.

ఇక ఆ ఫొటో కలకలలాడదు.

ఫ్రేము-చివికి శిథిలం కావలసిందే.

ఈ యిల్లిక కళకళలాడదు.

వేణూ!

నాతోపాటు నిన్నూ నరకంలో పట్టి ఉంచుతున్నాను కదూ?

వద్దు వద్దు. నన్ను వదిలి వెళ్ళిపో. నువ్వయినా సుఖపడు. ఝుమ్మని ఎగిరే తుమ్మెదలాటి మగవాడివి ఈ వాడి వత్తలైపోయిన కుసుమాన్ని - నిరర్థక పుష్పాన్ని పట్టుకుని ఎందుకు దేవులాడతావు?

నేను స్త్రీనే. కాని మరీ స్వార్థపరురాలిని కాను. నన్ను కట్టుకున్న నేరానికి నాతోపాటు నువ్వూ నాశనమై తీరాలని శాసించే నీచురాలిని కాను. నేను ఊహలలో విహరించడంలేదు. వాస్తవాన్ని గ్రహిస్తూనే ఉన్నాను.

మన జీవితంలో మరి వసంతం తొంగిచూడదు.

మన దాంపత్యంలో మళ్ళీ వెలుగులు వెదజల్లవు.

నాకు తెలుసు వేణూ. నిశ్చయంగా తెలుసు. ఏ ఆశా నన్నిక తీయగా మోసం చెయ్యలేదు. చెయ్యదు. నీ తేనెపలుకులికి నా హృదయం కరిగిపోదు. ఎందుకు నన్నింకా ఆశల భవిష్యత్తువేపు నెట్టబోయే ప్రయత్నం చేస్తావ్? నేను కదలను. కదలలేను. కదలలేని రాతిబొమ్మను. అంతే వేణూ. అంతే.

"విశాలా!"...

"ఊఁ" మూలిగింది.

"నిద్రపోతున్నావా?"

"ఉహుఁ."

"మాట్లాడాలి కొంచెం..."

"చెప్పండి..."

"సౌజన్య..." ఆగిపోయాడు.



"ఊం. సౌజన్య?"

"అదికాదు. సౌజన్య కొంచెం పెద్దదయింది—"

"ఐతే? ఏ మొచ్చింది?"

అతను సందేహించాడు. "నన్ను కొంచెం జాగ్రత్తగా అర్థంచేసుకుంటావు కదూ?''

"అలా కానిదెప్పుడు?" ఎదురు ప్రశ్నవేసింది.

"నువ్వున్న పరిస్థితిలో అతి త్వరగా చిరాకు కలగడం సహజమే. కాని–నిన్ను మనస్ఫూర్తిగా వేడుకుంటున్నాను, నిదానంగా ప్రశాంతంగా వినవూ?"

విశాలకు దుఃఖమే వచ్చింది.

ఎందుకతనంత కఠినంగా మాట్లాడి తన హృదయాన్ని గాయం చేస్తాడు? తను చిరాకుపడుతుందా? అతని మీద!!

లేదు. తనకి కోపమంటూవస్తే–ముందు తనమీద, తరవాత ఆ దేముడిమీదా. మనుషులమీద తనకి కోపం రాదు. వచ్చినా ఏం చేయగలదని?

పేదరాలి కోపం పెదవికి చేటు. తన కోపం–తనకే శత్రువు.

"నిస్సంకోంచంగా మీ మనసు విప్పి మాట్లాడండి. మీరేం చెప్పినా వింటాను." తెచ్చిపెట్టుకున్న శాంతంతో అందామె.

"మన జీవితాని కర్థం ఏమిటి?'' అడిగాడు వేణు.

తెల్లబోయి చూసింది.

అతనే చెప్పాడు. "మన జీవితానికర్థం-మనం కాదు. పిల్లలు. ఔనా?"

కాదనిపించలేదు.

"ఇది సృష్టి తాలూకు విచిత్రమూ ప్రత్యేకతా. ఇన్నాళ్ళూ మనం మనకోసం జీవించాం. మన సుఖసౌఖ్యాలకోసం తాపత్రయపడ్డాం. జీవితాన్ని అనుభవించాం. ఇక ఆ రోజులు వెళ్ళిపోయాయి..."

"వేణూ!" విశాల కన్నుల్లో నీరు నిండింది.

"ఇది చేదునిజం కాదు విశాలా. తీయని నిజమే. జాగ్రత్తగా పరిశీలించు. మనం భవిష్యత్తుకోసం-ఎదురుచూస్తే—అది_మన పిల్లల దృష్ట్యానే. ఇది అసహజం కాదు. న్యాయం కూడా."

"మీ రనేదేమిటి?"

"మన పిల్లలకి బంగారు బాటలు వేయడానికి - మనం కొన్ని త్యాగాలు చెయ్యాలి. ఇలా చెయ్యడంలోనే మనకి నిజమయిన తృప్తీ ఆనందమూ."

"ఏమిటా త్యాగాలు?" ఆత్రతగా చూసింది వాసవి.

"సౌజన్య అమిత తెలివైనది. క్లాసులో ఫస్ట్. మొన్న ప్రోగ్రెస్‌కార్డ్ చూసే ఉంటావు."

"ఊఁ."

"పాప బాగా చదువుకోవాలి. చాలా గొప్పది కావాలి. అందుకు మనం ఏమయినా చెయ్యవలసిందే. ఏమంటావ్?"

"అలాగే."

"పాపకి వాతావరణం సరిపోవడంలేదు. అలా అనిపిస్తోంది_" ఆగాడు వేణు.

విశాల కతని మాటలు అర్థం కాలేదు. కళ్ళు పెద్దవిచేసి భయంగా సందేహాస్పదంగా చూసిం దతనివంక.

"పసిపిల్లల మనస్తత్వం అతి సున్నితం. వాళ్ల మెదడు కూడా చాలా సునిశితంగానే ఉంటుంది. అనువైన వాతావరణంలో వాళ్ల మెదడూ హృదయమూ ఎంత అద్భుతంగానో వికసించగలవు. ప్రతికూల వాతావరణంలో అతి త్వరగా మొద్దుబారిపోతాయి. అందరూ చిన్నప్పుడు సునిశితంగానే ఉంటారు. పిల్లలు మొద్దులయ్యారంటే—లోపం వాళ్లది కాదు, వాళ్ల పెద్దలది."

వేణు ఎందుకింత అయోమయంగా తలాతోకా లేకుండా మాట్లాడుతున్నాడు?

అతను చెప్పదలచుకున్నది సూటిగా చెప్పక యీ డొంకతిరుగుడు దేనికి? చివరికి తను తేల్చి చెప్పేదేమిటి?

అసహనంగా చూసింది విశాల.

"హాస్టల్లో తన యీడు పిల్లలమధ్య సౌజన్యకి వయసులో కావలసిన స్నేహం లభిస్తుంది. ఆటకీ పాటకీ అనువైన పిల్లలుంటారక్కడ."

పిడుగుల్లా వినిపించాయి వేణు మాటలు.

విశాల వణికిపోయింది. వేణు అనేదేమిటి?

సౌజన్యను హాస్టల్లో చేర్పించి...

"ఇప్పుడా ఆలోచనెందుకు కలిగింది?" సూటిగా అడిగింది.

"సౌజన్య అందరి పిల్లలలా ఉండవలసినంత ఉషారుగా ఉంటున్నట్లులేదు."

"ఇటువంటి నిర్భాగ్యురాలైన తల్లి కడుపున పుట్టడం దాని దురదృష్టం—" గాద్గదికంగా అందామె.

"విశాలా!" జాలిగా చూశాడు వేణు.

తల్లిమనసు పడే వేదన తనకి తెలుసు. తను నిర్దయుడూ కాడు, ఆలోచనా రహితుడూ కాడు. కాని-ఇంతకంటె మార్గాంతరం లేదు. ప్రేమతో పిల్లల భవిష్యత్తు నరికట్టకూడదు. తమకోసం వాళ్ళ పెరుగుదల నాటంకపరచకూడదు.

ఆ మాటకొస్తే సౌజన్యని దూరం చేసుకోవడం తనకూ కష్టమే. నిజానికి తనకి మరీ దగ్గర-విశాలకు కంటె. కాని-వాత్సల్యాన్ని చంపుకుని సౌజన్యని హాస్టల్‌కి పంపేందుకు తను సిద్ధపడ్డాడు. ఎందుకు? సౌజన్య కోసమే.

"పాపకి సరయిన భోజనం ఉండక..." గొణిగింది విశాల.

"ఇక్కడకూడా వంటమనిషి వంటేగా!" చటుక్కున అనేశాడు వేణు. ఆ మాట అనేముందు అతను కొంచెంకూడా ఆలోచించలేకపోయాడు.

తరువాత ఎంత పశ్చాత్తాపపడి ఏంలాభం? నోరు జారాక తీసుకోడం నరుడి తరమా?

దుఃఖంతో వెక్కిపడింది విశాల. "నిజమే. నా అంత దౌర్భాగ్యురాలూ పుణ్యహీనా మరెవరూ ఉండరు. బిడ్డలకి చేత్తో అన్నం వండలేను, వడ్డించలేను. మిమ్మల్నీ తక్కువ కష్టపెట్టడంలేదు..."

"క్షమించవూ విశాలా?"

"అందరూ నన్నే క్షమించాలి. ఒకరిని క్షమించేపాటి అధికారమూ, అర్హతా శక్తీ నాకెక్కడ మిగిలాయి?"

"అదికాదు విశాలా!-"

"నే నెందుకు బ్రతికున్నానో నాకే అర్థంకావడంలేదు. మీరు-పూర్వజన్మలో ఏం పాపం చేసుకున్నారో? మీవంటివారికి నేను తగను. సౌజన్యను హాస్టల్లో చేర్పించండి. పనిలో పని-బాబుని అనాథ శరణాలయంలో వదిలెయ్యండి. శ్రమ అనుకోకపోతే నన్ను తీసుకెళ్ళి సముద్రంలో—"

"విశాలా!" ఆమె నోటిని వేళ్లతో మూసేశాడు వేణు.

ఆమె కన్నులనుండి ధారకడుతోంది కన్నీరు.

వేణు స్పర్శతో ఆమె నరాలు జివ్వుమన్నాయి.

హృదయం మరీ ద్రవించిపోయింది.

వెచ్చజేస్తే కరిగే వెన్న అయిపోయిం దామె మనస్సు.

ఎంత కఠినాత్మురాలయిపోయింది తను!

దేవుడిలాటి మనిషిని-దెబ్బకొట్టింది. మెత్తని మనసులో మాటల ముళ్లు గ్రుచ్చింది. ఈ పాపానికి నిష్కృతి ఏమిటి?

వేణు పశ్చాత్తాపానికి మితిలేకపోయింది.

అమ్మ మనసుని అర్థంచేసుకోలేక తను ఆవేశపడ్డాడు. అనరాని మాట అనేశాడు. స్త్రీ అంటేనే సౌకుమార్యం. అందులోనూ-తల్లికి తన సంతానంపై ఉండే ప్రేమలో యింతో అంతో మూర్ఖత్వమూ కలిసి ఉంటుంది. అదే ప్రత్యేకత. నిజానికి సౌజన్య భవిష్యత్తు విశాలకీ కావాలి. తన బిడ్డ సుఖపడాలనీ, బంగారు భవిష్యత్తు పొందాలనీ ఆమెకీ ఉంది. కాని-ఆమెను దూరంచేసుకోవడం మాత్రం విశాల తరంకాదు. అందమైన బలహీనత అది. ఆడవాళ్లకి సెంటిమెంట్సే అధికం.

ఇన్ని తెలిసీ తనెందుకు తొందరపడ్డాడు?

ఇంకొంచెం మృదువుగా చెబితే విశాల యింత బాధపడి ఉండకపోనేమో!

ఎంత పొరపాటు జరిగింది.

విశాల ఉన్న పరిస్థితులలో తను ఎంతసున్నితంగా ప్రవర్తించి ఉండవలసింది. కాని-తను ఆవేశపడిపోయాడు. తొందరగా నోరు జారాడు.

విశాల-వేణు-ఇద్దరూ నేరస్థులలా ఉండిపోయారు.

ఇంతలో కథానాయికే వచ్చి పరిస్థితిని కాపాడింది.

"డాడీ! రేపు టీచర్ మమ్మల్నందరినీ ఏరోడ్రోమ్‌కి తీసుకువెళ్తారు; ప్లేన్ చూపిస్తారట."

"మంచిదమ్మా-" సౌజన్యని దగ్గరగా తీసుకున్నాడు వేణు.

"అన్నీ చక్కగా చూడు."

"విమానంలో తిప్పుతారట కూడా!" గుడ్లు తిప్పుతూ ఆనందంగా చెప్పింది.

"మరీ మంచిది. భయపడకేం?" నవ్వాడు వేణు.

"ఛీ. టీచర్ పక్కనే ఉంటారుగా! నాకేం భయం?"

"ఊఁ."

"మరేఁ...పదిరూపాయలు తెమ్మన్నారు."

"తప్పకుండా తీసుకువెళ్లు."

"నేను ఖడికి వెళ్ళేసరికి నువ్వు లేవవుగా? మరి-"

"అమ్మ కిస్తాను. తీసుకుందువుగాని-ఏం?"

"ఓకె." తలూపింది సౌజన్య.

ఇంతలో బాబు పరుగెత్తుకు వచ్చాడు. "నాన్నా!-"

"కమాన్-" ఎత్తుకుని ఒక్కసారి గాలిలోకి ఎగరేసి పట్టుకున్నాడు.

బాబు-నవ్వాడు కిలకిల. వాడిపేరు సారథి.

"చూడండి-" నీరసంగా పిలిచింది విశాల.

సాధారణంగా విశాల వేణుని ఏకవచన ప్రయోగమే చేస్తుంది. ఆమె అతన్ని బహువచనంతో పిలిసే-విషయం కొంచెం తీవ్రమైందన్నమాట. వేణు సంసిద్ధుడయ్యాడు.

"పిల్లలకి నా దగ్గరకంటె మీ దగ్గరే ఎక్కువ చనువు. పిల్లలు మిమ్మల్నీ, మీరు పిల్లలనీ వదలి ఉండలేరు."

"నిజమే విశాలా!" జాలిగా నిట్టూర్చాడు వేణు.

ఒక ఉప్పెన అలాగ తప్పింది. మునిగిపోవలసిన సంసారనౌక అదృష్టవశాత్తూ ఆ ప్రమాదంనుంచి బయటపడింది. భగవంతుడు చల్లగా చూశాడు.

విశాల దీనంగా చూస్తూంది.

ఉత్తరం ఊరిస్తూంది. కర్ర ఎక్కడుందో?

నీరసంగా ఉంది. ఎవరిదయినా చేయూత ఉంటే తప్ప లేవలేదేమో!

ఎందుకింత దిగజారింది తన ఆరోగ్యం? ఎక్కడా ఏమీ లోపం చేయడే వేణు! హార్లిక్స్...బత్తాయిపళ్ల రసం...గ్రుడ్డు...చక్కని భోజనం ... ఇరవై నాలుగు గంటలూ విశ్రాంతి...అయినా తన వొంట్లో రక్తం చేరడంలేదు! ఎలా చేరుతుంది? ఎప్పుడూ దుఃఖమే. అనుక్షణమూ విచారమే. ఆలోచనలే...అవే

తినేస్తున్నాయి తన అంత బలాన్నీ. ఎంతో ఖర్చుపెడుతున్నాడు వేణు. అంతా నిష్ఫలం. బూడిదలోపోసిన పన్నీరు.

"విశాలా! డాక్ట రేమంటున్నాడో విన్నావా?"

"లేదు."

"మందులూ...బలవర్ధకమయిన ఆహారమూ నీలో ఏమాత్రమూ మార్పు తీసుకరాలేకపోతున్నాయంటే..."

"అంటే...?"

"నువ్వు మానసికంగా సహకరించలేదన్నమాట..."

"అదేం మాట?"

"డాక్టరు మాటలు నిజమే నేమో అనిపిస్తూంది నాకు కూడా!"

విశాల అతని ముఖంలోకి చూసింది.

"నీ కళ్ళు చూస్తేనే చాలు నీ హృదయంలో ఎంత విచారం గూడుకట్టుకుని ఉందో అతిస్పష్టంగా తెలిసిపోతుంది. విశాలా, నీ కెందుకింత విచారం?"

పేలవంగా నవ్వింది విశాల. "నేను విచారించడంలేదు."

ఆ మాట అబద్ధమని అతనకీ తెలుసు, ఆమెకీ తెలుసు!

నిజమే. అమృతకలశంలో విషపుబొట్టు జీవితం ఐపోయింది తన బ్రతుకు. దేముడిలాటి భర్త. రత్నమాణిక్యాలలాటి పాపా బాబూ.

ఇంతో అంతో కలిమి. లోపమెరుగని సంసారం. అన్నీ ఉన్నాయి. ఐదో తనం తప్ప. తను సుఖపడలేదు. మిగిలినవారినీ సుఖపడనీయకుండా ఆటంకం ఔతూంది. ఇదే తనను పట్టిపీడిస్తూంది. తాను చనిపోతే-కొంచెం రోజులు విషాదం. తరువాత మళ్ళీ యీ యిల్లు కలకలలాడుతుందేమో! సవతితల్లిని కథలలోనూ సినిమాలలోనూ మరీ దారుణంగా చిత్రిస్తారు కానీ నిజజీవితంలో ఏ స్త్రీ పసివారిపట్ల కఠినంగా ఉండలేదు. తల్లయితే మాత్రం పిల్లలని కొట్టదా, తిట్టదా! అదే మరో స్త్రీ — సవతితల్లి చేసేసరికి అమానుషంగానూ అతి విడ్డూరంగానూ కనిపిస్తుంది. అంతే తప్ప ఆడమనసు చిన్నపిల్లలపట్ల నిర్దయగా ఉండలేదు. పెట్టే చేతికి కొట్టే అధికారం ఉంటుంది. ప్రేమించే హృదయం దండించనూ గలదు.

తల్లిగా తానేం చేయగలుగుతూంది? కొట్టనూ లేదు. పెట్టనూ లేదు. ఏమీ చేయ లేదు. వొట్టి శిథిలశిల్పం. పిల్లలు గాలికీ ధూళికీ పెరగవలసిందే. ఆయా ఉందంటే —ఏమీ ప్రయోజనం లేదు. అంతా వెట్టిపని. ఒకవైపు వంట, మరోవైపు ఇంటి

పని-ఇవికాక పిల్లల పోషణ. మనస్ఫూర్తిగా చెయ్యదు. డబ్బుకోసం పనిచేసే మనిషాయె! అంతకంటె ఎక్కువ ఆమెనుంచి ఆశించడం తనకీ న్యాయంకాదు. వేణు అంటాడు—"వంటకి వేరే మనిషిని పెట్టుకుందాం...అలా అయితే పిల్లల గురించి ఎక్కువ శ్రద్ధతీసుకుంటుందేమో!—

తనకి తెలుసు. వంటపనీ, పిల్లల పోషణా బ్రహ్మవిద్యలు కావు. ఎటొచ్చీ మనసుపెట్టి చెయ్యాలి. అక్కడే ఉంటుంది తేడా.

అమ్మ వండిన వంట పిల్లలకి నచ్చుతుంది. ఒంటపడుతుంది.

మగవాడి విషయమూ అంతే. భార్య చేతివంట బలమిస్తుంది. రుచిగానూ ఉంటుంది.

భగవాన్! నేను వేణుకి భార్యను కాను. పిల్లలకి తల్లిని కాను.

ఏమిటీ శిక్ష?

వేణు-శక్త్యుత్సాహాలకు నిలయం. సరదాల పుట్ట? ఎత్తున ఎగిరే గాలిపటం అవన్నీ చూసేకదూ అతనంటే ముచ్చటపడింది!

విశాల గతంలోకి పరుగెత్తింది.

* * *

కమ్మని కన్నెవయసు. బాధ్యతలుండని బంగారు రోజులు. భవిష్యత్తుగురించి బంగారు కలలుకంటూ ఊహామేఘమాలికలలో ఉత్సాహంగా ఊరేగే తిరిగిరాని తీయని రోజులవి. సీతాకోకచిలుకలా రంగురంగుల రూపంతో నిర్భావీగా నవ్వుతూ త్రుళ్ళుతూ ఎగిరే అందమయిన రోజులవి.

ఔను అది కన్నెవయసు. ఉషారయిన వయసు.

కాలేజిలో చదువుతూంది విశాల. క్లాసెగొట్టి మ్యాట్నీ చూడడం అంటే మహా సరదా. అలాగే బయలుదేరిం దానాడు-ఫ్రెండ్స్‌తో. ఫ్రెండ్స్ అంటే ముగ్గురు. విశాలా, సునీతా, మాధవీ. ముగ్గురిలోనూ అందంలో విశాల ఫస్ట్. చదువులో మాధవి. పాటలో సునీత.

ముగ్గురూ థియేటర్ దగ్గరకి వచ్చారు. టికెట్స్ తీసుకున్నారు.

మ్యాట్నీ ప్రారంభించడాని కింకా కొంచెం వేళఉంది. టికెట్స్ తీసుకున్నామన్న ధీమాతో స్టిల్స్ చూస్తున్నారు.

"మాధవీ! మధూ!"

వెనక్కి తిరిగి చూసింది మాధవి.

ఆమె కళ్లు మెరిశాయి. అతను—మోహన్.

"బావా!"

"లక్కీ! అనుకోకుండా కలిశాం. ఐతే-అమ్మాయిగారు క్లాసులెగ్గొట్టి సినిమాలకి వస్తున్నారన్నమాట. నంబరు పేపర్లో పడేయోగం-"

మాధవి నవ్వింది.

విశాల కల్పించుకుంది-"మాధవి సంగతి మీకు బాగా తెలియదు. చదవకపోయినా ఫస్ట్క్లాసే. అదీగాక-మాధవికి ప్రిమానిషన్ ఉందేమో! మీరు వస్తారని తనూ వచ్చింది."

"ఓహో! మీ ఫ్రెండ్ని బాగా వెనకేసుకొస్తున్నారు. మాధవి చాలా లక్కీ! మీలాటి స్నేహితులు దొరికినందుకు. బై దిబై-మీ పేరేమిటి?"

మాధవి-విశాలనూ సునీతనూ పరిచయం చేసింది.

కొంచెం మాటలూ, కాఫీలూ అయ్యాక-మోహన్ అన్నాడు. "మీరేమీ అనుకోకపోతే..."

"మాధవి మీకు కావాలంటారు అంతేగా? విశాల నవ్వింది." "గుడ్లక్. క్యారీ ఆన్..."

మాధవి క్షమాపణలూ గట్రా చెప్పేసి శలవు తీసుకుంది.

మోహనూ ఆమే సినిమాకంటే మంచి ప్రోగ్రామ్ వేసుకున్నారు.

"ఈ టికెట్టేంచెయ్యడం?" అడిగింది విశాల.

చటుక్కున వెనుకనుంచి ఓ యువకుడు వచ్చాడు. "చూడండి మేడమ్!"

"చూశాను."

"మీ దగ్గర ఎక్సెస్ ఉన్న టికెట్ నాకిస్తే-చాలా కృతజ్ఞుణ్ని..."

"ఇవ్వకపోతే?"

"తిట్టుకోను. నా దురదృష్టానికి చింతిస్తూ వెళ్ళిపోతాను."

"సినిమా చూడనంత మాత్రాన దురదృష్టమూ, చింతా కూడానా?,'

"దీనిలో నా ఫేవరెట్ హీరోయిన్-హేమ ఉంది."

"అయ్యో!" పెదవి విరిచింది విశాల. ఒక్కసారతని ముఖంలోకి చూసింది. అందగాడే. హుషారయినవాడు. చిలిపి అల్లరి చేయాలనిపించింది.

"టికెట్టిస్తాం కానీ-మీరు ఖరీదు చెల్లించకూడదు."

"సరే..."

గంటకొట్టగానే బాల్కనీ చేరారు.

ముందు వేణు...తరువాత విశాల...తరువాత సునీత.



హిందీ సినిమా యధావిధిగా పాటలహోరుతోనూ, డాన్సుల పరంపరతోనూ, డ్రీమ్‌సీక్వెన్సుల తోరణాలతోనూ, అరుపులతోనూ ఫైటింగ్‌లతోనూ కథ అనేది ఆట్టే లేకుండా కాగితపు పూలవంటి పాత్రలతో-మొత్తానికి అయిందనిపించింది.

"హేమ నవ్వకుండా ఉంటే బాగుండును-" అన్నాడు వేణు.

"ఏం?" అడిగింది విశాల.

"మర్లిన్ మన్రో చనిపోయాక-నవ్వినా అందంగా ఉండే తారలు లేక పోయారు."

"రాజేష్ బొత్తిగా - తెగ ఊది పగిలిపోడానికి రెడీగాఉన్న బెలూన్‌లాగ కనిపించలేదూ?"

"ఊఁ." మెల్లగా అన్నాడు వేణు. "ఇకనుంచి హేమామాలిని అంటే పడి చావడం మానేస్తాను. ఇంట్లో క్యాలెండర్లన్నీ చించి తగలేస్తాను."

"మరెవరంటే పడిచస్తారు?"

"మీరంటే..."

"ఆఁ." ఆశ్చర్యపోయింది విశాల.

"ఔను మాడమ్, అందమయిన నిజం కన్నులకెదురుగా ఉండగా - నీడలను ఆరాధించడం మూర్ఖత్వం కాదూ? మిమ్మల్ని చూశాక నాకు జ్ఞానోదయం అయింది.

"జ్ఞానోదయమా, ప్రేమోదయమా?"

"రెండూనూ."

సునీత నవ్వింది-విశాలవంక చిలిపిగా చూస్తూ, "మరి-మా విశాల హేమ అంత అందంగా ఉంటుందో ఉండదో?" అంది వేణు నుద్దేశించి.

"ఎంతో మేకప్ చేస్తే తప్ప అందంగా కనిపించని హేమకీ, ఏమీ అలంకరించుకోకపోయినా అందంగా ఉండే విశాలకీ-పోలిక తేకండి. ఇన్నాళ్లూ నేను మూర్ఖుడిగా ఉండిపోయానని ఒప్పుకున్నాను కదా!"

వేణు బలవంతంమీద డ్రింక్స్ స్టాల్‌లోకి వెళ్ళి డ్రింక్స్ తీసుకున్నారు.

విడిపోయేముందు అడిగాడు వేణు. "ఇవాళ పిక్చర్ మీరు నాకు చూపించారు. మరి-మీకు నేను పిక్చర్ చూపించే అవకాశం కలిగించి త్వరలో నన్ను ధన్యుణ్ని చేస్తారని నమ్ముతున్నాను. ఇదిగో నా అడ్రస్..."

అతని గడుసుతనానికి మెచ్చుకుంది విశాల. "అలాగే."

వేణు చాలా సరదా మనిషి. సునీత కూడా సరిగ్గా అలాగే అంది. "గుడ్ గయ్—"

తరువాత వారం తిరక్కుండానే వేణుకి ఫోన్ చేసింది.

"థాంక్యూ. క్యాంపస్‌లో వెయిట్ చేయండి. వచ్చేస్తున్నాను-"

విశాల లేడీస్ వెయిటింగ్‌రూమ్‌లో టాయ్‌లెట్ అయి-గేటువరకూ వచ్చింది. సరిగ్గా అదే సమయానికి బులెట్‌లా దూసుకువచ్చి-బంప్‌తో ఆగింది వెస్పా.

"దయచేసి కూర్చోండి."

ఆమె కూర్చుంది. స్కూటర్ వేగంగా పరుగెత్తసాగింది. ఆమె అతని భుజం మీద చెయ్యివెయ్యక తప్పలేదు. అతనినుంచి సన్నని-క్లోజ్‌సెంట్ తాలూకు వాసనలు వస్తున్నాయ్. ఆ స్పర్శ అమిత సుఖాన్నిస్తూంది.

స్కూటర్-"వోల్గా" రెస్టారెంట్ ముందాగింది.

"కొంచెం టిఫినూ అవీ తీసుకు వెళ్దాం. అభ్యంతరం లేదుగా?"

"నాట్ఎటాల్."

అతని మాటలు చక్కగా ఉంటాయి. తిరస్కరించడం అతికష్టం.

టేబుల్ ముందు కూర్చున్నారు. అది-రెస్టారెంట్ కమ్ బేకరీ కమ్ బార్. మధ్యాన్నం కావడాన బార్ సెక్షన్ మూసిఉంది.

బ్రెడ్‌టోస్టూ, నెస్కెఫే చెప్పారు.

"సినిమాకంటే మంచి ప్రోగ్రామ్ వేశాను. మీరు ఓకె చేస్తే..."

"ప్రోగ్రామ్ చెప్పండి-"

"ఎగ్జిబిషనుంది. తెలుసుగా?"

"ఎక్సలెంట్...సినిమా ఎప్పుడయినా చూడొచ్చు. ఎగ్జిబిషన్‌కి వెళ్దాం."

"థాంక్యూ."

బిల్లు చెల్లించబోయింది విశాల.

"ప్లీజ్...మీకు న్యాయంకాదు. ఉద్యోగస్తుణ్ని నేను. మీరేమో విద్యార్థులు. అందుచేత..."

"నాకు పాకెట్‌మనీ యిస్తారు నాన్న."

"పాకెట్‌మనీ కాదు. వాలె మనీ—" నవ్వాడు వేణు.

అతను చక్కగా నవ్వగలడు. నవ్వుతూంటే ఎందుకో కళ్ళు అరమోడ్పు లౌతాయి. అది అతనికి చాలా అందాన్నిస్తుంది. అసలే హుందా ఐన మనిషి. అందం తోడైంది. మాటకారితనానికి కొదువలేదు. ఇంకేం కావాలి? ఆడపిల్లలు యినుపముక్కలై ఆ అయస్కాంతాని కాకర్షితులౌతారు. విశాల-వేణుపట్ల ఆకర్షితురాలయింది.

బిల్లు చెల్లించి—బయటకు వచ్చారు.

"స్టాల్స్ అన్నీ తెరవాలంటే నాలుగు ఔతుంది. ఈలోగా ఏమయినా చేద్దాం."

"ఏం చేద్దాం?" అడిగింది విశాల.

"సింహాచలం వెళ్దామా?"

"అంత దూరమా!"

"చేతిలో స్కూటరుంది. దూరమేమిటి?"

స్టార్ట్ చేశాడు. అద్భుతమైన వేగంతో పరుగెత్తసాగింది స్కూటర్.

అంతవేగం అనుభవానికి వస్తూంటే తమాషాగా ఉంది విశాలకి.

భయం మాత్రం వేయడంలేదు. ఏదో ధైర్యం. ఔను. వేణు ఉన్నాడు. తన కేమీ అపాయం ఉండదు.

"మీ చేతిలో స్కూటర్ కూడా జట్‌ప్లేన్‌లా దూసుకుపోతూందే!"

"థాంక్యూ. దీనికీ నాకూ చాలా ఎక్కువ అనుబంధం. అందుకే సమయా సమయాలూ యుక్తాయుక్తాలూ ఎరిగి మసలుకుంటుంది."

విశాల పైటచెంగు తెరచాపలా ఎగురుతూంది గాలికి. ఉండుండి అది వేణు ముఖానికి కొట్టుకుని గిలిగింతలు పెడుతోంది. విశాల అతని మెడచుట్టూ చేయి వేసి గట్టిగా పట్టుకుని కూర్చుంది.

"స్పీడు తగ్గించేదా?"

"వద్దు. ఇదే బాగుంది."

స్కూటరు-కొండమీదకు వేసిన రోడ్డెక్కసాగింది. టాప్ గేర్‌లో వెళ్తుందేమో గీపెడుతూంది. ఒకరి మాటలొకరికి వినిపించడంలేదు.

స్కూటర్ ఆపేశాడు వేణు. దిగాడు.

"ట్రబులా?" అడిగింది విశాల.

"ఉహుఁ. అటు చూడండి."

ఏదో చెట్టు. ఎర్రని గుత్తులు. పూలుతప్ప ఆకులేదు ఒక్కటయినా. చాలా అందంగా ఉంది

"అక్కడ కూర్చుందాం."

"దేముడి దగ్గరకు వెళ్లొద్దూ?"

"దేముడు లేనిదెక్కడ? సత్యం, శివం, సుందరమ్. ప్రకృతే దేముడు.'' మందహాసం చిందించాడు వేణు.

విశాల మరేమీ అనలేదు. మంత్రముగ్ధలా అతని వెనుక నడిచింది.

చెట్టుక్రింద కూర్చున్నా రిద్దరూ.

"మీరు చాలా అందమైనవారు.''

"మీకంటేనా? ఐనా ఆ మాట చెప్పడానికే అయితే యింతదూరం శ్రమపడి రావడం దేనికి?" నవ్వింది విశాల.

"ఇంకా చెప్పాలనే ఉంది. కాని-మీరేమయినా అనుకుంటారేమో అని సంశయిస్తున్నాను. మీరు కోపం తెచ్చుకోనని భరోసాయిస్తే..."

"ఇచ్చాను? చెప్పండి." పెదవులతో నవ్వు బిగించి అంది విశాల.

"ఐ లవ్ యు-" అనేశాడు వేణు ఒక్కసారి.

విశాల ముఖంలో మార్పువచ్చింది.

మందహాసం మాయమైంది. గంభీరంగా ఐపోయింది.

"సారీ! తొందరపడ్డాను-"

"కాదు-"

"మరి?"

"ఈ ప్రేమలలో నాకు నమ్మకం లేదు."

"మరి? ఏ ప్రేమలో మీకు నమ్మకం?" అడిగాడు.

"వివాహానంతరం భార్యాభర్తల నడుమ ఉండే ప్రేమలో..."

"ఐతే మనం వివాహం చేసుకుందాం." హఠాత్తుగా అనేశాడు వేణు.

"అంత సులభమా?"



''ఎందుకు కాదు?'' ఎదురుప్రశ్న వేశాడు. ''మీకేమయినా అభ్యంతరమా?''

''కులం, గోత్రం...ఆర్థికపరిస్థితులు ... వివాహం అనగానే ఎన్నాలోచించాలి? పెళ్ళిళ్ళు సులభంగా జరిగిపోతే మనదేశం యిలాగ ఎందుకుంటుంది?''

''నాకు కట్నం అక్కర్లేదు. పైగా అలా అమ్ముడుపోవడం అంటే అసహ్యం కూడా.''

''థాంక్యూ.''

''నెలకి వెయ్యిరూపాయల జీతంతో నేను నా భార్యని సుఖపెట్టగలననే నమ్మకమూ ఉంది. పోతే-కులం—'' చెప్పాడు వేణు.

విశాల కళ్లు మెరిశాయి. ఎంత చక్కని మనిషి మీరు!''

''మీకంటె కాదు.'' నవ్వాడు వేణు.

''నాన్నగారికి సూచిస్తాను. కాదనరనే నా విశ్వాసం.''

''అలాగే. మీరే మంచి సమయంచూసి నన్ను వారికి పరిచయం చేద్దురుగాని. తరువాత...'' ఆగిపోయాడు వేణు.

''వెండితెరపై—'' నవ్వుతూ అంది విశాల.

''ఉహుఁ బంగారు జలతారు తెరపై—'' సవరణ చేశాడు వేణు.

తన అదృష్టానికి మురిసిపోతూంది విశాల. వేణు ఎప్పుడు లేచివెళ్ళాడో

ఆమెకు తెలియదు. ఆమెకు తెలిసేసరికి-తన చెయ్యి అతని చేతిలో ఉంది. కెమెరా క్లిక్ మంది.

"ముందరి కాళ్ళకు బంధమా?"

"ఉహు. తీయని బంధానికి నాంది." ఆమె చెయ్యివదిలి - "భయపడకండి. ఈ రీలంతా తీసి-మీకే యిస్తాను. ప్రింట్స్ తీయించి - పెళ్ళినాడే నాకు ప్రెజంట్ చేద్దురుగాని. ఏం?...విశాలా! నేను ప్రమాదకరమైన మనిషిని కాను. దుర్మార్గుణ్ణి కాను. నన్ను నమ్మండి. కాకపోతే కొంచెం ఉషారెక్కువ. మీలాటి అందమయిన అమ్మాయి సమక్షంలో ఏ అబ్బాయయినా యీ మాత్రం అల్లరి చేయకుండా ఉండలేడు. అలా ఉంటే అతనిలో ఏదో లోపం ఉందన్నమాటే."

"గడుసువారే. మీ తప్పుకి బాధ్యత నామీదకే నెట్టి-తప్పించుకుంటున్నారు!"

ఇది నాకు తప్పులా కనిపించడంలేదు. క్షమించండి."

"ఉహుఁ. శిక్షించి తీరుతాను."

"రెడీ!"

కెమెరా క్లిక్‌మంది. వేణు నవ్వాడు. "అందమయిన అమ్మాయి అందంగానే శిక్షించగలదు. ఇంకా చాలా తప్పులు చేయాలనిపిస్తోంది."

"పెంకి."

"పెళ్ళిచేసుకుని వదలగొడుదురుగాని. ఎగ్జిబిషన్ టైమౌతూంది! వెళ్దామా?"

"పదండి. రీలు మీరే డెవలప్‌చేయించి ప్రింట్స్ చూపించండి."

స్కూటర్ కొండ దిగసాగింది.

చక్కని గాలి. సంపెంగల పరిమళం.

"వేణూ!-"

"ఊఁ."

"మీరు నన్ను వివాహం చేసుకుంటే ఎందరమ్మాయిలకి నిరాశ మిగులుతుందో?"

"అలా ఏమీ కాదు. మీరు నాగురించి ఏమనుకుంటున్నారో! ఇంతవరకూ నాకు నిజంగా గర్ల్‌ఫ్రెండ్స్ లేరు. మిమ్మల్ని చూసేవరకూ ఎవరినీ ప్రేమించనూలేదు."

నమ్మలేకపోయింది విశాల.

అందమయిన తుమ్మెదను ఎన్నోపూలు అరాధిస్తూనే ఉంటాయి. తుమ్మెద

ఊరుకున్నా పూలూరుకుంటాయా? రెచ్చగొట్టితీరతాయి. తుమ్మెద నిగ్రహంగా ఉండగలదా?

విశాలకు తన పరిస్థితి జ్ఞాపకం వచ్చింది. ఎన్నోసార్లు ఎందరో తనకు ప్రేమలేఖలు వ్రాశారు. ఐతే-అవేవీ తనని ప్రభావితం చేయలేదు. ఎందరో ప్రేమిస్తున్నామన్నా చలించని తాను వేణుని చూడగానే-రెండుమాటలు మాట్లాడ గానే ప్రేమలో పడిపోయింది! చిత్రంగా లేదూ?

ఇదేనేమో ప్రేమంటే. వేణుది కూడా సరిగ్గా యిటువంటి పరిస్థితే ఏమో? కావొచ్చు. అతన్ని ఎందరు ప్రేమిస్తే తనకేం? అతను తనని ప్రేమించాడు. అది చాలు. ఆ వరం నిలుపుకోగలగాలి తను. వేణువంటి విశాలహృదయుడు లభించడం ఎంతో పుణ్యం. తను అనవసరంగా అతన్ననుమానించింది. వేణు అలాగ చెయ్యలేదు. ఎంత నమ్మకం అతనికి తనంటే.

విశాల పొంగిపోయింది.

తరువాత చాలా రోజులు ఇద్దరూ స్నేహంగా తిరిగారు.

వేణుది విశిష్టమయిన వ్యక్తిత్వం తనెంత చనువిచ్చినా అతనేనాడూ హద్దు మీరలేదు. చేతిలోకి చెయ్యితీసుకోడం-ఒక్కసారికాబోలు ముద్దుపెట్టుకున్నాడు. అంతే. ఆపైన ఏమీలేదు.

పరీక్షలయిపోయాయి.

వేణుతో స్నేహం చాలా గాఢం ఐపోయింది.

షికార్లు...సినిమాలు...స్వీట్ నథింగ్స్...

వేణుని విడిచి ఉండలేని స్థితికి వచ్చేసింది.

అమ్మా నాన్నా కాదు భగవంతుడు కాదన్నా వేణు లేకుండా జీవించడం తనకసాధ్యమని తెలిసిపోయింది.

ఔను. వేణు అంతటి చక్కని మనిషి.

ఓ సాయంత్రం నాన్నతో మాట్లాడింది. జాగ్రత్తగా వేణు గురించి చెప్పింది. ఇద్దరూ ప్రేమించుకొన్నట్లు చెప్పింది.

"ఆల్ రైట్. రేపతన్నొకసారి నన్ను కలుసుకోమను. కొంచెం మాట్లాడి, మనిషెటువంటివాడో తెలుసుకుంటాను."

మర్నాడు వేణుకి చెప్పి యింటికి రమ్మంది. వేణులాటి మనిషి నచ్చక పోవడమా! అసంభవం.

"నాకు కట్నం అంటే అయిష్టం. పెళ్ళికూడా సింపుల్‌గా ఆట్టే ఆర్భాటమూ పెద్ద ఖర్చూ లేకుండా చేయిస్తే సంతోషిస్తాను."

నాన్నకి అమృతంలో స్నానంచేసినట్లే అనిపించింది వేణు మాటలు వింటూంటే. వేణుని కౌగలించుకుని ఆనందబాష్పాలు కురిపించాడు.

"విశాలని చదివించి ఉద్యోగంలో చేర్పించా లనుకున్నాను, పెళ్ళి చేసే శక్తి లేక. దేముడిలాగ లభించావు నువ్వు. విశాల అదృష్టవంతురాలు."

పదిరోజులలో పెళ్ళయిపోయింది.

మధురస్వప్నంలాగ ఆనందమయమైన రోజులు యిట్టే గడచిపోయాయి. సౌజన్య పుట్టింది. పాపంటే ఎంత ప్రేమ వేణుకి!

ఓసారి నవ్వుతూ అంది. "పిల్లలు పుట్టాక స్త్రీ భర్తకు కొంచెం దూరం ఔతుంది. అది సహజం. కాని-సౌజన్య పుట్టాక మీరే నాకు దూరం ఔతున్నారు. విచిత్రంగా లేదూ?"

"సౌజన్యతో నీకు పోటీయా? ఐతే సౌజన్య గెలుస్తుంది." నవ్వాడు వేణు. తను ఉడుక్కున్నట్లు ముఖం పెట్టింది.

"చూడు విశాలా. జీవితానికి అర్థాలు మారుతుంటాయి. ఇన్నాళ్ళూ నాకు నువ్వు నీకు నేనూ. మన మధ్య ఎప్పుడయిదే పిల్లలు వచ్చారో-ఇక మనం యిద్దరమూ పిల్లలకోసమే!" గంభీరంగా అన్నాడు.

తను గర్వపడింది. తృప్తిగా నిట్టూర్చింది.

ఈ మనిషికి బాధ్యతకూడా చక్కగా తెలుసు. భార్యకి చక్కని భర్త మాత్రమే కాదు. పిల్లలకు మంచి తండ్రికూడా!

సౌజన్య అంటే వేణుకి ఎక్కడలేని ముద్దూ.

మూడు సంవత్సరాలు తిరిగేసరికి బాబు కడుపున పడ్డాడు.

బాబు పుట్టాక పురిటిలో ఆరోగ్యం చెడింది తనకి. క్రమంగా పక్షవాతానికి దారితీసింది. అంతే. తీయని గానంలాటి జీవితం కాస్తా ఆగిపోయింది. అడుగడుగునా అపశ్రుతులే. విధి వెక్కిరిస్తూంటే కూడా వేణు సరకు చెయ్యలేదు. తనని ఆదరించేవాడు. ఉత్సాహపరిచేవాడు. మాటలతో మురిపించేవాడు. ఆశలు రేపేవాడు. అవతలిగట్టున అదృష్టం ఎదురుచూస్తూందనీ అందుకుందుకు ప్రయత్నించాలనీ బోధించేవాడు. ఆరోగ్యం చక్కబడుతుందని అవీ యివీ చెప్పేవాడు.

వేణు ఎంత సహనమూర్తి!

తన ఆరోగ్యాన్ని బాగుచేసేందు కతను చెయ్యని ప్రయత్నం లేదు. చూడని డాక్టరు లేడు. వేలకివేలు ఖర్చుచేశాడు. కాబట్టే కర్రసాయంతో అయినా కొంచెం అడుగులు వేయగలిగే శక్తి వచ్చింది.

వేణు తనకెంత చేశాడు! ఆ పురుషోత్తముడికి తానందిస్తున్న ప్రతిఫల మేమిటి? అసౌఖ్యం. అశాంతి. ఆవేదన.

ఇంటికి వచ్చేసరికి ఏదో సమస్య. చికాకు.

బయట పనులతో ఆలసి సొలసి యింటికి వచ్చేసరికి చిరునవ్వుతో ఎదురుకాక పోతేమానె జబ్బుమంచం ఎదురయితే ఆ మగవాడు పడే మానసిక క్షోభ ఎంతటిదో! ఒక రోజుకాదు, రెండురోజులు కాదు_నెలల తరబడి...సంవత్సరాల తరబడి యింతే. ఇక ఎంతటి సహనమూర్తయితే మాత్రం ఏం సహించగలడు?

సౌఖ్యం అందించడం సంగతి దేముడెరుగు, సమస్యలను అశాంతినీ అందిస్తూంది తను. ఎన్నాళ్ళు భరించగలడు వేణు? బయటపడకపోయినా లోపల ఎంత చిరాకుపడుతున్నాడో?

ఏ అందాన్ని మోహించి పెళ్ళిచేసుకున్నాడో ఆ అందం అతనికిప్పుడు అందడంలేదు. ఎంత నరకం!

పాపం. వేణు!

జాలిగా నిట్టూర్చింది విశాల. తనన చేసుకుని నరకం అనుభవిస్తున్నాడు కదా వేణు. పూర్తిగా నరకం కాదేమో? ఈ మధ్య అప్పుడప్పుడు రాత్రులు ఆలస్యంగా వస్తున్నాడు.

ఓసారి తను అడిగింది. "ఆఫీసులో యింత ఆలస్యమైందేం?"

"ఆఫీసులో కాదు."

"మరి?"

"ఫ్రెండ్స్ కలిశారు. సరదాగా కార్డ్స్ వేద్దామన్నారు."

"పోన్లెండి. వచ్చిందా, పోయిందా?"

"పోయింది."

"ఎంత?"

"పాతిక పైచిలుకు."

"భోజనం చెయ్యండి త్వరగా. వేళదాటిపోయింది."

"ఓ ఫ్రెండ్ డిన్నరిచ్చాడు. నువ్వు అన్నం తిన్నావా?"

"ఊఁ"

"నిజం చెప్పు విశాలా. నువ్వు అన్నం తిన్నట్లు లేదు."

ఆమె మౌనం దాల్చింది.

వేణు లోపలికివెళ్ళి తొందరగా ప్లేటుతో అన్నం కూరలూ వేసి తెచ్చాడు. విశాలకి తినిపించాడు ప్రతిమాలి.

అతని ప్రవర్తన ఆమెకు అనుమానం కలిగించింది.

ఇదంతా నిజమేనా? నటన కాదుకదా? అతనికి తనంటే యింకా ప్రేమ మిగిలి ఉందా? ఏమీ ప్రతిఫలం లభించదు తననుంచి. పైగా తనొక తీరని సమస్య. నిజంగా అతను మనస్ఫూర్తిగానే తినిపించాడా? లేక–గిల్టీ కాన్షస్‌తో... నటించాడా?

"వేణూ!" అతని చేతులు పట్టుకుంది.

"డాక్టరేంచెప్పాడు? నీకు పూర్తిగా విశ్రాంతి అవసరమని చెప్పలేదూ? ఇక పడుకో. చాలా వేళయింది." చిన్నలైటు వేసి–తనకి బ్లాంకెట్ సరిగాకప్పి– తన గదిలోకి వెళ్ళిపోయాడు.

ఆమెకు ఏడుపే వచ్చింది.

తను ఎందుకూ కొరగాదు. నిజమే. కాని–తనకింకా ప్రాణం ఉంది. హృదయం ఉంది. మెదడుంది. కదలలేకపోయినా శరీరమూ ఉంది.

మనుసుకి చల్లనిమాట కావాలి.

గుండెకి ధీమా కావాలి. హృదయానికి తృప్తి కావాలి. తనూ మనిషే.

అతనీ గదిలో పడుకుంటే? కొంప మునుగుతుందా?

ఊహుఁ. తనకి ధైర్యంగా నిద్రపడుతుంది.

మనసుకి తృప్తిగా ఉంటుంది.

అతనలా చెయ్యడు. ఆ గదిలోనే పడుకుంటాడు. పిల్లలూ అతనూ ఆ గదిలో. తను ఒంటరిగా యీ గదిలో. వెలివేయబడినట్లు. విసిరివేయబడ్డట్లు.

ఏమిటీ శిక్ష తనకి?

కేవలం ధర్మం నిర్వర్తిస్తున్నాడు వేణు.

అతనిదంతా నటన. తను అతనిగురించి ఆలోచించడం వ్యర్థం. అతనికి తనేమీ కాదు. మెడకి చుట్టుకున్న గుదిబండ. పైకి తేలకపోయినా యీ పీడ ఎప్పుడు వదులుతుందా అనే అతనూ చూస్తున్నాడేమో? ఏమో?

ఒకనాడు ఆఫీస్‌వర్క్. మరోనాడు డిన్నర్...మరోనాడు క్లబ్...ఇంకో సారి పేకాట. స్కూటర్ ట్రబుల్...తరచుగా రాత్రులు ఆలస్యంగానే

వస్తున్నాడు. ఏంచేస్తాడు? ఇంట్లో దొరకని అందాన్ని బయట వెదుక్కుంటున్నాడేమో? కావచ్చు. ఆలి మూలబడినా అతని వాంఛలు మూలపడవుకదా? అసలే శక్తీ ఉత్సాహమూ అధికం అతనికి. వయస్సు మాత్రం ఏమంత? రక్తంలో వడీ వేడీ తగ్గిపోలేదు. అందుచేత అతను పైతిరుగుళ్లు తిరిగినా ఆశ్చర్యమూలేదు, అసహజమూలేదు. కాని-అతను తనముందు ఎందుకు నటించాలి ఎంతో ప్రేమ వొలకబోస్తూ?

కన్నీరు ఉబికింది. వేణుమీద కోపంవచ్చింది.

ఒకవేళ-వేణు యిలాగ అయి-తను ఆరోగ్యంగా ఉండి-అతన్ని కాదని మరొకరితో...అయితే అతను సహించగలిగేవాడా?

ఛీ. వద్దు. అటువంటి పాపపు తలపులు వద్దు. వేణు ఎప్పుడూ హాయిగా ఉండాలి. ఈ సంసారనౌకకి అతనే సారధి.

మగవాడు. అతనేం చేసినా తప్పులేదు. పరిస్థితు లటువంటివి. అతనేం చెయ్యగలడు? మనిషన్నాక బలహీనతలు తప్పవు. శరీరంలో ప్రవహించే రక్తం మనిషిని ఊరికే ఉండనివ్వదు. చాలామంది మగవాళ్లకంటె వేణు చాలా నయం. ఎప్పుడూ తను అతనిగురించి వక్రంగా ఆలోచించకూడదు. అతన్ని కొంచమయినా సుఖపెట్టడంలేదు. కనీసం అతని సుఖాలకి అడ్డుపడకుండా నయినా ఉండడమే తనకి న్యాయం.

గడియారం మూడుగంటలు కొట్టింది టంగ్ టంగ్ మంటూ.

విశాల ఆలోచనలు ముగిసిపోయాయి.

## 3

ఆకవరింకా అలాగే పడి ఉంది. గాలి వీస్తూంది కానీ కవరు కొంచమయినా ముందుకి జరగడంలేదు. ఏం వార్తలున్నాయో దానిలో? ఎవరు వ్రాశారో?

కర్ర చేతికందితే బాగుండును. ఓపికచేసుకుని కవరందుకునేది.

"బాబూ!-" నీరసంగా పిలిచింది.

''బాబు ఆడుకుంటున్నాడమ్మా. తెచ్చేదా!'' వచ్చింది ఆయా.

''అవసరంలేదు. కర్రలందించు. ఓసారి లేవాలని ఉంది.''

''మీ రెందుకమ్మా శ్రమపడిలేవడం? ఏంకావాలి చెప్పండి...బెడ్‌పానా? బేసినా?''

"అనవసరపు ప్రసగం చెయ్యకు. నే నొకసారి లేవాలి...'' కసిరింది విశాల.

ఆయా ఆమెను లేపి కూర్చోబెట్టింది. కర్రలందించి మంచం దింపింది.

"ఆ కవరిటు తే-"

ఆయా కవరందించింది.

"కటకటాల దగ్గర కుర్చీపడెయ్."

కర్రలతో మెల్లగా కుంటుకుంటూ కుర్చీవరకూ వెళ్ళి కూర్చుంది

మెల్లగా కవరు చింపింది.

"వేణూ! ఇక్కడ మేమంతా క్షేమంగా ఉన్నాము. నువ్వూ పిల్లలూ కులాసా అని తలుస్తాను. విశాల పరిస్థితి ఏమయినా మెరుగయిందా? లేచి తిరగగలుగుతూందా? నీ దురదృష్టానికి చింతించని క్షణంలేదు.

"మా పరిస్థితులు నీకు తెలియనివి కావు. శారద ఎదిగికూర్చుంది. పెళ్ళీడు కొచ్చింది. చదువయినా అట్టె అబ్బలేదు. పెళ్ళి వినా గత్యంతరంలేదు. శారదకి పెళ్ళి చేసేస్తే మా గుండెలమీద బరువు తొలగుతుంది. శారద గురించి నీకు చెప్పవలసిందేముంది? మంచి పెళ్ళికొడుకుని చూడు. ఆర్థికంగా శక్తివంతుడిని కాను. అట్టె కట్నకానుక లిచ్చుకోగలవాడను కాను మరి. గంతకు తగ్గ బొంత దొరికి శారద ఒకింటిదయితే నేను తెరిపిన పడతాను.

"నాకు చిన్న సాయంచేసిపెట్టు. శారదకి తగిన వరుణ్ని చూసే ప్రయత్నం చెయ్యి. శారద పెళ్ళికి నువ్వే పెద్దవు.

"బాబుకీ పాపకీ నా ఆశీర్వచనాలు. త్వరలో సమాధానం రాయి.

"మరచిపోయాను. మొన్న ఒకరు వచ్చి శారదను చూశారు ఏమీ మాట్లాడలేదు. కనుక ఆ సంబంధంమీద అట్టె ఆశలు పెట్టుకోలేదు.

"జవాబుకోసం ఎదురుచూస్తూంటాను..."

ఉత్తరం మడిచి కవరులో పెట్టింది విశాల. ఉత్తరం చదివేసరికి తండ్రిని చూసినట్లె అనిపించింది. శారద ఒక్కసారి తలపుల్లో మెదిలింది.

శారద పెళ్ళీడుకొచ్చింది! ఔను. ఇందులో ఆశ్చర్యమేమీలేదు. తనకంటె నాలుగేళ్ళు చిన్నది. తన పెళ్ళయి ఆరేడేళ్ళు దాటుతోంది. కనుక శారద పెళ్ళికి సిద్ధంగా ఉండడం విచిత్రం కాదు.

తనూ శారదా...రూపంలో చాలా పోలికలున్నాయి. కన్నూ ముక్కూ తీరొకటే. ఎటొచ్చీ తను కొంచం సన్నగా ఉంటుంది. శారద బొద్దుగా ఉంటుంది. వేణు శారదని ఆటలుపట్టించేవాడు-'బందరులడ్డు.' అంటూ. శారద కూడా అతని కేమాత్రం తీసిపోయేదికాదు. ఆటలు పట్టించేది. ఇద్దరూ కూడారో యిల్లుపీకి పందిరేసేవారు. అల్లరిలో ఎవరికెవరూ తీసిపోరు.




తనలో చిలిపితనం తక్కువ. ఎందుకనో కొంచం నెమ్మదిస్వభావం. మొదట్లో వేణు వెక్కిరించేవాడు. "విశాలా! నువ్వెందు కిలా ఉంటావు? మీ చెల్లిలా తుళ్లితుళ్లి పడవేం? ఆడపిల్లలలా ఉంటేనే సరదాగా ఉంటుంది అంతేకాని కనిపించని బరువేదో మోస్తున్నట్లు గంభీరంగా ఉండకూడదు. బాధ్యతలు నెత్తిన పడ్డాయంటావా, అది వేరే మాట!"

నవ్వుతూ అనేది తాను. "మరి నన్నెందుకు ప్రేమించి పెళ్ళిచేసుకున్నారు. తొందరపడి?"

వేణుకూడా నవ్వేసేవాడు. "నిజమే, తొందరపడిపోయాను-నీ అందంచూసి. అయినా నా కంటికి కనపడకుండా నువ్వు మీ చెల్లెల్ని దాచేశావు. లేదంటే శారదనే..." పక్కనే ఉండేది శారద. "ఫో బావా!"

"పోతాను. మీ అక్కనికూడా వెంటబెట్టుకుని."

విశాల మెదడులో ఎందుకో గతం మెదిలింది.

ఒక్క నిట్టూర్పు విడిచి-మళ్ళీ ఉత్తరం చదివింది. ఈసారి ఉత్తరం చదువుతూంటే కొత్త అర్థాలు స్ఫురించాయి. అవన్నీ ఉత్తరంలో ఉన్నాయా!

గజగజ వణికిపోయింది విశాల.

ఆమె గుండెలు దడ దడ కొట్టుకున్నాయి. భయంతో వొళ్లు జలదరించింది. చూడలేనట్లు-నీరసంగా కనురెప్పలు వాలిపోయాయి.

కుర్చీలో వెనక్కి వాలిపోయింది.

కొన్ని నిముషాలు. నిశ్శబ్దంగా కాలగర్భంలోకి జారిపోయాయి.

"అమ్మా!"

బలహీనంగా కన్నులు తెరిచింది విశాల.

తనపాదాలు పట్టుకుని నిలుచుని ఉన్నాడు బాబు.

వాడి నెత్తుకుని గుండెల కదుముకుంది.

"ఛీ-" చీదరించుకున్నాడు.

"ఏం?" తెల్లబోయింది విశాల.

''కంపు-మందు కంపు...''

వాడిని దింపేసింది.

''మీకు హార్లిక్స్‌కి వేళయిందమ్మా!'' వచ్చింది ఆయా.

"నాకు తొందరలేదు కానీ ముందు బాబుని తీసుకెళ్లి స్నానంచేయించు."

తెల్లబోయింది ఆయా. "బాబు నీటుగానే ఉన్నాడు కదమ్మా? ఇప్పుడే ముఖం కడిగి పౌడరు వ్రాశాను.

"ఈ యింట్లో నాలుగు కాలాలపాటు పనిచెయ్యాలని ఉంటే-ముందు నేను చెప్పినట్లు చేసిరా. ఎదురు సమాధానాలు చెప్పడం మంచిదికాదు."

ఆయా బాబుని లోపలికి తీసుకువెళ్లిపోయింది.

లోపలనుంచి బాబు ఏడుపు.

విశాల హృదయం తల్లడిల్లిపోయింది. ఏంచేస్తూంది ఆయా? తనమీది కోపం ఆ పసివాడిమీద తీర్చుకోడం లేదుకద?

ఒక్కసారి పరుగెత్తుకువెళ్ళి లోపలఏంజరుగుతూందో చూడాలన్నంత ఆవేశం వచ్చింది. ఎలాగో నిగ్రహించుకుంది.

ఆమె కన్నులు ఆర్ద్రాలయ్యాయి

భగవంతుడా! నాకెంత శిక్ష వేశావు!

నాలుగు గంటలు దాటిపోయింది. ఇంటిముందు కాన్వెంట్ బస్ ఆగిన శబ్దం.

అటు చూసింది విశాల. సౌజన్య బస్ దిగుతోంది.

ఎదురు వెళ్ళి తీసుకురావాలన్న కోర్కె కలిగింది. అంతలోనే తన అశక్తత గుర్తుకొచ్చింది.

బస్ దిగుతున్న యిద్దరు పిల్లలను వాళ్ళ మమ్మీలు గ్రీట్‌చేసి రిసీవ్ చేసుకుంటున్న దృశ్యం. సౌజన్య చిన్నబుచ్చుకున్నట్లు నీరసంగా భారంగా అడుగులు వేస్తూ గేటుతలుపు తెరిచి వస్తూంది.

పాపిష్టిదాన్ని-తనను తానే తిట్టుకుంది విశాల.

సౌజన్య తిన్నగా లోపలికి వచ్చేసింది. పొరపాటున దృష్టిపడినట్లు ఒక్కసారి మమ్మీ వంక చూసి-అంతలోనే దృష్టిమరల్చుకుని లోపలకు నడిచి కేక వేసింది. "ఆయా !"

"ఉండమ్మా. తమ్ముడికి నీళ్ళు పోస్తున్నాను."

"నా బ్రెడ్డూ బోర్న్‌విటా ఏవీ ?"

"కొంచెం ఆగమ్మా, తెస్తాను."

"నో." అర్జంట్‌గా పట్రా." అరచింది సౌజన్య. "ఆకలేస్తూంది."

"పదినిముషా లాగాలి."

"నో!" సౌజన్యకు కోపంవచ్చింది. "ఐయామ్ వెరీ హంగ్రీ."

ఇక విశాల ఆగలేకపోయింది. "పాపా! నీకు ఆకలిగా ఉంటే నా మంచం మీద ఆపిలుంది తీసుకు తింటూ ఉండు."

"సారీ...వద్దు."

"ఏం ?"

సౌజన్య మౌనందాల్చింది.

"ఆకలిగా ఉందంటున్నావుగా ? తిను. ఆపిల్ నీ కిష్టమే..."

"క్షమించు మమ్మీ..."

బ్రాన్పడిపోయింది విశాల.

సౌజన్య తనని శత్రువులా చూస్తుందేం ? తను తల్లి. ఇప్పుడు నొసటి గీత చెడి పాపకి ఏమీ చేయలేని పరిస్థితిలో చిక్కుకుంది. చేత్తో అందించలేదు నిజమే. సౌజన్య తీసుకోవచ్చుగా ?

ఉహుఁ. తీసుకోలేదు. ఇంకా బలవంతం చేస్తుందేమో అని లోపలికి వెళ్ళిపోయింది. ఆకలినయినా భరిస్తుందికానీ అమ్మమాట విని ఆపిల్ తీసుకోదు!

పాపా, నేనంటే నీకెందు కింత కోపం ?

వెక్కి వెక్కి ఏడ్చింది విశాల.

ఆయా బేసిన్‌తో నీళ్ళూ, టవలూ, సోపూ తెచ్చి అమర్చింది.

విధిలేనట్లు ముఖం కడుక్కుంది. పౌడరు రాసుకుని బొట్టుపెట్టుకుంది.

చీర మార్చుకోవా లనిపించలేదు. అలాగే కుర్చీలో కూర్చుంది.

గడియారం దానిపని అది చేసుకుపోతోంది.

రోడ్డువేపు చూస్తూంది విశాల.

ఎవరో నవదంపతులు...ఉత్సాహంగా కబుర్లు చెప్పుకుంటూ వెళ్తున్నారు.

అతనికీ ఆమెకీ వయోభేదం ఎక్కువగా ఉన్నట్లుంది. అయినా వాళ్ల ఆనందానికి లోటులేదు. ఔను. మగవాడికీ తుమ్మెదకీ వార్ధక్యమేమిటి? వాళ్లెప్పుడూ నిత్యయౌవనులే. వయసు త్వరితంగానూ సులభంగానూ ముద్రవేయగలిగేది స్త్రీ మీదనే. పూవు అందం ఒకరోజయితే స్త్రీ యౌవనం కొన్ని సంవత్సరాలు. తను ముసిలిదయిపోయిందా? తన వయస్సు ముప్ఫయ్యేళ్ళు. ఇద్దరు బిడ్డల తల్లి. కాని-శారీరకంగానూ మానసికంగానూ తనమీద బలవంతంగా వృద్ధాప్యం రుద్దబడింది. జీవితం శాశ్వతంగా చీకటి గదులలోకి నెట్టబడింది. అది తన ఖర్మ. వేణు కూడా ఎందుకు భరించాలి.

''విశాలా!'' మందహాసంతో నిలుచున్నాడు వేణు. త్రుళ్లిపడి సర్దుకుని-చూసింది. "వేణూ!"

''ఏమిటాలోచిస్తున్నావ్ ?''

"ఏమీలేదు.'' నిర్లిప్తంగా అందామె అతన్ని చూస్తూ.

''హార్లిక్స్ తాగావా ?''

''నీతో కలిసి తీసుకుందామని ఆగాను.''

''ఎందుకలాచేశావ్ ? నువ్వుఅన్నీ వేళ ప్రకారంచేస్తూ ఉండాలని తెలియదూ?"

విశాల ముఖం కందిపోయింది. "నేను రోగిష్టిదాన్ననీ, ఈ రోగం శాశ్వతంగా నన్ను అంటిపెట్టుకునే ఉంటుందనీ నాకుతెలుసు. నువ్వుమాటిమాటికీ గుర్తుచేస్తూ ఎత్తిపొడవక్కర్లేదు.'' విసురుగా అంది విశాల.

వేణు నిర్ఘాంతపోయాడు. ఆనాటి విశాలేనా యీమె?

''సారీ విశాలా. నువ్వు ఉద్రేకంలో అపార్థంచేసుకున్నావు. నా ఉద్దేశం నిన్ను కించపరచాలనికాదు.నన్నుకొంచంఅర్థంచేసుకుందుకు ప్రయత్నించు. నాప్రాణంలో ప్రాణానివి. నాలో భాగానివి. నిన్ను నేను అవమానించే మూర్ఖుడిని కాగలనా?"

లోపలకు వెళ్ళి స్వయంగా ట్రే తీసుకువచ్చాడు. టిపాయ్‌మీద ట్రేఉంచి విశాల ఎదురుగా కూర్చున్నాడు కుర్చీలో.

బ్రెడ్ స్లయిస్ ప్లేట్లలోపెట్టి-కప్పులతో హార్లిక్ చేశాడు.

ఇంతలో సౌజన్య వచ్చింది. ''డాడీ!"

"కమాన్ బేబీ. కమాన్... ఏరోడ్రోమ్‌చూశావా ? ప్లేన్ ఎక్కావా?"

"ఓ! ఎంత బాగుందనుకున్నావు." వేణు ఒడిలోదూరింది సౌజన్య.

క్షణం తిరగకుండా బాబు గునగుననడుస్తూ వచ్చాడు. "నాన్నా ?"

"కమాన్ బాయ్ కమాన్..." ఎత్తుకోబోయాడు. సౌజన్య చోటివ్వలేదు.

ఇద్దరూ తండ్రి వడిలోనే యిరకాలని పంతం.

"నాదగ్గరకు ఒకరురండి..." పిలిచింది విశాల.

"ఊహుఁ." యిద్దరూ అనంగీకారంగా తలతిప్పేశారు.

వేణు చిన్నపిల్లల అల్లరికి నవ్వాపుకోలేకపోయాడు.

విశాల మనస్సు చివుక్కుమంది.

"సుజా! నువ్వు అమ్మదగ్గర కూర్చోమ్మా..."

సౌజన్య బుంగమూతి పెట్టేసింది-అలిగినట్లు.

''బాబు చిన్నపిల్లడుకదా?" బాబుకీ సౌజన్యకీ బటర్‌పూసిన బ్రెడ్‌స్లయిసు లందించాడు. సౌజన్య వెళ్ళిపోగానే బాబుకూడా వెళ్ళిపోయాడు.

అక్కడ వేణూ విశాలే మిగిలారు.

"నీకొక శుభవార్త తెచ్చాను విశాలా.''

"ఏమిటి?"

"వీల్‌ఛెయిరు ఆర్డరిచ్చాను. వారం పదిరోజులలో వస్తుంది. అప్పుడు నువ్వు ఫ్రీగా తిరగవచ్చు. బాగుంటుందికదూ?"

"ఊఁ." అసంతృప్తిగా గొణిగిందామె. "మా నాన్నగారు ఉత్తరం రాశారు."

"ఏదీ?" ఆత్రతగా అడిగాడు వేణు. విశాల కవరందించింది.

త్వరత్వరగా ఉత్తరం చదివి- "ఐతే శారద పెళ్ళికూతురయిపోతూందన్న మాట!'' అన్నాడు ఆనందంగా. "అల్లరిపిల్ల! ఎటువంటివాడు దొరుకుతాడో? అదృష్టవంతుడు మొత్తానికి.''

విశాల అతని కన్నులలోకి సాలోచనగా చూసింది.

హటాత్తుగా అందామె. ''ఆ అదృష్టవంతులు మీరే కావచ్చు-"

నివ్వెరపోయాడు వేణు. "విశాలా!"

"ఔను. మన సమస్యకదే మంచి పరిష్కారంగా తోస్తూంది. ఆవేశాలూ ఉద్రేకాలూ మాని వాస్తవదృష్టితో ఆలోచిస్తే నా మాట మీకూ సమంజసంగానే తోస్తుంది." నిర్విచారంగా అంది విశాల.

వేణుకి అతను వింటున్నమాటలు నిజాలో అబద్ధాలో తెలియడంలేదు. విశాల కేమయింది? ఎందుకిలా మాట్లాడుతూంది? ఆమె మాటలకర్థం ఆమెకయినా తెలుస్తూందా? అసలామె ఉద్దేశమేమిటి!-కొంపతీసి తనను పరీక్షించడం లేదుకద?

"నేనేం నేరంచేశానని యింత కఠినంగా మాట్లాడుతున్నావు విశాలా?"

"నువ్వు నేరం చేశావనికాదు. నేనే నేరంచేస్తున్నానని." గంభీరంగా అందామె.

"ఏమిటి విశాలా? నామనసు నీకు తెలియదూ? ఇప్పుడు నేనుమళ్ళీ పెళ్ళిపీటల మీద కూర్చుందుకు ఉబలాటపడుతున్నాననే భావిస్తున్నావా? నన్ను నువ్వు మరోలా అర్థంచేసుకుంటున్నావు. నాకు బాధ్యతలు తెలుసు. ఇద్దరి బిడ్డల తండ్రి నని మరచిపోగలిగే మనిషినా? చెప్పు విశాలా, చెప్పు.'' దీనంగా అన్నాడు వేణు.

"జీవితం అంటే బాధ్యతలేకాదు."

సూటిగా ఆమె ముఖంలోకి చూశాడు వేణు.

"ఇలా జరిగినందుకు నేను కుమిలిపోని క్షణంలేదు. నా విచారం ఏమిటంటే-నాబాధ నాతో పోవడంలేదు. మిమ్మల్నీ పట్టిపీడిస్తుంది. నాగురించి మీరెంతకాలం మీ సరదాలను చంపుకుని జీవితాన్ని నాశనం చేసుకుంటారు?"

వేణు త్రుళ్ళిపడ్డాడు. "ఐతే వివాహానికీ వివాహబంధానికీ అర్థమేమిటి ?"

విశాల సమాధానం చెప్పలేదు. ఇప్పుడామెలో ఉద్వేగంలేదు ఉద్విగ్నమయిన మనస్సు-లోపలిమాటను బయటపెట్టేసరికి చాలావరకు స్తిమితపడిపోయింది. ఇవాళకాకపోతే రేపయినా యిలాగ జరిగి తీరవలసిందే. మగవాడు ఎంతకాలం నిగ్రహంగా ఉండగలడు? వయస్సూ, రక్తమూ, పరిసరాలూ అతన్ని రెచ్చ గొట్టకుండా ఉండవు. అతను లోబడిపోకుండా ఉండనూలేదు.

ఏ బజారు స్త్రీలపరమో చెయ్యడంకంటె- అతనికి బలవంతంగా అయినాసరే రెండవపెళ్ళి చెయ్యడమే మేలు. ఎవరో పరాయిస్త్రీని అతనికి భార్యను చెయ్యడం కంటె-తన చెల్లెలినే యిచ్చిచేస్తే మరీ మంచిది. తన చెల్లెలయితే వేణుకి చక్కని భార్యే ఔతుంది. తనపిల్లలకు చక్కనితల్లీ ఔతుంది తననికూడా కంటికిరెప్పలా చూసుకుంటుంది.

"వివాహానికర్థం ఆజన్మాంత ఖైదుకాదు. మన సమస్య కింతకంటె చక్కని పరిష్కారం లభిస్తుందన్న ఆశా లేదు. వేణూ! ఒక్కమాట చెప్పు. ఎందరో డాక్టర్లు నన్ను పరీక్షచేశారు. ఒక్కరయినా నాకు మళ్ళీ కాళ్లు వస్తాయనీ నేను నడవగలననీ చెప్పారా?"

వేణు నిరుత్తరుడయ్యాడు.

"వేళప్రకారం తిండీ తింటున్నాను, మందులా వేసుకుంటున్నాను, విశ్రాంతీ తీసుకుంటున్నాను. డాక్టర్లు చెప్పినవన్నీ తు చ. తప్పకుండా పాటిస్తున్నాను. ఏం గుణంకనిపించింది? అలోపతీ, హోమియోపతీ, ఆయుర్వేద, మూలికావైద్యం ఒకటేమిటి? అన్నీ అయ్యాయి. నా పరిస్థితిమాత్రం ఎక్కడవేసిన గొంగళి అక్కడే అన్నట్లుంది. వైద్యులనూ వైద్యశాస్త్రాన్నీ నిందించడం కాదు.




నా దురదృష్టానికి విచారిస్తున్నానంతే. వేణూ! నా మనసులో మాట చెబుతున్నాను. ఇక నేనేనాటికీ లేచి స్వతంత్రంగా అడుగు వెయ్యలేను."

''విశాలా!" జాలిగా ఆమె చేతులను తనచేతులలోకి తీసుకున్నాడు.

"మీరు నన్ను చాలా ప్రేమిస్తారని నాకు తెలుసు. నాకీ అదృష్టంచాలు. వేణూ! ఇప్పటికే నిన్నెన్నోవిధాలా యిబ్బంది పెడుతున్నాను. నువ్వు నాకోసంచేసే త్యాగాలు ఇంకా భరించడం నా తరంకాదు. దయచేసి యీ విషయంలో నా సలహా పాటించు. నువ్వు మళ్లీ పెళ్లి చేసుకో."

"కాదు విశాలా. నేనేమయినా చిన్నవాడినా? ఇద్దరు బిడ్డల తండ్రిని. ఆపిల్లల క్షేమం కోసమేనా...''

ఆ పిల్లల క్షేమంకోసమే నేను నిన్నింత ప్రాధేయపడుతున్నది. పిల్లలకి సంరక్షణ అత్యవసరం. కేవలం ప్రేమాభిమానాలతో పెరగరు. ఆయాల పెంపకం ఎంత బాగుంటుందో తెలిసినవిషయమే. అందుచేత-పిల్లలకోసమేనా మీరు మళ్ళీ పెళ్ళిచేసుకోవడం మంచిది." ఊపిరితీసుకుని అంది. "పిల్లల క్షేమంకోరే నేనూ మీకీ మాట చెబుతున్నాను.

వేణు అయోమయంగా చూశాడు. అతనికంతా చిక్కుముడిలా తోస్తుంది. విశాల మాటలలో కొంచంనిజంలేకపోలేదు. కాని-తను-విశాల ఉండగా మళ్ళీపెళ్ళి చేసుకోడం ఏం న్యాయం?

"నా మనస్సు అంగీకరించడంలేదు విశాలా!" మెల్లగా అన్నాడు

"నేనుబ్రతికుండ బట్టేకదా మీరు సంశయిస్తున్నారు?'' సూటిగా అడిగిందామె.

"మీరు మామూలుగా నా మాట వినకపోతే-నేను ఆత్మహత్య చేసుకుని-మీ దారి సుగమంచేస్తాను.''

"విశాలా!'' అరిచాడు వేణు. అలా మాట్లాడకు.''

"అయితే నేనుచెప్పినట్లు చెయ్యండి.'' ఆజ్ఞో అభ్యర్థనో. తెలియకుండా అంది.

వేణు మౌనందాల్చాడు. విశాల చేతులను పట్టుకున్న అతని చేతులు వణుకుతున్నాయి.

"ఒకసారి శారదని రమ్మని వ్రాస్తాను. మీరు వ్రాయండి.''

వేణుమాట్లాడలేదు. విశాల ముఖంలోకి చూసేందుకతనికి ధైర్యంచాలడంలేదు.

"పదండి. లోపలికి పోదాం."

వేణు సాయంతో ఆమె తనమంచం చేరుకుంది.

ఆ రాత్రే ఉత్తరం వ్రాయించిందతనిచేత. తనూ వ్రాసింది-శారదని రమ్మని

నాలుగోరోజున వచ్చింది శారద. వస్తూనే విశాల మంచంవద్ద నిలబడింది.

"అక్కా! నీ ఆరోగ్యం ఎలాఉంది.?"

"కదలలేనన్న మాటేకాని దుక్కలా ఉన్నాను. కనిపిస్తున్నానుగా?"

"పోవే, నీ మాటలూ నువ్వూను.పాపా బాబూ ఏరీ?"

సౌజన్య కాన్వెంటుకి వెళ్లింది. బాబు యింట్లో ఎక్కడున్నాడో ? వెతుక్కురా."

కొంచం ఆగి అడిగింది. "నాన్న కులాసాగా ఉన్నారా?"

"ఊఁ" అంటూ లోపలికి పరుగెత్తింది శారద బాబుని వెదకడానికి.

''చూడుఁ, నీ సుపుత్రుడు చేస్తున్న ఘనకార్యం?"

పగటివేషం వేసినట్లున్నాడు బాబు. మసి వంటినిండా పులుముకున్నాడు. ముఖంనిండా ముగ్గుపిండి మచ్చలు.

విశాల నిట్టూర్చింది. "నేను కదలలేనుగా...అందుచేత వాడి ఆలనా పాలనా చూసేవారు లేకపోయారు.''

"ఆయా ఏంచేస్తూంది?'' అడిగింది శారద కోపంగా.

''జీతంకోసం పనిచేసేవాళ్లెంత శ్రద్ధగా ఉంటారో చెప్పాలా!"

శారద బాబు వొళ్లు తుడుస్తూంది దుడ్డపెట్టి.

"పిన్ని బాబూ!... పిన్ని..." బాబుకి చెప్పింది విశాల.

"అమ్మ!" అన్నాడు వాడు. శారద చిత్రంగా చూసింది.

"బాలవాక్కు, బ్రహ్మవాక్కు. శారదా! ఇంతవరకు వాడు అమ్మ లేనట్లే పెరిగాడు."

''అక్కా!''

"ఔను. నేను రోగిష్టిదాన్నయిపోయాను. మంచందిగలేని మనిషిని. నాకే ఒకరు చెయ్యాలి. నేనొకరికేం చెయ్యగలను?"

జాలిగాచూసింది శారద విశాలవైపు.

''బయటపడడుకానీ, వేణుకీ నానుంచి యిబ్బందేతప్ప సుఖంలేదు."

శారదకు అక్కముఖంచూసే ధైర్యం లేకపోయింది. తలవంచుకుని నేలమీద గీతలు గీస్తూంది, కాలి బొటనవేలుతో.

"నేను-జీవచ్ఛవాన్నే ఐపోయాను..." గద్గదికంగా అంది విశాల.

శారద చట్టుక్కున అక్కతలమీద చేయివేసి-భయంగా అంది. ''నీకు పుణ్యముంటుంది. అలా మాట్లాడకక్కా!"

''నిన్ను బాధపెట్టాలనికాదు శారదా? ఉన్న విషయం చెబుతున్నాన్నంతే. నా గుండెల్లోని బాధనీ వ్యధనీ నీముందు కాక ఎవరిముందు బయట పెట్టుకోగలను? నాకు నువ్వుతప్ప ఎవరున్నారని నన్నర్థం చేసుకుందుకు?"

శారద నిట్టూర్చింది. "చీకటివెనుక వెలుగు రాకపోతుందంటావా? ఈ కష్టాలు కలకాలం కాపురం చెయ్యవు. మళ్ళీ మంచిరోజులు నీ జీవితంలో తప్పకుండా తొంగిచూస్తాయి."

విశాల ఆశ్చర్యపోయింది. శారదా ఎంత ఎదిగింది! చదువబ్బకపోయినా తెలివితేటలూ జ్ఞానమూ అలవడ్డాయి. జీవితాని కదిచాలు.

''అటువంటి ఆశ నాకు మిగలేదు చెల్లీ."

ప్రశ్నార్థకంగా చూసింది శారద.

''ఇక నాకు కాళ్ళు స్వాధీనంలోకి రావని స్పష్టం ఐపోయింది. ఆశపడడంలో అర్థముంది కానీ పేరాశకు నిరాశే మిగులుతుంది. సరే. తరవాత మాట్లాడుకుందాం. నువ్వెళ్ళి టాయిలెట్ ఐ రా. కాఫీ తాగుదాం.''

ప్రయాణపు బడలిక మీదున్న శారద స్నానంచేసి చీర మార్చుకుంది. బొట్టూ కాటుకా పెట్టుకుంది. చీర మార్చుకోబోతూంటే-విశాల పిలిచింది.

''బీరువాలో నీలంచీర ఉంటుంది. కట్టుకో. తేలిగ్గా హాయిగా ఉంటుంది.''

కాదనలేదు శారద. ఆచీర చూసేసరికి ముచ్చటేసింది. లేతనీలంరంగు...పుల్ వాయిల్ చీర. కొత్తగా ఉంది. మెత్తగా ఉంది. మారు మాట్లాడకుండా చీర కట్టుకుంది శారద. ఆ చీరకి మ్యాచ్ అయ్యే జాకెట్ కూడా ఉంది. ఎటొచ్చీ అది తనకి సరిపోతుందో, సరిపోదో? వేసుకుని చూసుకుంది. ఆశ్చర్యంగా-అతికి

నట్లు సరిపోయింది. అక్క సన్నని మనిషి. ఇద్దరు పిల్లలతల్లి అయినా కొంచెం కూడా వొళ్ళు చెయ్యలేదు. తను బొద్దుగా ఉంటుంది. అక్కకంటె ఆరేళ్ల చిన్న దయిన తనకి అక్క బ్లౌజ్ సరిపోయింది!

విశాలవద్దకు నడిచింది శారద. "చీర చాలా బావుందే! కొత్తదిలా ఉంది—"

"మీ బావకి మంచి టేస్ట్ ఉంది. పెళ్ళిరోజుకని కొన్నారు. జబ్బుమనిషిని-కొత్త చీరెందుకు? అతన్ని చిన్నబుచ్చడం యిష్టంలేక ఓసారి కట్టుకుని తీసేశాను. అరె! జాకెట్ కూడా సరిగ్గా సరిపోయిందే?" ఆనందంగా చూసింది విశాల.

"నువ్వు బొమ్మలాగ నాటికి నేటికి ఒక్కలాగే ఉన్నావు. నేను కొంచెం వళ్ల మనిషిని. అందుకే అక్కయ్య సైజుకి సరిపోయాను."

"మీ బావ నోసారి ఏడిపిద్దామా?"

"ఓ!" హుషారుగా అంది శారద.

## 4

ఆఫీసునుంచి వచ్చాడు వేణు. వస్తూనే విశాలమంచం వద్దకు చేరాడు అలవాటుగా.

"హార్లిక్స్ తాగావా?"

"ఊఁ" అటుతిరిగి ఉన్నది అలాగే మూలిగింది

"లేస్తావా?" అడిగాడు వేణు.

"ఊఁ."

వేణు ఆమెను పొదివిపట్టుకుని లేపి కూర్చోబెట్టాడు.

ఒక్కసారి కిలకిల నవ్వు. తెల్లబోయాడు వేణు.

"బావా!" విరగబడి నవ్వింది శారద.

"ఎప్పుడొచ్చావ్ శారదా?"

"మధ్యాన్నం." నవ్వుతూనే అంది శారద. "వెనకటి సామెత నిజం చేశావ్."

"ఏమిటి?"

"ఎఱ్ఱకోక కట్టుకున్నది నా పెళ్ళామే అన్నాట్ట నీలాటి వొకడు. ఆ నాడు ఎఱ్ఱకోక. నేడు నీలి చీర..."

వేణు కూడా నవ్వాడు. "ఏమిటి విశేషాలు? నాన్నగారు క్షేమమేనా?"

"ఆఁ."

''మీ అక్కేదీ?''

''వెతుక్కో.''

''వెతికిపెడుదూ-'' అంటూనే వెనక్కి తిరిగాడు.

అక్కడుంది విశాల.

''ఊఁ. అక్కాచెల్లెళ్ళిద్దరూ కలిసి నన్ను...'' చిరునవ్వు నవ్వాడు వేణు.

ఆయా వచ్చి టీ తెచ్చింది.

శారద ముగ్గురికీ కప్పుల్లో టీ పోసి అందించింది.

టీలు త్రాగాక కబుర్లలో పడ్డారు.

విశాల హుషారుగా ఉంది. వేణుకి ఆ సంగతి ఆనందం యిచ్చింది.

ఆ రాత్రి విశాల డైనింగ్ టేబుల్ దగ్గరే భోజనంచేసింది. వేణూ శారదా అటూ యిటూ ఆమెకి ఊతయిచ్చారు.

''ఏమిటో యివాళ వంటలు అద్భుతంగా ఉన్నాయి.'' అన్నాడు వేణు ప్లేటులో పదార్థాలు రుచిచూసి.

''మీ మరదలు వండింది.''

''అలా చెప్పు మరి.''

''చెప్పకుండా తెలుసుకోగలవేమో అనుకున్నాను.'' అంది శారద.

''నీ చేతి వంట రుచి చూడడం యిదే మొదటిసారి కద? పోల్చుకోలేక పోయాను.''

''ఇకనుంచి శారదే వండుతుందిలెండి.''

''థాంక్యూ శారదా!''

''ఆశ! చక్కగా వండిపెడితే తిందామనుకుంటున్నావు కాబోలు! ఆ పప్పు లుడకవు.''

''మురిపించుకోకే. కావాలంటే బావ సాయంచేస్తారులే.''

''ఎం చేస్తాడేం.''

''బియ్యం కడగడం...కూరలు తరగడం...గట్రా...''

''అటువంటివి నాచేత కావుకానీ-ఒక్కటి మాత్రం చెయ్యగలను.''

''ఏమిటో?'' అడిగింది శారద.

''వండినది తినడం——''

''కష్టపడతావ్...''

''అదేం అంత సులభమనుకున్నావేమిటి? కొందరు వండితే తినడం ఎంత కష్టమో! ఉదాహరణకి మా వంట మనిషి...''

ముగ్గురూ నవ్వుకున్నారు.

శారద భోజనం అయ్యేసరికి సౌజన్య పరుగెత్తుకు వచ్చింది. "హోమ్‌వర్క్ చేసేశాను కథలు చెప్పవూ పిన్నీ?"

"పద.' అంటూ పాపతో నడిచింది శారద.

ఒకటి రెండు కథలు చెప్పేసరికే నిద్రపోయింది సౌజన్య.

బాబు పాలకోసం లేచాడు. శారద పాలగ్లాసు అందించింది.

వేణు పేపరు చదవడం పూర్తిచేసి తనగదిలోకి వచ్చాడు. గడియారం తొమ్మిదిన్నర సూచిస్తోంది.

"నిద్ర రావడంలేదూ శారదా?"

"వస్తూంది" అంటూ విశాలగదిలోకివెళ్ళి పక్కవేసుకుంది.

విశాల తెలివిగానే ఉంది. కాని మాట్లాడలేదు.

ఆమె మెదడులో వివిధ ఆలోచనలు పరుగులు తీస్తున్నాయి. అస్పష్టమైన ఊహలు స్పష్టమైన ఆకృతులు దాల్చుతున్నాయి. ఉండుండి ఆమె తనలో తానే నవ్వుకుంటూంది. అంతలోనే కన్నీరు పెట్టుకుంటూంది. విభిన్న భావాలకూ నిలయం ఐపోయిందామె మెదడు.

అలసి సొలసి ఉందేమో శారదమాత్రం అతి త్వరగా నిద్రలోకి జారి పోయింది బెడ్‌లైట్ వెలుగులో శారద రకరకాల రూపాలలో కనిపించసాగింది తదేకంగా ఆమెవైపు చూస్తున్న విశాలకు.

ఒకసారి దేవతగా...మరోసారి రాక్షసిలా...వింతగా...చిత్రంగా...

అలాగే నిద్రపోయిందామె తనకి తెలియకుండా.

వారంరోజులు గడిచాయి.

మధ్యాన్నం. బాబు నిద్రపోతున్నాడేమో యిల్లు నిశ్శబ్దంగా ఉంది. సౌజన్య స్కూలుకి వేణు ఆఫీసుకి వెళ్ళిపోయారు.

శారద ఏదో పుస్తకం చదువుకుంటూంది వాలుకుర్చీలో విశాల మంచం దగ్గరగా.

"శారదా!-"

"పిలిచావా? ఏంకావాలి?" పుస్తకం మూస్తూ అడిగింది శారద.

"నువ్వొచ్చిన నాటికీ నేటికీ యింట్లో చాలా మార్పులు వచ్చాయి కదూ? ఇల్లు కలకలలాడడం లేదూ?"

"ఏమో!"




"ఇల్లేకాదు, ఇంట్లో మనుషులూ చాలా మారారు. ఉత్సాహంగా ఉంటున్నారు."

"నేనేం చేశానని యిలా పొగడ్తలు మొదలుపెట్టావ్?"

"పొగడ్త కాదు. ఉన్నమాట ఉండబట్టలేక అన్నాను."

"సరేలే."

"ఇల్లాలేం కోరుకుంటుందో తెలుసా? ఇల్లెప్పుడూ కలకలలాడుతూండాలని. ఇంట్లో మనుషులు ఆనందంగా ఉండాలని..."

"ఊఁ. ఐతే యిప్పుడేమంటావ్?"

"ఈ ఆనందం నాకు శాశ్వతంగా మిగలాలి. అదే నా కోరిక."

"బేషుగ్గా ఉంది."

"నువ్వు యీ దీనురాలయిన అక్కమీద దయచూపితే నిజంగానే యీ యిల్లు చిరకాలమూ కలకలలాడుతుంది. పిల్లలు కిలకిల నవ్వుతారు."

"నా దయేమిటి? ఎందుకు?"

"నేను మంచమెక్కిన నాటినుంచీ యిల్లు కళావిహీనమే ఐంది. నువ్వొచ్చావు, యింటికి వెలుగొచ్చింది. ఈ వెలుగుని ఎప్పటికీ ఉంచేసుకోవాలని నా ఆశ."

శారద అర్థంకానట్లు చూసింది.

"అక్కకోసం నువ్వు త్యాగం చెయ్యాల్సి ఉంటుంది."

"ఏమిటి విచిత్రంగా మాట్లాడుతున్నా వివాళ నువ్వు?"

"చిత్రమే. నా బతుకు అలాగ ఐపోయింది..."

"ఇప్పుడు నీకేం లోటని?"

"నువ్వుంటే నా కేలోటూ ఉండదు. అందుకే... "పేలవంగా నవ్వింది విశాల.

"నేను స్వార్థపరురాలినేమో!...శారదా! నా బ్రతుకులో లోటులేదని నన్ను మభ్యపెట్టలేవు. వేణు నా మూలంగా అశాంతీ అసౌఖ్యమూ అనుభవిస్తున్నాడు."

"అబద్ధమాడకు. బావ దేముడు..."

"నిజమే. కాని...నేనీ యింటికి అరిష్టాన్ని. ఇలాగే కొన్నాళ్ళు సాగితే దేముడిలాటి బావ ఏమైపోతాడో ఊహించ శక్యంకాదు. మగవాడు ఎక్కువ కాలం సహించలేడు. ఆ అగత్యమూ లేదు. ఆఫీసులో కష్టపడివస్తాడు, యింటికి వచ్చాక నా చేతినుంచి కాఫీ అందుకోడానికయినా నోచుకోడు. పైగా నాకే చాకిరీ చెయ్యాలి. నావంటి రోగిష్టితో ఏంసుఖపడతాడు? అతని పాలిటి తెగని సమస్యను..."

"కొంచెంకాలంలో నీ కాళ్ళు బాగుపడవూ?"

"ఊహుఁ. అదీ తేలిపోయింది. నా రాత యిక మారదు. నాకిక కాళ్లు రావు."

శారదకి విశాల మాటలు వింటూంటే ఒకవంక భయమూ మరొకవంక జాలీ మిన్నిరిగొన్నాయి. అక్క ముఖంలోకి చూడలేకపోయింది.

"పిల్లలిద్దరికి నీదగ్గర చాలో మాలిమయిపోయింది, వీళ్ళూ వీళ్ళల్లరీ లేకపోతే నీకు తోచుతుందా? ఒకవేళ నువ్వు ఎలాగో సరిపెట్టుకోగలిగినా—నిన్ను విడచి పిల్లలుండలేరు. ఇన్నాళ్ళూ వాళ్ళకి కరువయిన మాతృప్రేమని నీ నుంచి పొందడానికి వాళ్ళు అలవాటుపడిపోయారు."

శారద మౌనం దాల్చింది. ఇంతలో సారధి వెనుకనుంచివచ్చి ఆమె కాళ్ళకి చుట్టుకున్నాడు.

"వేణుకూడా మునపటికంటె చాలా ఉత్సాహంగా ఉంటున్నాడు. ఈ జబ్బు మనిషి ముఖం చూడలేకా, వేగలేకా కాబోలు మునుపు ఆలస్యంగా యిల్లు చేరేవాడు. నువ్వుంటే త్వరగా వస్తున్నాడు."

త్రుళ్ళిపడింది శారద. "అక్కా!"

"చేదుగా ఉన్నా నిజం అదే. నిజానికిది చేదునిజం కాదు. తీయని నిజమే." బలవంతంగా నవ్వుతెచ్చుకుంది విశాల, చెల్లెలి ముఖంవైపు చూస్తూ. "నిజం చెప్పాలంటే—నేనూ చాలా సుఖంగా ఉన్నానిప్పుడు. ఈ సుఖసంతోషాలు నాకు చిరకాలం కావాలి."

అంటే-ను వ్విదీసురాలిమీద దయచూపి ఎప్పుడూ యిక్కడే ఉండిపోవాలి.."

తెల్లబోయింది శారద. విశాల మాటలు ఆమె కర్థమవడంలేదు. "ఎలా?"

"అందుకు మార్గం నే నాలోచించే ఉన్నాను."

"చెప్పు," అడిగింది శారద.

విశాల శారద రెండుచేతులూ పట్టుకుని కళ్ళల్లోకి చూసింది.

"నువ్వు-మీ బావని పెళ్ళిచేసుకోవాలి..."

"ఆ!" నిర్ఘాంతపోయింది శారద. ఆమె గొంతు పొడారిపోయింది. "నిజమేనా? ఏమిటి నువ్వనేది?"

"నేను నిజంగానే చెబుతున్నాను. నువ్వు నన్ను రక్షించాలంటే, నా కుటుంబాన్నాదుకోవాలంటే-వేణుని పెళ్ళిచేసుకొని తీరాలి. చితికి ఛిద్రమైపోయే యీ సంసారాన్ని నిలబెట్టగలిగేది నువ్వొకరివే!"

"నువ్వు...నువ్వు..."

"ఉండీ లేనివాళ్ళలోనే జమ. వేణు నీకు తెలియని మనిషికాడు. దేముడని నీ నోటితో నువ్వే అన్నావు. నువ్వంటే చాలా ప్రేమకూడా. యీ యింట్లో నా స్థానం నువ్వాక్రమించుకుంటే-ఉహుఁ-అలంకరిస్తే-అందరికీ ఆనందమే. నువ్వు కాదన్నా-నేడు కాకపోతే రేపయినా-వేణు మరొకర్ని తీసుకురాకపోడు-"

"అక్కా బావ అటువంటివాడనుకోను. ను వ్వబద్ధమాడుతున్నావ్."

"ఇంతవరకూ వేణు చాలా మంచివాడే. కాని భవిష్యత్తు ఎవరు చూడవచ్చారు? పరిస్థితులు ఎంత మంచి మనిషినయినా ప్రభానితం చేయగలవు. నేను మూలపడినంత మాత్రాన వేణు ముసలివాడై పోలేదు. పైగా-మగవాడు నిత్యయౌవనుడు. నేడు కాకపోతే రేపయినా వేణు మనసు బాధ్యతనుంచి సుఖాలవేపు తిరిగిపోక మానదు. ఆ బలహీనతలో అతనేం చేస్తాడో ఎవరు చెప్పగలరు? అతని అర్ధాంగిని. కష్టసుఖాలాలోచించవలసిన విధి నాకుంది. నేను స్వార్థపరురాలినే. నువ్వు తప్ప మరెవరు నా స్థానం పొందినా నా గతి ఏమౌతుందో? నా పిల్లలను సవతితల్లి ఎన్ని బాధలు పెడుతుందో? అందుకే నిన్ను ప్రార్థిస్తున్నాను." కన్నీరు తుడుచుకుంది విశాల.

శారద హృదయంలో ఆర్ద్రం ఐపోయింది.

అక్కయ్య హృదయంలో ఎన్ని అగ్నిపర్వతాలు బ్రద్ధలౌతున్నాయో! ఎంత దావానలం చెలరేగుతూందో! ఎంత బడబాగ్ని రగులుకుందో!

స్త్రీకి యింతకంటె నరకమూ ఉండదు, దుఃఖమూ ఉండదు.

స్వహస్తాలతో భర్తకి మళ్ళీ పెళ్ళిచెయ్యడం!

అక్కయ్య ఆలోచనలు అసమంజసమని కొట్టిపారెయ్యడానికి వీలులేదు. ఒక కోణంలో ఆమె నిర్ణయమూ సహేతుకమే. ఎంతమంచివాడయినా మగవాడిని నమ్మడం కష్టం. వీచే గాలినీ, మగవాడి మనసునీ ఆకట్టడం అసాధ్యం.

రేపటిసంగతి యివాళే తెలిసిపోతే జీవితాలు కథల్లా ఎందుకుంటాయ్? రేపెలా ఉంటుందో ఎవరయినా ఊహించుకోవాల్సిందే తప్ప నిజంగా తెలుసుకోలేరు.

వేణుతో తన పెళ్ళి!

అక్కయ్య స్థానంలో తను!

ఆలోచించడానికే అయోమయంగానూ అతి భయంకరంగానూ ఉంది. నిజం యింకా ఎలా ఉంటుందో? ఎదుర్కోగలదా?

"ఏమిటాలోచిస్తున్నావ్? వేణు నీకు తగడనా? అటువంటి సందేహాలు పెట్టుకోకు. పేరు కిద్దరు బిడ్డల తండ్రన్నమాటే కాని అతని వయస్సు ముప్ఫయ్ నాలుగే. అందచందాలు కంటికే కనబడుతున్నాయి. వేరే చెప్పాల్సిన అవసరం ఏముంది? ఇద్దర్నీ పోషించలేడని సందేహించకు. అతని జీతం వెయ్యిరూపాయలు..."

"అదిగాదు–" నసిగింది శారద.

"నా గురించి సంశయిస్తున్నావా ఏమయినా? అటువంటివి అనవసరం. నువ్వతని అర్ధాంగి అయిన తక్షణం నేను నా సర్వహక్కులూ ధారాదత్తం చేసేస్తాను. నేను వేడుకునే దొక్కటే. నన్ను యీ యింట్లో ఉండనియ్యి. అంతకంటె నా కింకేమీ అక్కరలేదు."

శారద ఉక్కిరిబిక్కిరయిపోతోంది. "చిన్నదాన్ని. నాకేం తెలుస్తాయ్? నాన్నతో మాట్లాడితే మంచిదేమో..."

"ముందు నీ కిష్టమయితే..."

"కొంచెం ఆలోచించుకోనీ." అక్కడినుంచి లేచి వెళ్ళింది శారద లేనిపని కల్పించుకుని.

వేణు వచ్చాడు. విశాలను చూస్తూ ఆగిపోయాడు.

"హార్లిక్స్ తాగేశాను–" నవ్వింది‌ ఆమె.

అతనూ నవ్వాడు.

"ఔనూ, యింటికి వచ్చిన మరదలిని అలా షికారూ సినిమా అంటూ తిప్పడం



ఏమయినా ఉందా లేదా? ఇంట్లో కట్టిపడేసినట్లు వదిలేస్తే దానికేం తోచు కుంది?"

"నువ్వూ వస్తావా?"

"నేనా! బాగుంది. మీకు మతిపోలేదు కదా? ఈ కాళ్ళులేనిదా న్నెక్కడికి తీసుకు వెళ్తారు? ఎలా తీసుకువెళ్తారు? మీరిద్దరూ అలా తిరిగిరండి. సౌజన్యని తీసుకు వెళ్ళండి."

ఇరకాటంలో పడిపోయాడు వేణు.

శారద టీ పట్టుకువచ్చింది.

"త్వరగా టీ తాగి టాయ్‌లెట్ అయి బావతో అలా తిరిగిరా. డల్‌గా ఉన్నావు."

"వద్దులే" అంది శారద.

"అదేం? బావ పరాయివాడా? ఎంత చనువుగా ఉండేదానివి! బీచ్‌కి వెళ్ళి కాస్సేపు కూర్చుని-మినర్వాలో సినిమా చూసిరండి. సౌజన్యనికూడా తీసు కెళ్లండి. కాళ్లు లేనిదాన్ని. నాకంటే తప్పదు. మీరెందుకు కట్టిపడేసినట్లుండాలి?"

"నా కెక్కడికీ వెళ్ళాలనిలేదు-"

"ఇరవై నాలుగుగంటలూ యింట్లో కూర్చుంటే అలాగే విసుగ్గా ఉంటుంది. ఓసారి తిరిగివస్తే చిరాకుపోయి చురుకుతనం వస్తుంది. ఊc. ప్లీజ్...క్విక్‌గా తయారవ్వు. సౌజన్యకి బట్టలేసి తీసుకెళ్ళు."

"నువ్వు ఒక్కర్తివే అయి పోవూ!"

"మరేం ఫర్వాలేదు."

"ఇంకా వంటకాలేదు.''

"ఆయా చూస్తుంది. అనవసరపు ఆలోచనలు మాని వెళ్ళు."

విధిలేనట్లు బయలుదేరారు శారదా వేణూ. సౌజన్య పిన్నిచెయ్యి పట్టుకుని నడిచింది.

రిక్షాలో బీచ్ చేరుకున్నారు.

ఇసుకలో నడుస్తూంటే సౌజన్య ఆనందాని కవధులులేవు.

వేణుకికూడా ఉత్సాహంగానే ఉంది. అతని మెదడులో గతం మెదిలింది.

విశాలతో తరచుగా బీచ్‌కి వచ్చేవాడు. విశాలకి పచ్చిమిరపకాయబజ్జీలంటే చాలా ఇష్టం. అవి తినడం–మంచినీళ్లు దొరక్క వగర్చుకుంటూ నడవడం... బీచ్‌కి వస్తే చాలా అల్లరిచేసేది విశాల.

"ఏమిటి బావా ఆలోచిస్తున్నావ్?"

''ఏమీ లేదు."

"ఇలా ఇసుకలో కూర్చుందామా?"

"ఊఁ."

ఇద్దరూ కూర్చున్నారు. వాళ్ళకి కొంచెందూరంలో సౌజన్య చాలా సీరియస్‌గా యిసుకగూళ్ళు కట్టడం ప్రారంభించింది.

శారద సముద్రాన్ని చూస్తోంది.

"ఎందుకలా ఉన్నావు శారదా?"

"......"

"మీ అక్క ఏమయినా అందా?"

"ఊఁ."

"ఏమంది?"

"మన పెళ్ళి విషయం–" నోరు జారింది శారద.

"మన పెళ్ళి!–" వేణు ఆశ్చర్యపోయాడు. విశాల ఎందుకు తొందరపడింది? నిజంగా ఆమెకు పిచ్చెక్కలేదు కదా?

"మరోలా అనుకోకు శారదా. మీ అక్కకి మతి సరిగ్గాలేనట్లుంది."

"కాదు. అక్క మాటలు సమంజసమే."

తెల్లబోయి చూశాడు వేణు.

"ఆమె తాపత్రయం నేనర్థం చేసుకున్నాను. అక్కయ్యని సమర్థిస్తున్నాను కూడా!–"

"శారదా! తొందరపడకు. నిదానంగా ఆలోచించు."

"ఆలోచించేందు కేమీ లేదు."

"పెళ్లంటే నూరేళ్ళపంట. శారదా—మీ అక్కయ్య అర్థంపర్థంలేని ఆలోచన లతో పిచ్చిగా ఏదో అంటే దాన్నేపట్టుకు వేలాడుతున్నావా? ఆమె భయాలు ఆధారరహితాలు. అర్థంలేనివి. నేనామెకెన్నడూ అన్యాయం చెయ్యను. నా మాట నమ్ము..."

"నువ్వు అక్కయ్య కన్యాయం చేస్తావనికాదు. నీకు నువ్వే అన్యాయం చేసుకుంటున్నావని..."

"అటువంటి దేమీ లేదు. శారదా! మీ అక్కయ్య మాటలు పట్టుకుని నువ్వు త్యాగాలు చెయ్యడానికి ప్రయత్నించకు. పెళ్ళంటే నూరేళ్ళపంట. చూస్తూ చూస్తూ రెండోపెళ్ళివాడిని చేసుకుంటావా!"

శారద మౌనందాల్చింది.

"మీ అక్కకి నేనేమీ అన్యాయం చెయ్యను. కానీ నీకు నువ్వన్యాయం చేసుకోకు."

"లేదు బావా! నే నో నిర్ణయానికి రావడం జరిగిపోయింది."

"ఏమిటా నిర్ణయం?"

"తరువాత చెబుతాను."

సౌజన్య పిచ్చిగూడు కట్టేసింది. పరుగునవచ్చి–"పిన్నీ! నాన్నా...చూడండి ఎంత బాగా కట్టానో..." అంది తమాషాగా కళ్ళు తిప్పుతూ.

"పద. చూద్దాం–" వేణూ శారదా లేచారు.

సౌజన్య హడావిడిలో పిచికగూడుమీద కాలువేసింది. గూడు కూలిపోయింది.

"అయ్యో!" దుఃఖం వచ్చేసింది సౌజన్యకి

"ఫరవాలేదులే, మళ్ళీ వస్తాంగా, కట్టుకుందాం." ఓదార్చింది శారద.

"సినిమాకి టైమవుతోంది శారదా!–"

"పద." సౌజన్యని నడిపించసాగింది శారద.

వేణు ముందు దారితీస్తూంటే అతని వెనుక శారదా సౌజన్యా నడవసాగారు. బీచ్‌కీ థియేటరుకీ అట్టే దూరంలేదు.

పదినిముషాలలో థియేటర్ చేరుకున్నారు.

"డాడీః దాహం వేస్తూంది."

"కోకాకోలా కావాలా, గోల్డ్‌స్పాట్ కావాలా?"

"గోల్డ్‌స్పాట్."

"శారదా, నీకుః"

"నాకేమీ వద్దు."

"ఏమిటి శారదా...అలా నిర్లిప్తంగా ఉన్నా వెందుకనిః నాకు బాగులేదు."

పేలవంగా నవ్వింది ఆమె.

చివరకు వేణు బలవంతంమీద కోకోకాలా తాగక తప్పలేదు.

ముగ్గురూ థియేటర్‌లోకి నడిచారు. సినిమా సగానికి వచ్చేసరికి సౌజన్య నిద్రపోయింది శారదవడిలో.

షో అయ్యాక యిల్లుచేరుకున్నారు రిక్షాలో.

"సినిమా ఎలాఉందిః" అడిగింది విశాల.

"బాగానే ఉంది."

వేణు బట్టలకు వచ్చాడు.

ముగ్గురూ భోజనాలు పూర్తిచేశారు.

పౌర్ణమికావడంతో పుచ్చపువ్వులా ఉంది వెన్నెల. నిండుజాబిల్లి అద్దంలాటి ఆకాశంలో అందంగా నవ్వుతున్నాడు. నైట్‌క్వీన్ వెర్రిగా వాసనలువెదజల్లుతోంది.

విశాల నిద్రమాత్రలు లేసుకుని నిద్రపోయింది.

శారదకు నిద్రరావటంలేదు. కిటికీలోంచి పడుతున్న వెన్నెలనుచూస్తూ కొంత సేపు మంచంమీద కూర్చుంది. నిద్రవచ్చే చిహ్నాలు కనిపించలేదు. మంచందిదిగి తలుపుతీసి వీధిగేటువరకూ వచ్చింది. అక్కడే రేరాణి పందిరుంది. కొంచెంసేపు వెన్నెలలో నిలుచుంది. ఆలోచనలు పరిపరివిధాల పరుగెత్తసాగాయి.

హటాత్తుగా పిలుపు. "శారదాః"

త్రుళ్ళిపడింది. "బావాః"

"నీకూ నిద్ర రావడంలేదాః"

"లేదు."

"ఏవయినా కబుర్లు చెప్పరాదూః"

"ఏముంటాయ్ః"

''మీ అక్కయ్య చాలా పొరపాటుచేసింది. చిన్నదానివనయినా యోచించకుండా నీముందు పెళ్ళివిషయం ఎత్తింది...''

''నేను చిన్నపిల్లనా!'' నవ్వింది శారద.

''మునపటిలాగే చిలిపిగా అల్లరిగా ఉండవూ?''

''నీకు చాలా విషయాలు తెలియవు బావా!-''

''ఏమిటి?''

''సారీ-'' లోపలికి వెళ్ళిపోయిందామె.

అర్థరాత్రిదాటినా నిద్రాదేవత కరుణించలే దామెను.

బావకి చాలావిషయాలు తెలియవు. తనకీ నాన్నకీ తప్ప మరెవరికీ తెలియని రహస్యం ఒకటుంది. అక్కయ్య ఆలోచన నాన్నకితెలిస్తే తక్షణం ఆమోదించి మరుక్షణం పెళ్ళి జరిపించేస్తాడు.

బావ రెండో పెళ్లి వాడే కావచ్చు. అతని కేంలోటు?

అందగాడు. వయసు మీరనివాడు. అర్జనపరుడు. గుణవంతుడు.

ఇంతకంటె చక్కనివాడు అతనికి లభిస్తాడా ప్రస్తుతపరిస్థితులలో? అసాధ్యం. బావని చేసుకోవడమే మేలు.

ముమ్మారనుకుం దామాట.

శారద పరిస్థితులతో రాజీపడిపోయింది. ఆడపిల్ల...చదువబ్బనిది...పాతికేళ్లు పైబడ్డది...అంతకంటె ఎం చెయ్యగలదు?

తనవల్ల మిగిలినవాళ్లు సుఖపడగలుగుతారంటే-తలవంచేసింది. మర్నాడే తన నిశ్చయాన్ని అక్కయ్యకి చెప్పేసింది ఆమె అడిగిన అనంతరం.

వెంటనే విశాల తండ్రినొక్కసారి రమ్మంటూ ఉత్తరం వ్రాసేసింది. ఆ ఉత్తరంలో ఏ వివరాలూలేవు. వెంటనే బయలుదేరి రమ్మని మాత్రమే ఉంది.

ఉత్తరంచదివిన పురుషోత్తం మొదట కంగారుపడ్డాడు బొత్తిగా టెలిగ్రామ్‌లా ఉంది ఉత్తరం. అందులో యోగక్షేమాలూ లేవు. కుశలప్రశ్నలూ లేవు. శారదకి పెళ్లిసంబంధం గురించి అసలు భోగట్టాలు లేవు. పరిస్థితేమిటో తెలియక ఉన్నవాడున్నట్లే ప్రయాణమయ్యాడు.

సరిగ్గా అదే సమయానికి...

పెళ్లిళ్లపేరయ్య ఎదురు వచ్చాడు-చిరునవ్వు లొలకబోస్తూ.

''అమ్మాయిది ఘనజాతకం. తమ రదృష్టవంతులు. వియ్యాలవారు మీ సంబంధానికి సుముఖంగా ఉన్నారు. పిల్లనచ్చినట్లు చెప్పమన్నారు.''

"ఓహో?" ఆనందంగా చూశాడు పురుషోత్తం.

"కట్నకానుక లోకమాటకి వస్తే-ముహూర్తం పెట్టేసుకోవడమే."

"అలాగే. వాళ్లెంతలో ఉన్నారు?"

"ఆరువేలూ లాంఛనాలూ..."

పురుషోత్తం కళ్లుతెలవేశాడు. పెద్ద ఘనమయిన సంబంధమేమీ కాదు. అబ్బాయి టీచరుగా చేస్తున్నాడు. రెండువందల యాభై జీతం వెనక ఆస్తిపాస్తులు లేవు. అబ్బాయి అందంగా ఉండడు. గుడ్డిలోమెల్ల ఏమిటంటే అబ్బాయి ఆర్జన మీద ఆధారపడిన వాళ్లంటూ ఎవరూ లేరు.

కాని-ఆరువేలిచ్చుకోవడం తనకి సాధ్యం కాదు. ఎంత క్లుప్తంగా చేసినా పైన మరోఆరువేలు పట్టుకోనిదే పెళ్ళిచేయడం కష్టం. అన్నీకలిపి పన్నెండువేలు. ఎక్కడినుంచి తేవాలి? ఎవరిస్తారు? ఏంచూసి అప్పిస్తారు?

"అంత తూగలేను..."

"అలా అంటే ఎలా? ఈరోజుల్లో సంబంధాలు కుదరడం కష్టంగాఉందని మీకూ తెలుసు. కొంచం ఆలోచించండి."

"నేను ఊరు వెళ్తున్నాను. వచ్చాక ఏ కబురు చెప్తాను."

"అలాగే కానివ్వండి."

పురుషోత్తం పెళ్లిళ్ల పేరయ్యని పంపేసి విశాలదగ్గరకి బయలుదేరాడు

* * *

"రా నాన్నా!"

"బాగున్నావా విశాలా?"

"ఏంబాగు, యిలా ఉన్నాను." నిస్పృహగా అంది విశాల.

"ఏమిటోనమ్మా...దేముడు నిన్ను సరిగాచూడలేదు, చిన్నచూపు చూశాడు."

విశాల నిట్టూర్చింది.

శారద కాఫీ తెచ్చియిచ్చింది తండ్రికి.

"అమ్మా. శారదా... ఆ పెళ్లివారు కబురంపారు. అబ్బాయికి నువ్వు నచ్చావుట..."

విశాల గతుక్కుమంది.

శారద పేలవంగా నవ్వింది.

"కాని-ఆరువేలకట్నం కావాలట. ఆపైన లాంఛనాలూ...పెళ్లికర్చులూ..."

విశాలవంక చూస్తూ అన్నాడు పురుషోత్తం. "విశాలా!... ఆర్థికంగా నేను చాలా చితికిపోయాను. వేణు నడిగి అప్పు ఇప్పించగలవా?"

"సంబంధం మంచిదేనా?"

"ఏదో ఫరవాలేదు. అబ్బాయి స్కూలుటీచరు. జీతం రెండువందలయాభై..."

"ఆమాత్రం దానికే ఆరువేలా!"

"రోజు లలాగ ఉన్నాయి. ఆడపిల్లలని కనడమే నేరం అయిపోయింది-"

ఇక్కడ అంతకంటెచాలా చక్కనిసంబంధం చూశానునాన్నా. పెళ్లికొడుక్కి కట్నకానుక లక్కరలేదు. వెయ్యిరూపాయల జీతగాడు. అందమైనవాడు. వయస్సు ముప్ఫయ్‌నాలుగు. చాలా మంచి మనిషి."

శారద అక్కడనుంచి వెళ్లిపోబోయింది.

"ఉండు శారదా. కూర్చో..." అని-"ఎటొచ్చీ రెండోపెళ్లి అనుకో. ఐతేనేం? శారద తప్పకుండా సుఖపడుతుంది," అంది విశాల.

రెండో పెళ్ళివాడా? మొదటిభార్య చనిపోయిందా?" అడిగాడు పురుషోత్తం.

"చనిపోయిన వాళ్లల్లోనే జమ. కదలలేదు..."

"మొదటి భార్యకి పిల్ల ల్లేరూ?"

"ఉన్నారు. ఓ అమ్మాయీ అబ్బాయీ..."

"మరి-ఆమె కీపెళ్లి యిష్టమో కాదో!"

"ఆమె బలవంతంమీదనే జరుగుతుంది పెళ్ళి."

"నాన్నా! అక్కయ్య చెప్పేది ఎవరిగురించో కాదు. తన గురించే." రుద్ధ కంఠంతో అంది విశాల,

"అమ్మా! విశాలా!-" కళ్లు చీకట్లుకమ్మాయి పురుషోత్తానికి.

"విచారించకు నాన్నా... నేను పూర్వజన్మలో చేసుకున్న కర్మ. నాన్నా! నామీద నీకేమయినా దయాదాక్షిణ్యాలుంటే యీ పెళ్లి జరిపించి నా కోర్కె తీర్చు. మనస్ఫూర్తిగా చెబుతున్నాను. శారద కేమీ అన్యాయం జరగదు. శారద నా చెల్లెలు. నేను దాన్ని కొంతకాలం పెంచాను..."

"నీకు నువ్వే ద్రోహంచేసుకుంటావా విశాలమ్మా!"

"ద్రోహం కాదు నాన్నా. న్యాయం. నాకోసం వేణుని జీవితాంతమూ నాశనంచేయడం నాకు ధర్మమా? నేను చాలా ఆలోచించాకనే యీ నిర్ణయానికి వచ్చాను నాన్నా. నువ్వంగీకరిస్తే... అదృష్టవంతురాలిని..."

"నాకేమీ పాలుపోవడం లేదమ్మా. చివరికేం జరుగుతుందో?"

"శారదకి శుభమే జరుగుతుంది. అందుకు పూచీ నాది."

పురుషోత్తం యిక మాట్లాడలేకపోయాడు. ఆర్థికబాధలూ, వయోధి

కృతా— అన్నీ కలిసి అతన్ని యిదివరకే బలహీనుడిని చేసేశాయి. విశాల మాటలతో అతని మెదడు మరీ శూన్య అయిపోయింది.

అనేక తర్జన భర్జనల అనంతరం శారదా వేణుల వివాహం నిరాడంబరంగా జరిగిపోయింది. విశాల - వేణు శారదని వివాహం చేసుకోడానికి అంగీకార పత్రం సంతకంచేసి యివ్వబోయింది. కాని అందుకెవరూ అంగీకరించలేదు.

"అక్కా! నువ్వు నాకు మేలే చెయ్యగలవు కాని కీడు తలపెట్టవు. పరాయి దానిలాగా నీనుంచి యిటువంటి పత్రాలు తీసుకుందుకు నాకెంత సిగ్గుగా ఉంటుందో ఆలోచించు. నేను సిగ్గుమాలిన దాన్ని కాలేనక్కా." అంది శారద.

"అదికాదు. నేను ఎంత అక్కయ్య నయినా - నీకు కొన్ని సందేహాలూ సంశయాలూ ఉండొచ్చు కదా?"

"నాకేమీ సంశయాలూ లేవూ, సందేహాలూ లేవు."

"సరే. నిన్ను ఆశీర్వదిస్తున్నాను." అంటూ శారద తలమీద చేతితో నిమిరింది విశాల మంచంమీద కూర్చునే.

పెళ్లి జరిగిపోయింది

ఇప్పుడు వేణుగదిలో పిల్లలు పడుకోవడం లేదు. ఆ గది — శారదకీ వేణుకీ కేటాయించబడింది.

## 5

వేణు విశాల ముఖం చూడడానికే బిడియపడుతున్నాడు.

అతని కేమిటో తప్పుచేసినట్లుంది. శారద ముందుకూడా ఉత్సాహంగా ఉండలేకపోతున్నాడు. శారదని చూస్తే చాలు - శిక్షింపబడిన నిరపరాధిలా కనిపిస్తోంది. ఆమెను తాకడానికి ప్రయత్నించబోతే తప్పు చేస్తున్నట్లు భావన కలుగుతోంది. శారదకీ విశాలతో మాట్లాడ్డానికి జంకుగానే ఉంది. ఒకవైపు బావ ప్రవర్తన బాధిస్తోంది. తనని పెళ్లిచేసుకోడం యిష్టంలేనట్లుంది బావకి. అందుకే దూర దూరంగా ఉంటున్నాడు.

అనుభవమున్న మనిషి కనుక విశాల శారదముఖం చూసి యిట్టే పోల్చేసుకుంది. "శారదా! ఏంజరిగింది? చెప్పవూ?"

శారద సిగ్గు అభినయించి మౌనంగా మిగిలిపోయింది.

విశాల ఆ విషయం రెట్టించలేదు.

ఆ రాత్రి భోజనాలకి కూర్చున్నప్పుడు - "మీ యిద్దరికీ ఒక ప్లేటు చాలు. నవదంపతులు అలాగే తినాలి," అంటూ ఒక ప్లేటు తీసేసింది.



"అల్లరి చెయ్యకు విశాలా. నేనేమయినా చిన్నపిల్లవాడినా ?"

"శారద చిన్నదే. ఆ సంగతి మరచిపోకు."

''వద్దక్కా,'' బ్రతిమాలింది శారద.

"నీకేం తెలుసు?" అంటూ కసిరి—"నేనున్నానని సిగ్గుపడుతున్నారా? అయితే భోజనం ఆ గదిలోనే చేస్తాను'' అంది.

"వద్దొద్దు—" అన్నాడు వేణు.

''అయితే – నువ్వు ముద్ద శారద నోటి కందించు—'' అంది విశాల.

గత్యంతరం లేక అలాగే చేశాడు వేణు.

శారద చేత వేణుకి తినిపించింది.

ఒకవైపు సిగ్గు... మరోవేపు సంకోచం... శారదకీ వేణుకీ అర్ధభోజనమే అయింది.

భోజనానంతరం ఒకరిచేత ఒకరికి తమలపాకు లిప్పించింది

''వెన్నె లెంత బాగుందో చూశారా ? సరదాగా అలా షికారు తిరిగిరండి."

వాళ్లిద్దరూ మాట్లాడలేదు.

"వేణూ ! రేపు నీకు శలవే ఆలస్యంగా లేచినా బాధలేదు. పున్నమినాడు బీచ్‌లో ఎంత సరదాగా గడపవచ్చునో శారదకి రుచి చూపు."

వేణు శారదని తీసుకుని బీచ్‌కి బయలుదేరాడు.

శారద వేణుచేతిలో చెయ్యివేసి నడిచింది. ఆమె యిప్పుడు చాలా పశ్చాత్తాప పడుతూంది. వేణుని తను చాలా యిబ్బంది పెడుతూంది.

అక్కయ్యకీ తనకీ మధ్య అతను నలిగిపోతున్నాడు. ఇష్టంలేని పెళ్లికి తలవొంచాడు తనలాగే. బలవంతపు కాపురం...

తనూ నాశనం అయిపోయింది. అనుభూతులూ అనుభవాలూ లేని జీవితం.

ఇద్దరు బిడ్డల తండ్రిని - అన్ని సరదాలూ తీరిపోయినవాడిని - పెళ్లిచేసుకుని తను ఏం అనుభవాలు అనుభూతులూ ఆశించగలదు ?

తను తొందరపడింది. అందుకు ఫలితం అనుభవిస్తూంది.

"శారదా !"

"ఊఁ."

"ఏమిటాలోచిస్తున్నావ్ ?"

"ఏమీలేదు."

"నీ బాధ నాకు తెలుసు శారదా ! కాని - ఏమీ చేయలేని పరిస్థితి. నన్ను క్షమించగలవా" ?

"అలా మాట్లాడకు బావా !" దుఃఖం ముంచుకొచ్చింది శారదకి.

"ఇంతవరకూ నీకు చేదు అనుభవాలే మిగిల్చాను. శారదా ! ఇవాళ నా బాధ నీతో చెప్పుకుంటాను. నువ్వెలా చెబితే అలా చేస్తాను."

వెన్నెలలో సముద్రం చాలా అందంగా ఉంది. కెరటాలు ఉవ్వెత్తున లేచి విరిగిపడుతున్నాయి. వాతావరణం చక్కగా ఉంది.

"శారదా! మీ అక్క నన్ను పూర్తిగా అర్థంచేసుకోక తొందరపడి మనకీ పరిస్థితి కల్పించింది. ఆమె భావించినట్లు నేను చపలుడినీ చంచలుడినీ కాను. నిజానికి - మీ అక్కయ్య తొందరపడే మనిషికాదు. కాని - అమె అనారోగ్యం తెలివితేటలకూ ఆలోచనలకూ గ్రహణం పట్టించింది. ఫలితం-మన పెళ్లి కోసం ఆరాటపడిపోయింది. నేనెవరికీ అన్యాయం చేసే మనిషినికాను..."

శారదకి అవకాశం లభించింది. "మంచికో చెడ్డకో మనకి వివాహం జరిగింది. కనుక మనం వివాహితులలాగే ప్రవర్తించడం న్యాయం అనుకుంటాను." మెల్లగా అందామె.

వేణుకి తన పొరపాటు స్పష్టంగా తెలిసి వచ్చింది. ఏదేమయినా తను శారదను పెళ్లిచేసుకోడం అంటూ జరిగింది కనుక తను తన విధి నిర్వర్తించి తీరాలి. తనవల్ల శారదకి అసంతృప్తి కలగకూడదు.

కన్నెవయసులో ఎన్ని కలలు కన్నదో ! ఆ కలలను వీలయినంతవరకూ నిజం చేయవలసిన బాధ్యత తనమీద ఉంది. తమ యింటి పరిస్థితులకోసం శారద సుఖా లెందుకు బలికావాలి ? ఇదెక్కడి న్యాయం ?

వేణుకి - చీకటిలోంచి వెలుగులోకి వచ్చినట్లనిపించిం దొక్కసారి.

శారదమీద అమితమయిన జాలివేసింది

''శారదా !''

ఆమెను కౌగిటిలోకి తీసుకున్నాడు.

ఆమె కన్నీటిని తన పెదవులతో అద్దాడు.

ఆమె చెక్కిళ్లను మృదువుగా స్పృశించాడు.

ఒక్కసారిగా అతనిలో ఆమెపై ఎక్కడలేని ప్రేమా ఉదయించింది.

ఆమెను బిగియార కౌగిలించుకున్నాడు

శారద కా స్పర్శ వినూత్నంగా ఉంది.

ఆ స్పర్శ ఆమె శరీరంలోనూ హృదయంలోనూ కూడా కొత్త కవాటాలు తెరిచింది.

కాంక్షతో అతని మెడచుట్టూ చేతులువేసి తనమీదకు లాక్కుంది.

చందమామ మబ్బులచాటుకు చేరుకున్నాడు.

వేణూ శారదా యిల్లు చేరేసరికి అర్థరాత్రి దాటింది.

వాళ్లు తిన్నగా తమ గదిలోకే వెళ్లిపోయారు.

రోజులు మెల్లగా గడుస్తున్నాయి.

విశాలకి సంతృప్తిగా ఉంది. వేణూ శారదలు కలసి మెలసి ఉంటున్నారు.

ఆయా - వంటపని చేసే అవసరం లేదు.

శారదే వంటచేస్తూంది. పిల్లలనీ చూస్తూంది.

విశాలకి చాలా సంతోషంగా ఉంది.

అస్తవ్యస్తంగా ఉండే తమ యిల్లు మళ్ళీ యిలా ఒక కొలికికి వస్తుందనుకోలేదు.

సాయంత్రం ఆఫీసునుంచి వస్తూ తప్పకుండా పూలు తెస్తున్నాడు వేణు. శారద అతనికోసం గేటుదగ్గరే నిరీక్షిస్తూంది. ఆమె కందిస్తున్నాడు పూల పొట్లాం. సాయంత్రం అయ్యేసరికి చక్కగా స్నానంచేసి అలంకరించుకుని వేణు వచ్చేసరికి వేడి టీ అందిస్తూంది శారద. విశాల నడగకుండానే బీరువాలో చీరలు రోజు కొకటి తీసి కట్టుకుంటూంది. విశాల నగలు తా నలంకరించుకుంటూంది. శారద జీవితధ్యేయం వేణు! అతని సుఖ సంతోషాల



కోసం శాయశక్తులా ప్రయత్నిస్తూంది. ఆ ప్రయత్నంలో ఆమె చాలా ముఖ్యమయిన విషయాలనే విస్మరిస్తూందని ఆమెకి తెలియదు.

ఎప్పుడూ హడావిడే.

"శారదా! కాస్సేపు నా దగ్గర కూర్చుని కబుర్లు చెప్పవే. ఏమీ తోచడం లేదు."

"బావకోసం టిఫిన్ చేస్తున్నాను. తీరిక లేదు. ఏదయినా పుస్తకం యిస్తాను, చదువుకోరాదూ?" అనేది శారద.

బాబు నెప్పుడూ పరిశుభ్రంగా ఉంచుతుంది.

సౌజన్య స్కూలునుంచి వచ్చేసరికి - ముఖం కడిగి, బట్టలు మార్చి - టిఫినూ బోర్నవిటా అందిస్తుంది. శారద వచ్చాక పూర్తిగా తల్లి ముఖం చూడడమే మానేసింది. బాబూ దాదాపు అంతే.

విశాలే మొదట్లో శారదనీ వేణునీ సినిమాలకనీ షికార్లకనీ వెళ్లిరమ్మని బలవంతం చేసేది. వాళ్లిద్దరినీ ఆటలు పట్టించేది. అల్లరి చేయించేది. భోజనాలవడమేమిటి, వాళ్ల గదిలోకి పంపివేసేది. వాళ్లిద్దరూ యింట్లో ఉండే ముగ్గురూ కలిసి పేకాట ఆడుకునేవారు.

శారద ఉత్సాహంగా ఉండేది.

వేణులో కూడా చాలా మార్పు వచ్చేసింది అతనిలో యౌవనం పునరావృతం అయినట్లుంది శారదను అమితంగా ప్రేమించసాగాడు. అతనిలో మునుపటి చిలిపితనం మళ్లీ చిగుళ్లు వేసింది. అతని జీవితం మరోసారి వేగమూ శక్తి

పుంజుకుంది. ఆ వేగంలో అతను కొన్ని విషయాలు విస్మరిస్తున్నాడని అతనికి నిజంగానే తెలియదు.

సాయంత్రం వచ్చేసరికే అన్ని పనులూ పూర్తి చేసుకుని రడీగా ఉంటుంది శారద. వేణు వచ్చి కొంచంసేపే విశ్రాంతి తీసుకుంటాడు. శారదతో కలసి షైరు వెళ్తాడు. తిరిగి వచ్చేసరికి ఏడుగంటలౌతుంది.

విశాల, సౌజన్య, శారద, వేణు భోజనాలు చేస్తారు. అంతే. శారదా, వేణూ తమ గదిలోకి వెళ్ళిపోతారు.

ఇప్పుడు శారద అక్షరాలా వేణు అర్ధాంగి అయిపోయింది.

అతని రుచులూ అభిరుచులూ అన్నీ పూర్తిగా ఆకళింపు చేసుకుంది. అతని కెలా కావాలో అలా ఉండడం నేర్చేసుకుంది.

వేణులో నవోత్సాహం పొంగి పొరలుతూంది. నిజంగా అతను కొత్త పెళ్లికొడుకే అయిపోయాడు. విశాలతో గడిపిన జీవితం అతనిలో మరుగున పడిపో సాగింది. అతని జీవిత సర్వస్వం శారదే అయిపోతూంది.

పండగ వచ్చింది.

మునుపటిలా వేణుకి డబ్బు ఎక్కువ మిగలడం లేదు. విలాసాలకూ వినోదాలకూ ఎక్కువ ఖర్చు అవుతూండడం కొంత వరకూ కారణం.

ఆఫీసునుంచి వస్తున్న వేణుని - అంబర్ స్టోర్స్ ఆకర్షించింది. షోకేసులో వయ్యారాలీనుతున్న దంతపు బొమ్మ అందంగానే ఉంది. కానీ – ఆ బొమ్మ కట్టుకున్న చీరమాత్రం చాలా అద్భుతంగా ఉంది. చిత్రమైన ఎరుపురంగు. ఆర్ద్ర పురుగు లాటిది. వెంటనే ఆగి - షాపులోకి నడిచాడు.

''షోకేసులో చీర - ఖరీదెంత?"

"నూటయాభై. మీకు కావాలంటే యింకా మంచివున్నాయి..."

"వద్దు. అదే కావాలి. ప్యాక్ చేయించండి. మ్యాచ్ అయ్యే జాకెట్ పీస్‌తో సహా..."

ఐదు నిముషాలలో ప్యాకెట్ తయారయింది.

వేణు జేబులో యిక ఏభై మాత్రమే ఉంది. హటాత్తుగా విశాల గుర్తుకొచ్చింది.

వేణు ముఖం రంగులు మారింది. చాలా నేరంచేసినవాడిలా బాధపడ సాగాడు.

తను విశాలని మరచిపోయాడు! విశాలకు చీర కొననేలేదు!

సిగ్గువేసింది. ఒక్కసారి నిట్టూర్చాడు.

ఎల్లుండే పండగ. ఇంట్లోకూడా అట్టే డబ్బు లేదు.

దగ్గరున్న డబ్బుతో విశాలకి చీర తీసుకుంటే...

ఇంక ఆలోచించలేకపోయాడు. వెంటనే - విశాలకి నచ్చే రంగులో చీర ఒకటి తీసుకున్నాడు. చీరతోపాటే జాకెట్ పీసూ!...

వేణుకి విశాలతో గడిపిన రోజులు గుర్తుకు రాసాగాయి,

విశాలకి చాలామంది ఆడవాళ్లలాగే - చీరల సరదా ఎక్కువ.

చీరలు కొనడం ఒకవంతు. వాటికి మ్యాచ్ అయ్యే బ్లౌజ్‌పీసెస్ దొరికే సరికి బ్రహ్మ ప్రళయమే అయ్యేది. కలర్స్ బాగున్నాయని జాకెట్‌పీసులు తీసుకోడం - తరువాత అవి పట్టుకుని వాటికి మ్యాచయ్యే చీరలకోసం వెదకడం! బట్టల దుకాణంలో గంటలకి గంటలు గడిచిపోయేవి.

రెండు ప్యాకెట్లూ పట్టుకుని ఆలస్యంగా యిల్లు చేరాడు. అప్పటికి చీకటి పడి చాలాసేపయింది. విశాల, పిల్లలూ భోజనం చేసేశారు. శారద వేణుకోసం నిరీక్షిస్తూంది.

"ఇంత ఆలస్యమైందేం?"

సమాధానంగా చిరునవ్వు నవ్వుతూ చీరెల ప్యాకెట్లందించాడు.

విశాల నిద్రపోతూన్నట్లుంది,

శారద చీరలు విప్పి - 'బేష్! యీ రంగు ఎంతబాగుంది! ఆరుద్ర పురుగు ఎరుపు..."

"నాకూ చాలా నచ్చింది. నీకు నచ్చుతుందనే తెచ్చేశాను-''

"పద. భోజనాలు చేసేద్దాం."

''ఏమిటి స్పెషల్? అఫ్‌కోర్స్ నువ్వేం చేసినా స్పెషలే అనుకో...''

"మోర్‌కొళంబి. పొటాటో చిప్స్... బీన్స్ ఫ్రై..."

''వెరీ గుడ్. చాలా ఆకలిగా ఉంది పద...''

వేణు బాత్‌రూమ్‌కి వెళ్లి బట్టలు మార్చుకుని వచ్చాడు.

భోజనాల దగ్గర కబుర్లు ప్రారంభం కావడంతో పూర్తయి లేచే సరికి పూర్తిగా అరగంట పట్టింది. చేతులు కడుక్కుని వరండాలోకి వచ్చారు డైనింగ్ టేబులు దగ్గరనుంచి.

"చూడు శారదా! టేబులుమీద కిళ్లీలుంటాయి..."

శారద వెళ్ళి తెచ్చింది.

కిళ్ళీలు ఘుమఘుమలాడిపోతున్నాయి. కుంకుమపువ్వు సువాసనలు చిమ్ముతోంది.

చాలా బాగున్నాయి. నాకిటువంటి కిళ్ళీలు చాలా యిష్టం-"

''మీ అక్క వేసుకునేది కాదు—పళ్లు చెడిపోతాయని."

ఈ మాటలు వింటూనే ఉంది విశాల.

దుఃఖం ఆపుకోలేక దిండులో తల దూర్చి నిశ్శబ్దంగా ఏడుస్తుందామె.

ఆమె కన్నీటితో దిండు తడిసి ముద్దవుతోంది.

వేణు ఎంత మారిపోయాడు!

అతనికి-తను జీవించి ఉందన్న విషయమే జ్ఞాపకం లేకుండా పోయింది.

ఎంతసేపూ శారద...శారద...

అక్షరాలా మగవాడనిపించుకుంటున్నాడు. నిజంగా తప్పుతనదే.

మొదట్లో వేణు శారదతో సరిగ్గా ఉండకపోవడంచూసి-"వేణూ! నువ్వు కొంచెమయినా ఆలోచించి ప్రవర్తించవేం? నీకు యిది రెండో పెళ్ళి కావచ్చు. కాని-శారద సంగతేమిటి? హృదయాన్నడిగి-సక్రమంగా మసులుకో. ఇలా ముభావంగా ఉండే శారద చిన్నబుచ్చుకోదూ? దానికి జీవితమూ అనుభవాలూ కావాలని ఎందుకు గ్రహించవు?" అంటూ మందలించింది. ''నా కుటుంబం కోసమని అది త్యాగం చేసింది. అందుకు పశ్చాత్తాపడే పరిస్థితి రానియ్యకుండా జాగ్రత్త పడవలసిన బాధ్యత నీకుంది.'' అని హెచ్చరించింది.

వేణుకి మెల్లమెల్లగా తన మాటలు తలకెక్కాయి కాబోలు ఇప్పటికి పూర్తిగా శారద వాడై పోయాడు. ఔను. మగవాడంతే. నిరంతర సుఖాన్వేషి. అందుకోసం ఏమార్గమయినా అవలంభించనూ గలడు, ఎందరినయినా దుఃఖ పెట్టనూ గలడు.

ఇటువంటి మలుపు తను ఊహించలేదు.

ఇప్పుడు అత్యవసరమయితే తప్ప వేణు తనని పలకరించడు. రెండు మాటలు మాట్లాడడు. ఎదురుగా ఉండవలసివస్తే నిప్పులమీద నిలుచున్నట్లే.

తను తింటూందో ఉంటూందో అతను పట్టించుకోడు. మాట్లాడవలసివస్తే పెదవుల చివరినుంచే వస్తాయి మాటలు.

ఇవాళ వేణు తనకి కొంచెమయినా మిగలలేదు!

అంతా శారదకే చెందుతున్నాడు.

ఈ పరిణామానికి పూర్తిగా తనే బాధ్యురాలు.

వేణు అంటే మగవాడు. శారద బుద్ధేమయింది? స్వంత చెల్లెలు. అదీ తనని పట్టించుకోవడం మానేసింది. ఏదో వేళకింత తిండిపెట్టేస్తే సరా? అభిమానాలూ అప్యాయతలూ లేకపోతేపోయె, కనీసపు జాలయినా లేదేం తనమీద?

ఏమయినా అంటే పిసుందంటుంది. అంతా వేణుకోసమే. అతన్ని పూర్తిగా ఆకర్షించుకుందుకు ఎన్నెన్ని ప్రయత్నాలు!

నాలుగుకాలాలకీ వాళ్ళు అన్యోన్యంగా ఉండాలనే తన కోరికా. కాని—తనను పురుగుని తీసేసినట్లు తీసిపారేస్తే మాత్రం తను సహించలేదు. తను మాత్రం మనిషిగాదూ? ఇప్పుడలా ఉన్నా ఒకప్పుడు తనూ గర్వంగా బ్రతికిందే కదః

తనకి మాత్రం అభిమానమూ పౌరుషమూ ఉండవూ? తను ఉన్నమాటే మరిచి-తన ఉనికినే విస్మరించి-ఎంత విచ్చలవిడిగా...ఛీఛీ...

ఏడుస్తూనే నిద్రపోయింది విశాల.

అర్ధరాత్రి-హఠాత్తుగా మెలకువ వచ్చింది-బాబు ఏడ్పుకి.

"ఆకలి...పిన్నీ...ఆకలి—"

వాడిమీదా కోపమే వచ్చింది విశాల కొక్క-క్షణం.

ఏం పిల్లలు? ఆకలేసినా అమ్మా అనరు. పిన్నీ...పిన్నీ...పిన్నీ! ఎక్కణ్ణుంచి ఊడిపడిందో పిన్ని?

బాబు స్వరం పెంచాడు.

విశాలకి జాలివేసింది. పాపం. బాబెంత ఆకలిగా ఉన్నాడో?

"శారదా...శారదా..."

జవాబులేదు.

విసుక్కుంటో పాలగ్లాసు దగ్గరగా పెట్టిందేమో అని వెతికింది.

దొరకలేదు. బాబు మరీ బిగ్గరగా ఏడ్వసాగాడు.

"శారదా! శారదా!!" గట్టిగా పిలిచింది.

ఈసారీ సమాధానం లేదు.

విశాలకి ఎక్కడలేని కోపమూ వచ్చింది.

"పశువులు...పందులు..." కసిగా తిట్టుకుంది. శారదకి లేకపోతేపోయె. వేణుకయినా బుద్ధి ఉండక్కర్లేదూ? ఏడుస్తున్నది ఎవరి పిల్లడు? లేచిరావత్తూ? నిన్నో మొన్నో పెళ్లయినట్లేమిటా పరవశం? అంత వొళ్లుమరిచి నిద్రపోతున్నారా, పిల్లాడేడుస్తున్నా తెలియకుండా?"

ఏం చేయడానికీ పాలుపోవడంలేదు.

సారధి గుర్కపెట్టేస్తున్నాడు. తలగడాక్రింద బిస్కట్లున్న విషయం జ్ఞాపకం వచ్చి-అవితీసి-మెల్లగా మంచం మీదనుంచి కిందకు జారింది.

బాబుకి బిస్కట్ అందించింది.

బాబు శాంతించాడు.

అప్పటికి తెలిసింది-నొసటిమీద దెబ్బతగిలినట్లు. అయినా లెక్కచెయ్యలేదు. దేకు కుంటూనేవెళ్ళి మంచినీళ్ళు అందుకుని సారధికి పట్టింది.వాడు ఏమీ జరగనట్లే నిద్రపోయాడు మళ్ళీ.

విశాలకిప్పుడు నొప్పిబాగా తెలుస్తూంది. దెబ్బగట్టిగానే తగిలింది.

రేపటినుంచి- బాబుకి పాలూ, నీళ్ళూ తనకందేలా పెట్టమనాలి. అంతేకాదు.

బాబుని తన మంచంమీదే పడుకోబెట్టమనాలి.

విశాల ఆలోచనలో ఉండగానే సౌజన్య కెవ్వుమంది. ఏదయినా కలవచ్చిందో ఏమో కలవరింతలు ప్రారంభించింది.

విశాల శాయశక్తులా ప్రయత్నించింది సౌజన్య మంచంచేరుకుందుకు.

దెబ్బమీద దెబ్బ... మొత్తానికి సౌజన్యను పడుకోబెట్టింది.

ఆ రాత్రంతా విశాలకు నిద్రలేదు.

పండగనాటి ఉదయం...

శారదా, వేణూ తలంట్లు పోసుకున్నారు.

పిల్లలకి ఆయా తలంటింది.

శారద అప్పుడే కొత్తచీర కట్టేసుకుంది. ఆ చీరతాలూకు ఎరుపు గదిలో వింతగా పరచుకుంటూంది.

విశాలకూడా స్నానంచేసి వచ్చింది. వేణు శారదకిచెప్పాడు విశాలికి కొత్తచీర యిమ్మని.

తీసుకుంటూ అడిగింది- "పిల్లలకి కొత్తబట్టలు వేశారా?"

అవతలిగదిలోఉన్న వేణుకి విశాల ప్రశ్న వినిపించనే వినిపించింది.

వేణు ముఖంలో కత్తివాటుకి నెత్తురుచుక్క మిగలలేదు.

ఎవరూ క్షమించలేని నేరంచేశాడు తను. అసలు-పండగంటే పిల్లలకే.

వాళ్లకి కొత్తబట్టలు కొనకపోవడం తక్కువ నేరం ఏమీకాదు.

ఇప్పుడెలా? ఇంట్లో డబ్బుకూడా లేదు.

"పిల్లలకి తెచ్చినట్లు లేదు..."

"ఆ!" విశాల అరిచినంత పనిచేసింది. "చిన్నపిల్లలు...... వాళ్లకిలేకుండా నా ముఖానికెందుకు కొత్తబట్టలు?"

వేణు ఆమెవద్దకు వచ్చాడు. "వాళ్ళసైజులుతెలియక తీసుకోలేదు. ఇదుగో, వాళ్లని తీసుకెళ్ళి యిప్పుడే రెడీమేడ్‌లో తీసుకుంటాను."

"సరే. పిల్లలు కట్టుకున్నాకే నేను కట్టుకుంటాను."

వేణు పిల్లల్ని వెంటబెట్టుకుని బజారుకు బయలుదేరాడు. అప్పుచెయ్యడం యిష్టంలేక-ఉంగరం తాకట్టుపెట్టి మార్వాడి దగ్గరనుంచి డబ్బుతీసుకున్నాడు. చెరో జతా బట్టలు కొన్నాడు. ఇంటికివచ్చాడు.

"మీ ఉంగరం ఏదీ ?" అడిగింది శారద.

"తాకట్టుపెట్టాను-" మెల్లగా అన్నాడు వేణు. అస్పష్టంగా ఆ మాటలు విశాలకు వినిపించాయి.

"ఇప్పుడు నాకు కొత్తచీర లేకపోతే ఏం?" గొణుక్కుంది విశాల." నాకు చీర కొనే బదులు ఆ డబ్బుతో పిల్లలకు తీసుకుంటే సరిపోయేది..."

విశాలకి భయంవేసింది. ఏమయిందీ ఇంటికి? ఎన్నడూలేనిది - తాకట్టుపెట్ట వలసిన అగత్యం ఏర్పడిందా! అంత ఖర్చులేమున్నాయని?

ఏమో? వేణు తనతో మంచీచెడూ మాట్లాడితేగా? శారదా అంతే. అవసరానికి మించి అరముక్క అదనంగా మాట్లాడదు.

తను కలుగజేసుకుందామన్నా వినే దెవరు?

శారద ఇంటిపెత్తనం లభించిందన్న ఆనందంలో కన్నూమిన్నూ కానకుండా ఉంది. వేణు కొత్తభార్యమోజులో ఉన్నాడు.

ఈ పరిస్థితిలో తానేంచెప్పినా అరణ్యరోదనమే ఔతుంది.

కానియ్. కానున్నది కాకమానదు.

విశాల ఆలోచనలు కట్టిపెట్టింది.

శారద జిలేబీ ఆవడలు చేసింది. సౌజన్య తొందరగా అన్నం పెట్టమని అల్లరి చేస్తున్నట్లుంది.

"సౌజన్యా..." పిలిచింది విశాల.

బిక్కమొహం వేసుకుని వచ్చింది సౌజన్య.

"కూర్చో-"

కూర్చుంది.

"రైమ్స్ పాడు. వింటాను."




"ఇప్పుడు కాదు."

"మరెప్పుడు?"

"భోజనం చేశాక."

"ఇవాళ పండగకదా, పిన్ని పిండివంటలు చేస్తూంది. భోజనాలు తయారయ్యే సరికి కొంచెం ఆలస్యమౌతుంది. అల్లరిచేస్తే ఎలా?"

"అదికాదు."

"మరేమిటి?"

"పిన్నిని కొంచెంహార్లిక్సో కాఫీయో యిమ్మన్నానంతే. అన్నంపెట్టుమనలేదు."

"ఊఁ."

"ఇవ్వనని కసిరింది_"

విశాల మనసులో ముల్లు గుచ్చుకుంది.

పండగపూట పిల్లలను కసురుకోడం దేనికి! వేళదాటిపోతే పిల్లలు ఆకలికి తాళలేరు

"నువ్వయినా పిన్నికి చెప్పు_"

విశాల తన బెడ్‌లోంచి రెండు స్లయిసులు అందించింది.

సౌజన్య తీసుకోలేదు.

"ఏం?"

"వద్దు."

"ఆకలేస్తోందన్నావుగా?"

"లేదులే. వద్దు."

విశాలకి ఏడుపే వచ్చింది. ఎందుకిలా తయారైంది తన పాప? ఆకలినిచంపు కోనయినా చంపుకుంటుంది. కానీ తానిస్తేతినదు.

తల్లీ పిల్లలమధ్య ఎంతదూరం!

కాలం గడుస్తున్నకొద్దీ ఈ దూరం పెరుగుతుందే కాని తగ్గడంలేదు.

ఇదెక్కడి శాపం?

సౌజన్యా సారథీ ఆటలోపడ్డారు.

బంతి విసురుతున్నాడు సారథి. తెచ్చి అందిస్తుంది సౌజన్య.

బంతి విసిరినప్పుడల్లా కిలకిల నవ్వుతున్నాడు సారథి.

వాళ్ల ఆటలుచూస్తూ తనని తానే మరచిపోయింది విశాల.

భోజనాలయ్యాక సాయంత్రం వరకూ నిద్రలోనే గడచిపోయింది.

వేణూ! శారదా సినిమాకి బయలుదేరారు.

పిల్లలని తీసుకువెళ్తానని మాట వరసకయినా అనలేదు.

మానర్స్ తెలిసిన సౌజన్య అల్లరయితే చెయ్యలేదు కాని-ముఖం చిన్నబుచ్చుకుని నిలుచుంది వాళ్లు వెళ్తూంటే.

"పోనీలే. నేను తీసుకెళ్తాను—" అంది విశాల.

"నువ్వా!" కళ్లుతిప్పుతూ ఆశ్చర్యంగా చూసింది సౌజన్య. చక్రాల్లాంటి ఆమె కన్నులలో అపనమ్మకం అతిస్పష్టంగా ప్రతిఫలించింది.

"ఏం, నేను తీసుకు వెళ్లలేనూ?"

"నీకు కాళ్ళులేవుగా?"

"కర్రలున్నాయిగా?"

"ఐతే? నేను రాను."

"ఎందుకని?"

"నవ్వుతారు."

"ఎవరు నవ్వుతారు? ఎందుకు నవ్వుతారు?"

"కర్రలుపట్టుకు నడిస్తే అందరూ నవ్వరూ?"

మనసులో మళ్ళీ కంచె గుచ్చుకున్నట్లయింది.

ఈ పసిపాపకి-తల్లి అంటే అసహ్యం!

భగవాన్! నేను చేసిన నేరమేమిటి?

విశాల కన్నీరు ఆపుకుందుకు విశ్వప్రయత్నం చేయవలసివచ్చింది. ముఖం అటు తిప్పుకుంది.

సౌజన్య అక్కడినుంచి వెళ్ళిపోయింది.
వెక్కి వెక్కి ఏడ్చుకుంది విశాల.
ఆయా వచ్చి పిల్లలకి అన్నాలు పెట్టింది.
విశాల భోజనం చేయలేదు. తిండిమీదకి ధ్యాసే పోలేదు.
ఆలోచిస్తూ పడుకుంది. ససేమిరా నిద్ర రానంది.
సినిమా అయిపోయి వేణూ శారదా తిరిగి వస్తున్నారు నవ్వుకుంటూ.
విశాల నిద్రపోతుందనే అనుకున్నారిద్దరూ.
సరసాలతోనూ సల్లాపాలతోనూ తాపీగా భోజనంచేశారు.
స్పెషల్ కిళ్ళీల సువాసనలు రేరాణి పరిమళాలనే మింగేశాయి.
విశాల గట్టిగా కళ్ళుమూసుకుంది.
వేణు గది తలుపులు మూసుకున్నాయి.
విశాల శరీరమంతా గరిపొడిచింది.
ఎంత మారిపోయాడు వేణు! పండగపూటయినా పలకరించలేదు.
ఆ రోజులలో ఎంత ప్రేమ వొలకబోసేవాడు,
"విశాల, నువ్వులేకపోతే నాకు జీవితమే లేదు" అన్నవేణు యివాళ యిలాగ అయ్యాడు! నాలుగురోజులు పోతే "విశాలా! నువ్వంటే నాకు జీవితమే ఉండదు-" అనేటట్లుంది వైఖరి.
తను-వాళ్ళమధ్య పానకంలో పుడకలా కనపడుతున్నట్లుంది.
ముమ్మూర్తులా మగవాడనిపించాడు వేణు.
శారద అక్కయ్య అనేమాట మరచిపోయింది.
పిల్లలకీ తను అంటరానిదే ఐపోయింది.
ఇంకా తనెందుకు జీవించడం? తను వంటరిది. అడుగుతీసి అడుగు పెట్టలేని తానంటే అందరికీ అసహ్యమే.
తనకి తెలియకుండానే నిద్రలోకి జారింది విశాల.
ఎంతో ఎత్తయిన కొండ.
శిఖరం సూటిగా ఉంది
ఆ శిఖరంమీద-తనూ, బాబూ, సౌజన్యా, శారదా, వేణూ. కిందికి వొంగి చూస్తున్నారు.
కొండదిగువ పెద్ద ప్రవాహం.
సుడులు తిరుగుతూంది బహు భయంకరంగా. అయినా చాలా అందంగా

ఉందా! సీరు. అలాగే చూడాలనిపిస్తూంది వొంగి - యింకా ముందుకు వొంగి చూస్తూంది తను.

ఎవరది? ఎవరు తనని వెనకనుంచి తోసేస్తున్నారు?

అయ్యో! తను పడిపోతూంది.

వేణు, శారద, సౌజన్య.. బాబు... నలుగురూ నవ్వుతున్నారు. విరగబడుతూ వికటాట్టహాసం చేస్తున్నారు. తను కిందకి పడిపోతూంది. అవిగో నీళ్లు.

పడిపోతోంది. చచ్చిపోతూంది.

కెవ్వుమంటూ కేక. కళ్లు తెరిచింది విశాల.

కిటికీలోంచి ఎండ పడుతూంది.

బాబు ఏడుస్తున్నాడు. వాడి చేతిలో టూత్ పేస్ట్. ముఖంనిండా, వొంటినిండా టూత్ పేస్ట్. వాడి బుగ్గలమీద తట్టు తేలింది.

"ఆయా!" సర్వశక్తులూ కేంద్రీకరించుకుని అరిచింది విశాల.

"బాబునెవరు కొట్టారు?" మండిపడుతూ అడిగింది.

"అమ్మగారు..." మెల్లగా భయం భయంగా చెప్పింది ఆయా.

అమ్మగారు!... ఆయాదృష్టిలో అమ్మగారంటే శారద! తనుగాదు.

"ఎందుక్కొట్టింది?"

"పేస్ట్ పాడుచేస్తున్నారని—"

చిన్నపిల్లడు... తెలియక ఏదోచేస్తే దాని కింత శిక్షా !

బాబుని దగ్గరకు తీసుకోబోయింది. వాడు రాలేదు.

గ్రొరె కసాయివాడినే నమ్ముతుందట. ఈ పిల్లవాడు పిన్నికోసమే ఎగబడతాడు. అమ్మ అవసరంలేదు!

బాబు పిన్నిదగ్గరకే పోతాడు, తను పిలుస్తున్నా వినిపించుకోకుండా.

ఆయా వాడికి వొళ్లుకడుగుతున్నట్లుంది.

సౌజన్య హార్లిక్స్ తెచ్చింది.

"నువ్వు తెచ్చావేం? గాజుగ్లాసు చెయ్యిజారితే..."

"పిన్ని పనిలో ఉంది. నన్ను పట్టుకువెళ్లమంది—"

"నువ్వు తాగావా?"

"ఊఁ. కాఫీ తాగాను."

"బోర్నవిటాకాదూ?"

"అయిపోయిందట..."

"ఎన్నాళ్లనుంచి కాఫీ తాగుతున్నావు?"

సౌజన్య సరిగ్గా చెప్పలేకపోయింది.

అదే సమయానికి శారద అక్కడికి వచ్చింది. విశాల సౌజన్యల సంభాషణ విన్నట్లుంది "ఇంక బోర్న్‌విటా తెప్పించదలుచుకోలేదు–" అంది.

"ఏం?"

"వేణు విసుక్కుంటున్నాడు – ఇంటికి చాలా ఖర్చవుతోందనీ; అప్పు చేయవలసివస్తూందనీ."

"ఖర్చుతగ్గించడం మంచిదే. నేనూ కాదనను. కాని– పిల్లల నోళ్లుకొట్టి కాదు. నాకిక హార్లిక్సూ, ఆపిల్సూ, మందులూ వొద్దు కానీ – పిల్లలకి పాలూ బోర్న్‌విటా మానెయ్యకు."

శారద విసురుగా లోపలికి వెళ్లిపోయింది.

విశాలకి ప్రపంచం అంధకార బంధురంగా కనిపించసాగింది.

ఎలాతయారయిందీ యిల్లు చివరికి ;

కొత్తచీరలకీ, సినిమాలకీ డబ్బుతగలేస్తే కాని ఖర్చు— పిల్లలకి బోర్న్‌విటా కొంటే అయిందా! చూడబోతే రేపు పిల్లలకి తిండయినా పెట్టేటట్లులేదు. నెలకి వెయ్యిరూపాయల పైన తెచ్చుకుంటున్న వేణు – పిల్లలకి పాలూ బోర్న్‌విటా యివ్వలేని గతికి దిగజారాడా! తను మునుపు సంసారంచెయ్యలేదూ? అప్పుడు పాతికో ఏభయ్యో మిగిలేదేకాని తగిలేదికాదే? అదనంగా వచ్చింది శారదొక్కతే కదా? ఏంచేస్తున్నారు డబ్బంతా?

ఎంత ఆలోచించినా తేలలేదు విశాలకి.

పిల్లలమీద అపరిమితమయిన జాలికలిగింది.

ఇద్దర్నీ దగ్గరకు తీసుకుని కరువుతీరా కన్నీరు కార్చాలనిపించింది. కాని– వాళ్ళు తనదగ్గరకు రారు!

ఒక్కొక్కమనిషిని దురదృష్టం ఎంతగా వెన్నాడుతుంది!

ఆ రోజు విశాల కేవలం భోజనంమాత్రమే చేసింది.

హార్లిక్స్ కలిపితెస్తే పిల్లల కిచ్చెయ్యమంది.

ఆపిల్‌పండు సౌజన్యకే ముక్కలుచేసి యిచ్చేసింది.

శారద చూసీ చూడనట్లూరుకుంది. ఏమీ పట్టించుకోలేదు.

విషయాలు వేణువరకూ వెళ్లినట్లున్నాయి. విశాలవద్దకు వచ్చాడతను.

"మందులూ, ఆపిల్సూ - ఏమీవద్దన్నావుట?" నిష్ఠురంగా అడిగాడు.

ఈ నెపంమీదయినా వేణు వచ్చి ఎదురుగా కూర్చున్నందుకు విశాల సంతోషించింది.

"ఖర్చు తగ్గిద్దామని, పిల్లలకి బోర్న్‌విటా మానేసేబదులు నేను హార్లిక్సూ పళ్లూ ఆపెయ్యడమే న్యాయమూ ధర్మమూ." కఠినంగానే ఉంది విశాల కంఠం.

"పరిస్థితులు కొంచెం అర్థంచేసుకోవాలి—"

"చేసుకున్నాను కనుకనే." కొంచం ఆగి అంది విశాల. "ఎటూ నేను కాళ్లు లేనిదాన్నీ కదలలేనిదాన్నీ. నామీద ఏంపెట్టుబడి పెట్టినా ఎంతపెట్టినా వ్యర్థమే. ప్రతిఫలం ఉండదు. నన్నూరికే మేపడం దేనికి?"

వేణు హృదయానికి శూలంలా సూటిగా వాడిగా తగిలిందామాట. ఒక్కసారి ఆత్మపరిశీలన గావించుకోవలసిన అవసరం ఏర్పడింది.

తను చేస్తున్నది తప్పయితే—దానికి బాధ్యత పూర్తిగా విశాలదే. లేనిపోని ఊహలతో శారదను పెళ్లిచేసుకునేవరకూ ప్రాణంతీసి వదిలింది. నిజంగా తను ఎప్పుడూ విశాలగురించి తప్ప మరో స్త్రీగురించి ఆలోచించలేదు. పెళ్లిచేశాక విశాలే అన్నది- "శారదకిది మొదటి పెళ్లని మరచిపోకండి." అప్పుడు గుర్తించాడు తన బాధ్యత. శారదకి న్యాయం చేకూర్చడానికి ప్రయత్నించ సాగాడు. మనిషికి మనిషి తోడయితే ఖర్చులు పెరుగుతాయే తప్ప తరగవు కదా? జీతం పెరుగుదలకంటె ధరల పెరుగుదల ఎక్కువైపోతూంది. అందుచేత ఆర్థికపరిస్థితి క్షీణించక తప్పదు. ఈ నిజాన్ని విస్మరించి విశాల అనవసరంగా తనను అపార్థంచేసుకుంది. ఆమె మానసికస్థితి చాలా చెడిపోయింది. వ్యర్థభయాలతో, సందేహాలతో మెదడును నరకంచేసుకుంటుంది. మౌనాన్ని మించిన మందు మరేమీ లేదిప్పుడు.

వేణు సమాధానం చెప్పకుండా అక్కడినుండి వెళ్లిపోయాడు.

దానితో విశాల అభిమానం మరింత దెబ్బతింది. అతనలా మాట్లాడకుండా వెళ్ళిపోవడంతో ఆమె ఆశలన్నీ సమూలంగా కూలిపోయాయి ఒక్కసారి.

## 6

శారదలో ఏదో మార్పువచ్చింది. అదేమిటో విశాలకు తెలియకపోలేదు.

ఆ మార్పుతో విశాల గుండెలలో రాయిపడినంతపని అయింది.

ఎప్పటికప్పుడు విషమసంధిలోనే చిక్కుకునే తనజీవితంమీద తానే జాలి పడింది విశాల.

జరిగినదానికి సంతోషించాలా, విచారించాలా?

ఇదే మరొక పరిస్థితిలో అయితే తప్పకుండా సంతోషించేది. కాని... యిప్పుడు?

తలతిరిగిపోయింది ఆమెకి.

శారద తనంతట తాను చెప్పలేదు. ఆమె చెప్తే ఎంతబాగుండును! ఆమెకూడా శత్రువులా ప్రవర్తిస్తోంది!

ఆయా వచ్చింది.

"చూడు...ఇంట్లో చీమలమందు ఉందా?"

"లేదనుకుంటాను."

"వేగం వెళ్ళి బజారునుంచి తీసుకురా. ఇదిగో చీటీ. ఇది చూపిస్తే యిస్తారు."

చీటీమీద పేరు వ్రాసి డబ్బు యిచ్చింది. "ఒకసారి యీ గదిలో మందు కలిపిన నీళ్ళు జల్లి గుడ్డతో తుడువ్. చీమలు చంపుతున్నాయి"

ఆయా బజారుకివెళ్ళి మందుపొట్లాం తెచ్చింది.

బకెట్‌తో నీళ్లుతెప్పించి కొంత మందు కలిపి — మిగిలినమందు జాగ్రత్త పెట్టింది

శారద ఆ గదిలోకివచ్చి మూడుసార్లు తుమ్మింది

విశాల నవ్వుతూ— "సహజమేలే..." అంది.

"ఏమిటి?" అడిగింది శారద.

"దొంగా, నువ్వు చెప్పకపోయినా నాకు తెలియదనుకున్నావా!-" అంటూ నవ్వింది. "నాకు సంతోషంగా ఉంది. కంగ్రాట్యులేషన్స్..."

శారద సిగ్గుపడుతూ తలతిప్పింది.

"అమ్మ పుట్టిల్లు మేనమామకెరుకే. కొంచెం పుల్లటివస్తువులు తింటూ ఉండు. అవే ఎక్కువ నయిస్తాయ్-"

శారదను తనదగ్గరకు తీసుకుని తలనిమిరింది. "ఆరోగ్యం జాగ్రత్త. పుష్టికరమైన ఆహారం తింటే పండులాంటి కొడుకు పుడతాడు."

శారద తలవంచుకుంది ఏదో ఆలోచిస్తున్నట్లు. విశాల వైఖరి ఆమెకెందుకో కొత్తగా తోచింది. అక్కకి తనంటే అభిమానంలేదని కాదు. చిన్నప్పుడు తనని ఆమె పెంచింది కొన్నాళ్ళు. గాని - వేణుతో తనపెళ్లయాక అక్కయ్య ముఖం చూడటానికి గిల్టీగా ఉండేది. అందుకే తను ఎక్కువ మాట్లాడలేక పోయేది. ఎక్కువసేపు అక్కముందు గడపలేకపోయేది.

ఇవాళ - అక్కయ్యమాటలు అమృతపు జల్లులా ఉన్నాయి. తనంటే అక్కకి ఎంత అభిమానం, ఆప్యాయత! ఇన్నాళ్లూ తనే పొరపాటుచేసింది.

అక్కది ఎంత ఉన్నతమయిన హృదయం!

ఒక్కసారి విశాలను తనివితీరా కౌగలించుకుని కన్నీరు కార్చాలనుకుంది. కాని- ఎందుకనో అలాగ చెయ్యలేకపోయింది.

"పిన్నీ!" అంటూ వచ్చి శారద వీపుమీద వాలాడు బాబు.

వాడిని వడిలోకి తీసుకుని ముద్దుపెట్టుకుంది.

"శారదా!"

''ఏమక్కా?"

"చిన్నకోరిక కోరతాను. తీర్చవూ:"

"అదేమిటక్కా!'' ఆశ్చర్యంగా చూసింది

''మరెప్పుడూ కోరను. నిజంగా కోరను."

విశాల ధోరణికి శారదకి భయంవేసింది.

"ఏమిటి!"

''ఈ రాత్రి - వేణుని - నా గదిలో..."

శారద తల ఎత్తలేకపోయింది.

"తీర్చవూ ?" గద్గదికంగా అడిగింది విశాల.

"అలాగే అసలు నా అధికార మేమిటక్కా? నువు వేణునే అడిగితే సమంజసమేమో!"

నిట్టూర్చింది విశాల "నిజమే అలాగే చేస్తాను. సాయంత్రం ఓసారి దర్శనం యిమ్మని వేణుకి చెప్పు.''

"తప్పకుండా."

శారద లోపలికి వెళ్ళిపోయింది.

విశాల కళ్ళుమూసుకుంది.

మూసుకున్న కనురెప్పల వెనుక ఎంత కన్నీరుందో పరమాత్ముడికే తెలియాలి.

ఒకే యింట్లో ఉంటూకూడా తనూ వేణూ ఎంతదూరం అయిపోయారు!

భార్యాభర్తలు యింతదూరం కాగలరని ఊహించశక్యమా? బ్రతుకు ఎందుకిలా అప్రశ్రుతుల పరంపర అయిపోయింది?

సాయంత్రంవరకూ ఎలాగో గడిపింది విశాల.

వేణు వచ్చాడు.

ఆమె మంచందగ్గరగా కుర్చీలాక్కుని కూర్చున్నాడు.

"మాట్లాడాలన్నావుట?" అడిగాడు.

ఆరోగ్యంగురించి అడుగనేలేదు. కేవలం విధి నిర్వర్తిస్తున్నట్లు పొడి పొడిగా...

విశాలకు దుఃఖం వచ్చింది.

భార్యాభర్తలమధ్య ఉండేది కేవలం విధులూ బాధ్యతలూ మాత్రమేనా? అంతకుమించి మరేమీలేవూ? భార్య అంటే వండిపెట్టేదీ భర్త అంటే సంపాదించేవాడూ అంతేనా అర్థాలు?

వివాహబంధం యింత బలహీనమైనదా? భర్త సేవలకు అనర్హురాలైతే ఆ స్త్రీ యిక జీవచ్ఛవమేనా? మాటకికూడా నోచుకోదా?

"ఊఁ" మెల్లగా అంది విశాల.

"ఏమిటి?" అడిగాడు వేణు

"చిన్న కోరిక... తీరుస్తారా?" దీనంగా అడిగింది విశాల.

వేణు హృదయం జాలితో తొణికిసలాడింది "చెప్పు. నీ మాట ఎప్పుడయినా కాదన్నానా?"

"ఈ రాత్రి .. ఒంటరిగా ఉండలేను. ఈ ఒక్కరాత్రే... ప్లీజ్...నా గదిలో పడుకోరూ? మరెన్నడూ అడగను..."

వేణుకి విశాలమీద ఎంతో జాలికలిగింది.

తనమీద తనకి కోపమూ వచ్చింది.

ఎంతో పశ్చాత్తాపపడుతూ "ఇంత చిన్న విషయానికి నువ్వు ప్రాధేయపడాలా విశాలా?" అన్నాడు.

ఆమె ఆనందంగా చూసింది.

వేణు విశాల చేతులను తనచేతులలోకి తీసుకున్నాడు.

ఆమె కంపించింది- వేణు స్పర్శలో ఆనాటి ఉద్రేకమూ లేదు, ఉత్సాహమూ లేదు.

అతను శారదకేం చెప్పాడో ఏమో, ఆ రాత్రి పిల్లలను తనతోపాటు పడుకోబెట్టుకుంది శారద.

భోజనాలయ్యాక వేణు విశాలగదిలోకి వచ్చాడు.

విశాలకి కిళ్లీ అందించాడు.

విశాల మంచంమీద కూర్చున్నాడు. ఆమె చెక్కిళ్లను నిమిరాడు.

"వేణూ!-"

"ఊఁ"

"ఏమయినా మాట్లాడవూ?"

"నువ్వే చెప్పు."

"గతం గుర్తుకిరావడంలేదూ?"

వేణు మౌనంగా చూశాడామెవైపు.

ఆమె పెళ్ళినాటి పట్టుచీర కట్టుకుంది.

చక్కగా అలంకరించుకుంది.

సెంటు పూసుకున్నట్లుంది సన్నని పరిమళాలు వస్తున్నాయ్

మూలనున్న స్టాండ్‌మీద అగరొత్తులు వెలుగుతున్నాయి.

ఆమెకు అన్నీ జ్ఞాపకం వస్తున్నాయి.

మొట్టమొదటిసారిగా సినిమాహాలుపద్ద వేణుతో పరిచయం కావడం...

అతని చిలిపితనమూ, తెలివితేటలూ, స్నేహమూ, ప్రేమా...

తరువాత పెళ్లి - ఆదర్శదంపతుల్లా ఉన్నారని నలుగురూ అభినందించడం.

సౌజన్య పుట్టింది ఆమె పుట్టడంతో తనజీవితానికే నిండుతనం వచ్చింది. ఏదో సాధించినట్లు నిబిడీకృతమైన గర్వం, ఆత్మవిశ్వాసం

కొంతెంకాలానికి మళ్ళీ బాబు

అప్పుడే గతుకులలోకి పడిపోయింది జీవితరథం

ఇక మరి లేవలేదు. తనకి పేరుతెలియని జబ్బు... పక్షవాతంవంటిది. కాళ్లు పోయాయి. మరి తను నడవలేకపోయింది. అవిటిదైపోయింది. ఇక జీవితంలో ఆశ అన్నది లేకుండా పోయింది. బ్రతుకు వెలుగుకీ మెరుపులకీ నోచుకోవడం మానేసింది. పెనుచీకటి అయిపోయింది.

వేణుని తను చాలా ఇబ్బందిపెడుతున్నట్లనిపించేది.

వంటకీ యింటిపనులకీ ఓ మనిషిని కుదుర్చుకున్నారు.

ఆమె వంట అంత బాగుండేదికాదు.

పిల్లలనీ సరిగ్గా చూడగలిగేది కాదు.

ఎందుకో యిక తనజీవితం పరిష్కారం దొరకని సమస్యగానే మిగిలి పోతుందన్న నిర్ణయానికి వచ్చేసింది.

అదే సమయంలో శారదకి పెళ్ళిసంబంధం చూడమంటూ ఉత్తరం వ్రాశారు.

వేణుకి శారదనిచ్చి వివాహం చేస్తే తమ సమస్యలన్నీ తీరిపోతా యనిపించింది.

వేణు సుఖంకోసం...పిల్లల పెంపకంకోసం... వేణుకి శారదనిచ్చి ద్వితీయ వివాహం చెయ్యడమే ఏకైకమార్గంగా తోచింది. నాన్నా శారదా, వేణూ కూడా అంగీకరించారు చివరకు. నాన్న పేదవాడై పోకపోతే శారదకి రెండో పెళ్లివాడిని చేయడానికి ఒప్పుకునేవాడు కాదేమో!

శారద యీ యింటిలో అడుగుపెట్టింది– భార్యగా...వేణు భార్యగా, వాళ్ళిద్దరినీ భార్యాభర్తలుగా మలచడానికి తనెంత కష్టపడవలసివచ్చిందో!

శారద తన చెల్లెలు,

ఆమె కాకుండా మరెవరయినా వేణుభార్యగా వస్తే ఎన్ని గొడవలు జరిగి వుండేవో !

చిన్నచిన్న తగవులూ అసంతృప్తి తలఎత్తకపోలేదు, కాని- అవి పెద్దవి కాలేదు. తాము వీధిన పడలేదు. అదే తృప్తి.

శారదతో జీవితంలో వేణు తనని పూర్తిగా మరచిపోయాడు.

విశాలతో గడిపిన జీవితం మరుగునపడిపోయిం దతనిహృదయంలో

ఆ అధ్యాయాలిక తిరిగి తలఎత్తవు, అది తథ్యం.

ఇంకా తన జీవితానికి అర్థమూ ప్రయోజనమూ ఏమిటి?

జీవచ్ఛవంలా తను కాలంగడపడం దేనికి? ఏం చూసుకుని? ఏ ఆశతో?

వేణు విశాలకు దగ్గరగా జరిగాడు.

ఆమె మెడకింద చెయ్యివేశాడు.

ఆమె కన్నులలోకి చూస్తూ- "విశాలా!" అన్నాడు లాలనగా. ఎందుకిలా జరిగింది విశాలా? మనం ఎందుకింత దూరం అయిపోయాం? ఇన్నాళ్ళూ ఒకరి కొకరం దూరంగా ఎలా వుండగలిగాం? ఈ ప్రశ్నలన్నీ అతని పిలుపులో మెకి వినిపించినట్లే అయ్యాయి

అతని మెడచుట్టూ చేతులువేసి ముఖాన్ని దగ్గరగా లాక్కుని- "క్షమించు వేణూ!" అంది. ఇద్దరూ చాలా నిమిషాలు మౌనంగా వుండిపోయారు.

ఎంతోకాలం అనంతరం లభించిన ఆ కౌగిలీ, స్పర్శా వారిరువురిలో క్రొత్త క్రొత్త ఆలోచనలనూ అనుభూతులనూ రేపుతున్నాయి.

ఒకవిధమయిన పరవశంలో మిగిలిపోయా రిద్దరూ.

"వచ్చే జన్మలో నువ్వే నాకు భర్తగా లభించాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తాను వేణూ!"

"ఏమిటి విశాలా, నీకు పిచ్చెక్కలేదు కద?" మందలించాడు వేణు ఆమెను మరింత దగ్గరగా తీసుకుంటూ. కాలంగడుస్తూందనే మరచిపోయారిద్దరూ.

ఎక్కడో ఎవరో వెక్కి వెక్కి ఏడుస్తున్నట్లు...

త్రుళ్ళిపడి లేచింది విశాల. శారద కాదుకద?

వేణుని తట్టి లేపింది. అతను కళ్ళుతెరిచాడు "ఏమైంది"

"నువ్వెళ్ళి ఆ గదిలో పడుకో. పిల్లల్ని నాదగ్గర పడుకోబెట్టు..."

"వద్దు-" బద్ధకంగా అన్నాడు వేణు

"ప్లీజ్... చెప్పినమాట విను..." బ్రతిమాలింది విశాల.

గడియారం ఒంటిగంట కొట్టింది.

వేణు పిల్లలని విశాలపక్కన పడుకోబెట్టి-తను శారదగదిలో నిద్రపోయాడు.

* * *

మామూలుగానే తెల్లవారింది.

శారద లేచి పనిమనిషికి తలుపుతీసింది.

మెల్లగా పనులలో చొరబడింది.

కాఫీలు కలిపేసినా సౌజన్య లేవలేదు.

ఎప్పుడూ ఆరుగంటలకే లేచి అల్లరిమొదలుపెట్టే బాబు ఆరున్నర దాటుతున్నా లేవలేదు. మామూలుగా అయితే యీపాటికి విశాల సౌజన్యని తొందరచేసేదీ ముఖం కడుక్కోని కాఫీ త్రాగమనీ, హోమ్‌వర్క్ చేసుకోమనీ.

ఇవాళ స్కూలుకి శలవుకాదే? మరెందు కింకా పడుకుంది సౌజన్య? వంట్లో బాగులేదా? ఊహుఁ. రాత్రి బాగానే వుందే.

శారద విశాల మంచంవరకూ వచ్చింది. సౌజన్యని తట్టింది. అంతే. షాక్ తగిలినట్లయింది. ఒక్కక్షణంలో భయమూ ఆశ్చర్యమూ అపరిమితంగా కలిగి ఏదో అనుమానంతో ఆమె నిలువునా వణికిపోయింది

ఎలాగో తూలిపోతూ వేణుగదిలోకి పరుగెత్తి అతనిమీద వాలిపోయింది.

"ఏమిటి?" కళ్ళుతెరిచాడు వేణు

"పాప...సౌజన్యతో..." ఇకనోరు పెగలలేదు. సౌజ్ఞలతో ఏవేవో చెప్పింది.

వేణు కంగారుగాలేచి పరుగెత్తాడు.

శారద గుమ్మంవరకూవచ్చి ద్వారాన్ని ఆసరాచేసుకుని నిలబడింది వణికి పోతూ.

"సౌజన్యా! పాపా!-" గావుకేకవేశాడు వేణు.

పనిమనిషికూడా పరుగెత్తుకు వచ్చిందక్కడికి. సౌజన్యని ముట్టుకునిచూసింది.

''ఇంకెక్కడి పాపబాబూ!-" ఏడిసింది పనిమనిషి.

ఇంత గందరగోళం జరుగుతున్నా విశాలకానీ బాబుకానీ చలించకుండా నిద్ర పోతూనే ఉన్నారు. ఏదో అనుమానం వచ్చింది వేణుకి. విశాలనూ బాబునీ కదిపి చూశాడు. పిలిచాడు. అరిచాడు.

ఊహుఁ. వారిలో చలనంలేదు.

"విశాలా! సౌజన్యా!! సారధీ!!!"

కెవ్వున కేకలు వేసి కూలిపోయాడు వేణు.

కొన్నినిమిషాల అనంతరం-డాక్టర్ వచ్చాడు.

వేణుకి ఇంజక్షనిచ్చాడు. అతనికితెలివివచ్చింది. కొంచెంసేపటికి మనిషయ్యాడు.

''సారీ వేణూ!'' నేను స్నేహితుణ్నికనుక నిజం దాచలేను... ఈ ముగ్గురి చావూ సహజమైంది మాత్రంకాదు."

"ఆ!'' నిర్ఘాంతపోయాడు వేణు.

"ఎండ్రినో- మరేదో తీసుకుని... బలవంతంగా..." ఆగిపోయాడు డాక్టర్.

వేణుకి మతిపోయింది

''పరిస్థితిని జాగ్రత్తగా గుర్తించు. అనుగుణంగా చెయ్. లేకపోతే ప్రమాదం." హెచ్చరించాడు డాక్టర్.

తల్లీ, పిల్లలూ ఆత్మహత్య చేసుకున్నారని బయటకు పొక్కిపోకమునుపే శవాలకు సంస్కారం జరిపించేశాడు వేణు.

అతని మెదడులో విషయపుముల్లులా బాధిస్తూందొకప్రశ్న.

విశాల ఎందుకింత దారుణానికి తలపడింది?

ఆమెకు తనుచేసిన లోటేమిటి?

ఏ విషయంలోనూ ఆమె యిష్టానికి వ్యతిరేకంగా నడవలేదే?

ఆమె వత్తిడి చేయడంవల్లనేకదా తనకు నిజంగా యిష్టంలేకపోయినా శారదను పెళ్ళిచేసుకున్నాడు?

"వేణూ! బావా..." ఏడుస్తూవచ్చింది శారద.

ఆమెవైపు చూశాడు వేణు.

"నాన్న వచ్చాడు-"

పురుషోత్తం ఆ గదిలోకి వచ్చాడు. వేణుని చూస్తూనే దుఃఖం ఆపుకోలేక ఒక్కసారి పసివాడిలా ఏడ్చేశాడు. "చివరికిలా జరిగింది! విశాలా! నువ్వు మాకింత అన్యాయంచేసి పోతావనుకోలేదు. ఎందుకింత ఘోరం తలపెట్టావు?"

పురుషోత్తం దుఃఖం వేణునీ శారదనీ తెగ కలవరపెడుతోంది. ఆయన తమ ననుమానించడం లేదుకద?

"అల్లుడూ! విశాల ఎందుకింత దారుణం తలపెట్టింది?''

వేణు మాట్లాడలేదు. తలవంచుకుని ఉండిపోయాడు.

**శారద** అక్కడినుంచి వెళ్ళిపోయింది-ఏదో పనున్నట్లు.

ఆయా పరుగు పరుగున వచ్చింది.

"బాబూ!"

"ఏం ?"

"విశాలమ్మగారి తలగడకింద..." ఉత్తరం అందించింది.

ఆత్రతగా అందుకుని చదువసాగాడు వేణు.

"వేణూ!

ఈ సరికి నువ్వు నన్నసహ్యించుకుంటూ ఉంటావేమో! సహజమే. ఈ విశాల నువ్వు ఊహించని నీచానికి తలపడుతూంది మరి. చదువుకుని - ఇంతో అంతో లోకజ్ఞానంకల విశాల ఎందుకింత మూర్ఖత్వానికి తలపడిందని నీకు సందేహం కలగడం సహజమే. వాటిని తీర్చవలసిన విధి నామీద ఉంది. అందుకే యీ ఉత్తరం, నేను పిచ్చిదాన్నిగా, హంతకురాలిగా, కఠినాత్మురాలిగా, తోచవచ్చు. నిజమే. కాని-నేను వేసే ప్రతి అడుగువెనకా కారణముంది. నా అంతరాత్మ ప్రోద్బలముంది.

వేణూ! ఆడదాని జీవితం మూడుదశలు, మూడంచెలుగా సాగుతుంది. కన్యగా కలలు కంటుంది. ఆ కలలు నిజమైతే?-అని ఉవ్విళ్లూరుతుంది ఎప్పుడో ఎవరికో తప్ప కలలు నిజంకావు. ఈ విషయంలో నేను నిశ్చయంగా అదృష్టవంతురాలిననే చెప్పగలను. నీవంటివాడి ప్రేమ పొందడమూ, నిన్ను వివాహం చేసుకోగలగడమూ-చాలా అదృష్టమే మరి.

తరువాతి దశ-భార్యగా నేను స్వర్గసుఖాలనే చవిచూశాను. ఏ లోటూ లేకుండా జీవించాము. నలుగురిలోనూ ఆదర్శదంపతులం అనిపించుకో గలిగాము. అది నేను పూర్వజన్మలో నోచుకున్న పుణ్యఫలమే.

ఎన్నో ఆశలు పెంచుకున్నాం. ఇంకెన్నో కలలు కన్నాం. ఇద్దరు పిల్లలతో ముచ్చటగా సంసారం సాగించుకుందా మనుకున్నాం. అందుకే నేను ఆపరేషన్ చేయించుకున్నాను.

మనం తీసుకోగలిగిన జాగ్రత్తలన్నీ తీసుకున్నాం ఆయినా దురదృష్టం నన్ను బలికొన్నది.

సౌజన్య పుట్టి-నన్ను తల్లిని చేసినప్పుడు చెప్పలేనిగర్వం పొందాను.

అది నన్ను అమ్మాఅని పిలిచినప్పుడు వెర్రిగా ఆనందించాను,

బాబుకూడా పుట్టాడు.

నా కలల కేంద్రాలు పిల్లలయ్యారు.

స్త్రీ అమ్మ అయ్యాక అంతేఏమో! వారి భవిష్యత్తుగురించి ఊహించుకోడం లోనే స్త్రీకి సంతృప్తి. పిల్లలనుపెంచి పెద్దచెయ్యడంలోనే స్త్రీకి సుఖసంతోషాలు.

తల్లి అయ్యాక స్త్రీ కొంతవరకు భర్తకిదూరం ఔతుంది ఇది సహజమే. సృష్టి ఆటువంటిది. నేనూ అంతేఅయ్యాను. తల్లినయ్యాక బిడ్డలే నాకు పంచప్రాణాలు అయిపోయారు. వాళ్లేనా సర్వస్వం అన్నభావన నాకు తెలియకుండానే నాలో పెరిగిపోయేది. మునపటిలా నీకు సేవలు చేయలేకపోయేదాన్ని.

విధి శపించినట్లు నేను వ్యాధిగ్రస్తురాలినయ్యాను.

కదలలేనిదాన్నయ్యాను.

కాళ్ళు వస్తాయన్న ఆశలేకుండా పోయింది.

నాకోసం ఎంత ఖర్చుచేశావు! ఎంత శ్రమపడ్డావు!

నీకు నా కృతజ్ఞతలు.

ఇల్లు అస్తవ్యస్తం అయిపోయింది.

వంటమనిషీ, ఆయా-వీళ్లుఇల్లు నడపసాగారు.

భరించలేకపోయేదాన్ని. మంచంమీద ఉండలేకపోయేదాన్ని.

ఉండీ లేనిదాన్నే అయిపోయాను.

పిల్లలకి తల్లిగాకర్తవ్యం నెరవేర్చలేకపోతూ. భర్తకి భార్యని కాలేకపోతూ-ఎంత దుర్భరమైన జీవితమో ఊహించు.

నా మనసుస్తిమితంగా ఉండేదికాదు. పనిలేని మంగలి పిల్లిబుర్రగొరిగాడన్న సామెతలా — పరిపరివిధాల ఆలోచిస్తూండేదాన్ని. నిజంగా నాకు పిచ్చెక్కి-పోతుందేమో అనిపించేది.

అటువంటి పరిస్థితుల్లో నీకు పునర్వివాహం చెయ్యడం మంచిదిగా తోచింది. వేణూ! ఆనాడు నేనేమీ ఆలోచించలేకపోయాను. పంతమేతప్పు కొంచెమైనా ముందుచూపు లేకపోయింది ఆడవాళ్లు చదువుకున్నా మూర్ఖులుగానే మిగిలిపోతారు సుమా!

నా మాట నమ్ము వేణూ! నేను శారదను సవితిగా చూడలేదు. ప్రత్యర్థిగా భావించలేదు. నువ్వామెకు చేరువైనందుకు చింతించలేదు సరికదా సంతోషించాను. కాని-

నా ధ్యేయం... నా కోరిక... నా ఆశ... వాటికి ముప్పొచ్చిపడింది.

"పిల్లల భవిష్యత్తుకి మనం ఏమయినా చేసితీరాలి. ఇద్దరిపేరా కొంతడబ్బు కూడపెట్టాలి, సౌజన్యకీ సారధికీ చక్కగా చదువులు చెప్పించి - పెద్దవాళ్ళను చెయ్యాలి." అనేవాడివి. నేను మురిసిపోయేదాన్ని.

అటువంటి నువ్వు—పండగకి పిల్లలకు కొత్తబట్టలు కొనడం నిర్లక్ష్యంచేశావు! నేను చెప్పేవరకూ ఉపేక్షించావు!

దానితో నా భయాలు ప్రారంభమయ్యాయి.

ఖర్చు తగ్గించాలని పిల్లలకు బోర్నవిటా హార్లిక్సూ మానేస్తామన్నారు.

నా అనుమానాలు నిజమయ్యాయి.

పిల్లలగురించి నేను కనే కలలు కల్లలే ఔతాయని స్థిరమైపోయింది.

ఆ పిల్లలకి ఎటువంటి భవిష్యత్తుంటుందో ఊహించుకుని అదిరిపోయాను.

శారదకికూడ పిల్లలు పుడతారు.

అప్పుడు నా పిల్లలగతి మరీ అధ్వాన్నమౌతుంది.

నేను ఈర్ష్య పడటంకాదు. అసూయపడటంకాదు. నా ఆవేదనను నీ ముందు పరచుకుంటున్నానంతే.

'కన్య' పాత్ర... 'భార్య' పాత్రకంటె 'అమ్మ' పాత్ర అతికష్టమయినదీ, క్లిష్టమైనదీ. ఆ పాత్ర ఎంతో సున్నితం.

పిల్లలు-నన్ను అసహ్యించుకునేవారు. నా దగ్గరకు రావడానికే వారికి వెరపు. ఒకవిధంగా అది నాకు రంపపుకోతే అనిపించేది. తెలిసీ తెలియని వయసు పిల్లలు. అమ్మ తమతో ఆటలాడాలనీ పాటలుపాడాలనీ అనుకుంటారు. కాస్త జ్ఞానం వచ్చాక— అమ్మవిషయం తెలిశాక- జాలిపడతారు.

పిల్లలు స్వతహాగా తెలివయినవారే. చక్కని పెంపకం కావాలి.

సరిఅయిన వాతావరణంలో పెరగాలి.

ప్రస్తుత పరిస్థితులల్లో అది కష్టం. వాళ్ళమీద నేను పెంచుకున్న కలలు నిజాలౌ తాయన్న ఆశఏమీ మిగలలేదు. వాళ్లు దురదృష్టవంతులు.

నా పిల్లలు దురదృష్టవంతులు కావడం నేను సహించలేను.

నేను వంటరిగా చనిపోతే వారు అనాధలౌతారు.

అదీకాక వాళ్లు హీనంగా పెరగటం నా కెంతమాత్రమూ యిష్టంలేదు.

అందుకే నేను హంతకురాలిని కూడ ఔతున్నాను

నేను తెప్పించినది చీమలమందు కాదు. అంతకంటె శక్తికలది.

నన్ను క్షమించొద్దు వేణూ!

నేను హంతకురాలిని. నేను చేస్తున్న పాపాలకు బాధ్యురాలిని నేనొక్కర్తినే.

నీకుకానీ శారదకుకానీ యీ ఘోరంలో కొంచెమయినా భాగంలేదు.

నేను మనస్ఫూర్తిగా చెబుతున్న మాట యిది. నన్ను నమ్ము.

నాకోసం...నా పిల్లలకోసం... మా ఆత్మశాంతికోసం- రెండుకన్నీటిబొట్లు విడువ్. నువ్వంటే నాకెంత ప్రేమో మాటలతో చెప్పలేను.

ఈ క్షణాలలో నేను భగవంతుణ్ని కోరుకునేదొక్కటే. వచ్చేజన్మలో వేణే భర్తగా దక్కాలి. అతన్ని నేనుతప్ప మరెవరూ పంచుకోకూడదు. అతను పూర్తిగా అంతా నాకే దక్కాలి.

ఇలాగ ప్రార్థిస్తూ నీనుంచి శలవుతీసుకుంటున్నాను.

శారదకి చెప్పు- అక్కకి తనమీద ఏమాత్రమూ కోపంలేదని.

శారదంటే నాకు ప్రేమ. నా మీదా నా మాటమీదా గౌరవంకొద్దీ రెండోపెళ్ళి వాడి నంగీకరించింది. నా పిల్లలను శ్రమపడి పెంచింది.

ఆమె ఋణం తీర్చుకోగలిగింది కాదని నాకు తెలుసు.

మీరిద్దరూ పిల్లాపాపలతో కలకాలం సుఖంగా జీవించాలని నా కోరిక. నాన్నకి నా నమస్కారాలందజెయ్యి. ఇంకేం వ్రాసేది ?

శాశ్వతంగా శలవు తీసుకుంటూ...... విశాల.

ఉత్తరం చదివిన వేణు శిలలా మిగిలిపోయాడు.

———




త్రిభువనదాస్ భాగ్యవంతుడు. భాగ్యవంతు డంటే యిలాగా అలాగాకాదు; అతి భాగ్యవంతుడు. అతనికి ఎంత ఆస్తి వుందో అతనికే తెలియదు. ఆ ఆస్తి వెండి రూపాయలుగా మారిస్తే, ఆ వెండి రూపాయలు కన్యాకుమారినుంచి విధ్య పర్వతాల దాకా పేర్చవచ్చునని ఒక వుద్దండుడు అంచనా కట్టాడు. అతను తలుచుకొంటే అణన్నరకిదారికే షేవింగ్ బ్లేడ్ అర్థరూపాయికుక్కూడా దొరకుండా చెయ్యగలడని కొందరు అర్థశాస్త్రకోవిదులు అంటారు. అందులోని నిజానిజాలు మన కంతగా తెలియవు. త్రిభువనదాస్ సన్మార్గుడనీ, దానధర్మాలు విరివిగా చేస్తాడనీ మరికొంత మంది అంటూ వుంటారు, ఆ విషయమూ మనం అంతగా నమ్మకూడదు. త్రిభువనదాస్ గుప్పెట్లో 18 పెద్ద కంపెనీలు వున్నాయి అతను ఎవరికీ ఒక పక్షాన కనిపించడు. పన్నెండేండ్లబట్టి పనిచేస్తూ అతని మొహం ఎలా వుంటుందో చూడని బ్రాంచి మేనేజర్లు చాలా మంది వున్నారట.

13 కంపెనీల తాలూకు ఏ ఆఫీసులో ఎక్కడ ఏ ఉద్యోగం ఖాళీవచ్చినా, ఆ ఉద్యోగంకోసం వచ్చిన దరఖాస్తుదారులందర్నీ పరీక్షించి, వారిలో బాగా పనికొచ్చే వాడిని ఏరుకునేందుకు ఒక డిపార్టుమెంటు వుంది. దానిపేరు ఉద్యోగాల శాఖ. ఆ శాఖ నిర్వహణలో బోలెడంత కర్మకాండ వుంది. ఏదో ఒకఆఫీసులో గుమాస్తాగిరీ ఖాళీ అవుతుం

దనుకోండి. ఫలానా త్రిభువనదాస్ కంపెనీలో, ఫలానా బ్రాంచిలో, ఫలానా రకం ఉద్యోగం ఖాళీగా వుందనీ, ఫలానా అర్హతలు వున్నవారు, ఫలానా తేదీ అయిదు గంటల లోపున సదరు ఆఫీసుకి అందేటట్టు దరఖాస్తులు పెట్టుకో వచ్చుననీ దిన పత్రికలలో ప్రకటిస్తారు. లక్షలాది నిరుద్యోగులున్న ఈ దేశంలో దరఖాస్తు దారులకి కొరవ ఏమిటి?

దరఖాస్తులు చూసే డిపార్టుమెంటులో నలుగురు గుమాస్తాలూ, ఒక హెడ్డూ వున్నారు. ఆ హెడ్డూ మా దాశరథి. గుమాస్తాల్ని సెలక్ట్ చెయ్యడం దాశరథి పని. దరఖాస్తు, దరఖాస్తుకి గుచ్చి కంపెనీవారి ఫారం మొకటీ ఉంటాయి. ఆ ఫారమ్మీద దాశరథి తన రిమార్కులు రాయాలి. రూపం—తెలివి—ప్రపంచ జ్ఞానం — మిగతా విశేషాలు; ఈ నాలుగూ పూరించి, తను ఏ కారణం వల్ల ఫలానా దరఖాస్తుదారుని ఏరినదీ వివరిస్తూ చిన్న నోట్ రాసి, త్రిభువన దాస్‌గారి సెక్రటరీకి పంపాలి దాశరథి. అదంతా క్రమపద్ధతిలో జరగవలసిన తంతు. దాశరథి చేసిన సెలెక్షన్ పైవా ళ్ళెప్పుడూ కాదనరు.

*    *    *

"నీది భలే ఉద్యోగం!" అన్నాను.

"ఏం— అలా అంటావ్?" అని అడిగాడు దాశరథి

"నీ పని ఉద్యోగా లివ్వడమేగా!"

"అది మాత్రం మాటలా? ఒక్క రోజు వచ్చి కూచో నా ఆఫీసులో—నీకే తెలుస్తుంది!" అని బెదిరించాడు.

ఉద్యోగం తీసెయ్యడమంటే కష్టం—ఒకళ్ల కడుపు కొట్టడమవుతుంది కనక! ఉద్యోగం యివ్వడమంటే ఏదో పెళ్ళి భోజనం పెట్టడం లాంటిది. దాశరథి ఉద్యోగమే నాకు వుంటే ఎంత సంతోషిద్దును!

"నువ్వు చాలా అదృష్టవంతుడివి, దాశరథీ"

"రేపు మా ఆఫీసుకి రా."

*    *    *

మర్నాడు దాశరథి ఆఫీసుకి వెళ్లాను. అతని టేబుల్‌మీద 109 అప్లికేషనులు కంపెనీవారి ఫారాలతో సహా ఒక గుట్టగా పడివున్నాయి.

ఆఫీసులో 7వ సెక్షనులో 5వ గుమాస్తాని సెలెక్టు చెయ్యాలి మా దాశరథి. దరఖాస్తుదారు లందరూ యిరవై యిరవై మూడేళ్ళ మధ్య నున్నవారు.

"ఇవన్నీ నెంబరువారీగా వున్నాయి. దరఖాస్తుదారిది ఎన్నో నంబరో బయట నోటీసు బోర్డులో వుంటుంది," అన్నాడు దాశరథి నాకు తన ఉద్యోగ ధర్మాన్ని పరిచయం చేస్తూ.

కాలింగ్ బెల్ కాక, ఎలెక్ట్రిక్ బెల్ నొక్కగానే బయటనుంచి మొదటి దరఖాస్తుదారు లోపలికి ప్రవేశించాడు.

'టై' లేదుగాని కాటన్ సూటు వేసుకున్నాడు.

"పేరు...మాధవరావు కదూ ?"

"అవునండి."

"బ్రిటన్‌కి ప్రధాన మంత్రి ఎవరు ?"

"చర్చిల్."

"ఆల్ రైట్, ఇటుపక్క హాలులోకి వెళ్ళి కూచోండి, మిగతావారిని కూడా పరీక్షించిన మీదట మీకు ఉద్యోగం వచ్చేదీ రానిదీ చెబుతాను."

మాధవరావు పక్క హాలులోకి వెళ్ళి కూచున్నాడు. దాశరథి అతని తాలూకు ఫారమ్‌మీద యిలా రాశాడు : "ఉన్నదున్నట్టు మొహంమీద చెబుతాడు"

రెండవ దరఖాస్తుదారు ప్రవేశించాడు. గీరల పాంటూ, బుష్ కోటూ, కళ్ళజోడు కూడాను.

"పేరు ?" అని అడిగాడు దాశరథి.

"గోకుల్."

"బ్రిటన్‌కి ప్రధానమంత్రి ఎవరు ?"

"మాల్టోవ్."

"ఆల్ రైట్. ఇటుపక్క హాలులోకి వెళ్ళి కూచోండి. మిగతావారిని కూడా పరీక్షించిన మీదట, మీకు ఉద్యోగం వొచ్చేదీ రానిదీ చెబుతాను."

గోకుల్ పక్క హాలులోకి వెళ్ళి కూచున్నాడు. దాశరథి గోకుల్‌కి సంబంధించిన ఫారమ్‌మీద యిలా రాశాడు : "ఊహ పోహలు గల మనిషి."

"బ్రిటిష్ ప్రధాని మాల్టోవ్ అనే వాడికి వూహ పోహ లేమిటి - నీ తలకాయ నా తలకాయ" అన్నాను దాశరథితో.

"దీన్నే 'యింటెలిజెన్స్ టెస్ట్' అంటాము. ఆ కుర్రవాడికి తెలిసే, మనల్ని తమాషా చేసేందుకు చెప్పాడేమో !"

"ఏడ్చినట్టే వుంది - కానియ్"

మూడవ దరఖాస్తుదారు వచ్చాడు. బిళ్ళగోచీ, పంచెకట్టు, లాల్చీ.

"పేరు ?"

"వినోదబాబు."

"బ్రిటన్‌కి ప్రధానమంత్రి ఎవరు ?"

"బ్రిటన్‌కి ప్రధాని ఎవరో తరవాత చూచుకుందాంగాని, ఆ ఉద్యోగం నాకిప్పించారా, నేను ఇండియాకి ప్రధానినవుతాను."

ఆభరణంలా ధరించే చిరునవ్వు చెదరకుండా దాశరథి, "ఆల్ రైట్, ఇటు పక్క హాలులోకి వెళ్ళి కూచోండి. మిగతా వారినికూడా పరీక్షించిన మీదట, మీకు ఉద్యోగం వొచ్చేదీ రానిదీ చెబుతాను."

మూడవ దరఖాస్తుదారు పక్క హాలులోకి వెళ్ళాడు. నాకు వొళ్ళు మండిపోతోంది. ఈ దరఖాస్తుదారు లందరూ ఒక పిచ్చి సజ్జులా వున్నారు. వినోదబాబు ఫారమ్ మీద యిలా రాశాడు

మావాడు. "అనవసరమైనవాటి జోలికి పోడు."

నేనొక సిగరెట్టు ముట్టించి దాశరథికి ఆఫర్ చేశాను. "నువ్వు కాల్చుకో, నేను కాల్చకూడ దిక్కడ. నేను సిగరెట్టు ముట్టిస్తే, మా డిపార్ట్‌మెంట్ బాయ్స్ బీడీలు ముట్టిస్తారు," అన్నాడు దాశరధి

ఇంతలో నాలుగవ దరఖాస్తుదారు వచ్చాడు. ఖద్దరు చొక్కా ఖద్దరు పంచె-టోపీ మాత్రం లేదు

"పేరు ?"

"చిదంబరం."

'బ్రిటన్‌కి ప్రధానమంత్రి ఎవరు ?"

చిదంబరం - "యింత చిన్న విషయం నాకు తెలియదనుకున్నారా !" అన్నట్టు మొహంపెట్టి - "ఆ... యివ్వాళ పేపరు చూడటం మర్చిపోయాను," అన్నాడు.

"ఆల్‌రైట్ ఇటు పక్క హాలులోకి..."

నాలుగవ దరఖాస్తుదారు పక్క హాలులోకి వెళ్ళాడు. నా కింక కోప తాపాలు పోయాయి. విరోధులక్కూడా దాశరధి ఉద్యోగం లాంటిది వొద్దనుకున్నాను. చిదంబరం ఫారమ్ మీద యిలా రాశాడు: 'ఎంత కావాలో అంతే తెలుసుకుంటాడు'

అయిదవ దరఖాస్తుదారు బ్రిటన్‌కి ప్రెసిడెంటే గాని ప్రధాని లేదన్నాడు. ఆరవ అతను — బ్రిటిష్ ప్రధాని ఛాంబర్లేనో, ట్రూమనో అయుండాలి, ఎవరయితే మనకేం - అన్నాడు. ఏడవ అతను తడుముకోకుండా 'రూచ్ వెల్ట్' అన్నాడు. 12 వ అతను 'జార్జి' అన్నాడు 34 వ అతను 'ముసోలినీ' 'స్టాలిన్' పేరు చెప్పిచూదా మనుకున్నాడు'— 69 వ అతను.

లంచ్ టైములో దాశరథితో అన్నాను: ప్రతి చవట వెధవనీ ఇలా చిరునవ్వుతో ఆహ్వానించి, వాడు చెప్పే వెర్రి సమాధానం శ్రద్ధగా విని, మళ్ళీ వాణ్ణి చిరునవ్వుతో సాగనంపడానికి చాలా ఓర్పు కావాలి. నీ కెంత యిచ్చినా మీ వాళ్ళకి నష్టం లేదు నాకైతే వాళ్ళ జవాబులు వినలేక పిచ్చెత్తుతోంది సుమా! వెనక ఒక టీచరు మిత్రుడు చెప్పాడులే 'మద్రాస్‌నుంచి ఏమి ఎగుమతి అవుతుంది' - అని తను ప్రశ్నయిస్తే - 'కచ్చికలు' అని రాశాడట, ఒక అఖండుడు ఆ కుర్రవాడికి 'కచ్చికలు' మినహా మరొకటి స్ఫురించకపోవడం వింతగా లేదూ ?"

"నో, నో, ఆ కుర్రవాడు పెద్దయిన తర్వాత పళ్ళ వ్యాధితో బాధపడతాడు."

"ఇలాటి మిడతంబొట్లు శకునాలు చెబుతేనే, ఆ త్రిభువనదాస్ నీ కీ ఉద్యోగం ఇచ్చినట్టున్నాడు"

"ఏమైనా, సాయంత్రందాకా వుండి యజ్ఞం పూర్తి చేయించి వెళ్ళు."

లంచ్ అయాక మళ్ళీ మొదలెట్టాడు దాశరథి

"పేరు ?"

ఫలానా... వెంకయ్యో, తిమ్మప్పో, మాసిలామణో, రామన్ నాయరో... ఏదో ఒకటి.

"బ్రిటన్‌కి ప్రధానమంత్రి ఎవరు ?"

84 వ అతను 1947 ఆగస్టు 15 వ తేదీనుంచీ తనా పక్కకి చూడటం మానేశానన్నాడు. 93 వ అతను 'స్మట్స్' అన్నాడు మహా తెలివిగా. 108 వ అతను మన కెందుకు పోనిద్దురు అన్నాడు కలుపుగోరుతనంగా.

పరీక్ష సర్వ సంపూర్ణం అయేప్పటికి నాలుగైంది. 109 మంది దరఖాస్తు దారులకి మధ్యాన్నం కాఫీ టిఫినూ త్రిభువన్‌దాస్ కంపెనీవారి కాంటీన్ ఫ్రీగా సప్లయి చేసింది అందరూ ఫలితం కోసం ఎదురుచూస్తూ పక్క హాలులో కూచున్నారు. దాశరథి ఎవరిని సెలక్టు చేస్తాడా అని నేనూ ఎదురుచూస్తున్నాను.

చటుక్కున ఫోన్ తీసి, అవు నవును ... సెక్రటరీగారు కావాలి ... దాశరథి మాట్లాడుతూవుంట...ఎంప్లాయి మెంట్ డిపార్ట్‌మెంట్ దాశరథి. E ఆఫీసుతో 7 వ సెక్షన్‌లో 5 వ గుమాస్తాగా గోకుల్‌ని సెలెక్టు చేశాను," అన్నాడు.

"ఓకె, ఓకె," అని వినిపించింది ఫోనులోనుంచి

గోకుల్ లోపలికి పిలవబడ్డాడు. మిగతా 108 మంది ఏడుపు మొహాలతో యిళ్ళకి వెళ్ళిపోయారు. దాశరథి గోకుల్‌కి ఒక పచ్చ కార్డు యిచ్చాడు; మర్నాడు పొద్దున్న 9-55 కి E ఆఫీసు దగ్గర హాజరై 7 వ సెక్షన్ హెడ్డుని కలుసుకో మన్నాడు గోకుల్ ఎంతో సంతోషంగా వెళ్ళిపోయాడు.

"నీ సెలక్షన్ నా కేమీ నచ్చలేదు బ్రదర్. బ్రిటిష్ ప్రధాని పేరేమిటో తెలియని వాడికి ఉద్యోగ మివ్వడ మేమిటి ?"

"పోనిద్దూ, నా డ్యూటీ నేను చేశాను" అన్నాడు దాశరథి.

* * *

మూడు రోజులు పోయాక, సాయంత్రంవేళ క్లబ్బులో కనిపించి చెప్పాడు దాశరథి : "నన్ను మా కంపెనీవాళ్లు అమెరికా పంపిస్తున్నారు, స్టడీ టూర్ "

"ఏడ్చినట్టేవుంది. బ్రిటిష్ ప్రధాని మాల్టోవ్ అన్న బడుద్ధాయికి ఉద్యోగం యిచ్చిన ఘనుడివి కనకనా ?"

"అక్కడే వుంది కీలకం."

"ఏమిటి ?"

"గుమాస్తాలను సెలెక్టు చేయడంలో నా అంతటివాడు ఇండియాలో లేడని త్రిభువనదాస్ అన్నాడట. నా సెలెక్షన్ చాలా బావుంది కనక అమెరికా పంపిస్తున్నారు."

"ఎందుకని బావుంది ?"

"గోకుల్ అనే బావమరదొకడు మా సెక్రటరీకి వున్నాడని నేను ముందు తెలుసుకుని వుండటంవల్ల."




సరస్వతికి మగపురుగులంటే ద్వేషం ఎలా ఏర్పడిందో ఎవరికీ తెలీదు. అసలావిడలా మగజాతిమీద మండి పోతున్నదన్న సంగతే చాలా కాలం వరకూ చాలామందికి తెలీదు. వాళ్ళ సొంతూరు టెంకాయపాలెంలో ఫోర్త్ ఫారం రెండోసారి చదువుతున్నప్పుడు హైస్కూల్లో ఓసారి "స్త్రీ గొప్పదా, పురుషుడు గొప్పాడా?" అన్న అంశం మీద చర్చ జరిగింది. అందులో సరస్వతి కాగితం చూడకుండా, ఏకధాటిగా, నలభై నిమషాల స్పీచ్‌లోనూ ముప్పైతొమ్మిది నిమిషాలు మగజాతిని దుమ్మెత్తిపోసింది. అప్పుడే ఈ విషయం అందరికీ తెలుస్త. ఆవిడ వాగ్ధాటికి ఆహుతయిన కుర్రాళ్ళల్లో కొంతమంది వెంటనే అర్జంటుగా ఓ కమిటీవేసి ఆవిడదలా మగజాతిమీద మండిపోడానికి కారణాలు వెతికించసాగారు. ఆ కమిటీ ఎనిమిది గంటలపాటు దర్యాప్తు జరిపి దీనికంతకూ కారణం కిష్టిగాడనే ఫిఫ్త్ ఫారం కుర్రాడని తేల్చారు. సదరు కిష్టిగాడు ఓ పెద్దముహూర్తాన సరస్వతిని పంటకాలువ గట్టుమీద చూచి ప్రేమించినంత పన్జేశాడు. వెంటనే సరస్వతి పేరిట ఓ ప్రేమలేఖరాసి స్వయంగా చేతికందించాడు.

"నిన్ను లవ్‌చేశానూ, నీకూ ఇష్టం అయితే మారేజ్ చేసుకుంటానని ఉందందులో. సరస్వతి తనకిష్టవయిందీ లేనిదీ చెప్పలేదు. కనీసం జవాబుగూడా రాసివ్వలేదు. ఆ ఉత్తరం పట్టుకెళ్ళి

హెడ్మాస్టరు చేతిలో పెట్టింది కాళికావతారం ఫోజులో. హెడ్మాస్టారా ఉత్తరం చదివి, ఆ పిల్ల తనను లవ్ చేసినందుకు సంబరపడి నిన్ను పెళ్లాడ్డం నా కిష్టమే గాని మా ఆవిడ ఊరుకోదే ... ఎలాగబ్బా..." అంటూ ఆలోచనలో పడిపోయాడు.

సరస్వతి మరింత అగ్గయిపోయి "సర్! ఆ ఉత్తరం నేను మీకు రాసింది కాదు," అంది.

"మ రెవ్రరాశారూ?" అంటూ ఆశ్చర్యంగా అడిగాడాయన.

"కిష్టిగాడు. ఫిఫ్త్‌ఫారం చదువుతున్నాడు..." అంది సరస్వతి.

"వాడు నన్ను లవ్ చేయడమేమిటబ్బా...మగాళ్ళు మగాళ్లని ఎక్కడన్నా లవ్ చేసుకుంటారా" అని మళ్ళీ ఆలోచనలో పడేటంతలో సరస్వతి మండిపడిపోతూ, "అతగాడు ఆ ఉత్తరం రాసింది మీక్కాదు. నాకు ... వాడికి చచ్చేంత పనిష్మెంట్ ఇవ్వండి..."అంది కసిగా.

"ఏమిటీ? నా స్కూల్లోనే ఇంత ధైర్యం చేశాడా? ఇదేమన్నా స్కూలను కొన్నాడా, 'మ్యారేజ్ బ్యూరో' అనుకున్నాడా—అసలిలాంటి బుద్ధులేమిటి వాడికి విద్యార్థినులను చెల్లెళ్ళలాగా అక్కలాగా చూడాలికాని ... ఇప్పుడే చెప్తాను వాడిపని..." అంటూ వెంటనే కిష్టిగాడిని తన రూమ్‌లోకి పిలిపించాడు.

అక్కడ సరస్వతిని చూడగానే కథంతా తెలుగు సినిమాలాగా మొదట్లోనే తెలిసిపోయింది. అంచేత హెడ్మాష్టర్ తననేమీ అడక్కుండానే అన్నీ చెప్పేశాడు.

"నేను ఈ అమ్మాయికి ఉత్తరం రాసినమాట నిజమే! ఆమె కిష్టమయితే పెద్దాళ్ళద్వారానే మాట్లాడించి చేసుకొందా మనుకొన్నాను. ఇంతకంటె వేరే అభిప్రాయం నా కేమీ లేదు..."

"నోర్ముయ్. నోర్ముయ్..."

అన్నాడు హెడ్మాష్టరు ఇంకేమనాలో తెలీక

"నా స్కూల్లో ఆడపిల్లలకు ఉత్తరాలు రాయడానికి ఎంత ధైర్యం?" అన్నాడు వెంటనే.

"స్కూల్లో రాయలేదండీ!..."

"మరి?"

"ఇంట్లో రాశాను కాలవగట్టుమీద అందించాను...స్కూల్ కేమీ సంబంధం లేదు..."

"నోర్ముయ్ ... నోర్ముయ్ ..." అన్నాడాయన మళ్ళీ.

నోర్మూసుకుని ఊరుకుండిపోయాడు కిష్టిగాడు.

"నిన్ను డిబార్ చేస్తాను ..." అన్నాడు హెడ్మాష్టరు.

"నిన్ను బయటిగెంటిస్తాను ..." అన్నాడు మళ్ళీ కాసేపాగి.

"నీ చర్మం వలిపించేస్తాను ... నీ కాండక్ట్ వెరీ డర్టీ అని రాసి పారేస్తాను..."

అన్నీ విని "నీ ఇష్టమొచ్చినట్లుచేసుకో ఫో..." అనేసి బయటికివెళ్ళిపోయాడు. హెడ్మాష్టరుకి వళ్ళుమండిపోయి వాడిని డిబార్ చేసిపారేశాడు. తరువాత ఇంకా వళ్ళుమండితే టి సి కూడా ఇచ్చి బయటికి నెట్టిపారేస్తానన్నాడు.

దీనికంతకూ కారణమయిన సర స్వతిమీద కోపం వచ్చేసింది కిష్టిగాడికి. వెంటనే ఓ మంచిరోజుచూసి, ఆ పిల్ల వంటరిగా కాలవగట్టు వెంబడి ఇంటి కెళ్తోంటే, వాటేసుకొని గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు. సరస్వతి కసలు ఇలాంటి చేష్టలంటే వళ్లుమంట. కాని ఆ క్షణాన అందులో ఏదో హాయి కని పించింది.

"ఛీ! వదులు..." అంది సిగ్గుతో.

"నీ ముఖానికి సిగ్గుకూడానా! ఛీ!- అసలు నిన్ను ముట్టుకోడంకూడా అస హ్యమే. ." అని రెండు చెంపలూ చెళ్ళుమని మోగించాడు. సరస్వతి కళ్ల వెంబడి నీళ్ళు జలజలా రాలిపోయినయి.

"అమ్మా!" అంటూ రెండు చెంపలూ బాధగా తడుముకొంది.

"మర్యాదగా ప్రవర్తిస్తే రిపోర్టిస్తావా? ఇప్పుడు నీ దిక్కున్నచోట చెప్పుకో- నిన్ను ముద్దెట్టుకొన్నానని" అనేసి అక్కడి నుంచి వెళ్లిపోయాడు.

ఆ క్షణాన్నుంచి సరస్వతికి మగ పురుగులమీద ద్వేషం మొదలయింది.

ఓసారి పక్కింటి అమ్మాయిమొగుడు చనిపోతే ఆ అమ్మాయి గాజులు తీసే యటం, తెల్లచీరలు కట్టుకోడం చూసింది. మరోసారి ఆపేటలో వుంటున్న సుబ్బా రావు పెళ్ళాం చచ్చిపోతే సంవత్సరం తిరక్కముందే ఝామ్మని మళ్లీపెళ్లిచేసు కోవడం చూసింది. మరింకోసారి ఓ అను మానపు మొగుడు పెళ్ళాన్ని మరో మగా డితో మాట్లాడినందుకు ఆమెని ఉతికే యడం కళ్ళబడింది.

తరువాత కొన్ని రోజులకి ఆడా ళ్ళందరూ ఏదోరకంగా మగాడిచేతుల్లో నానాహింసలూ పడుతున్నట్లు అనిపించ సాగింది.

ఇవీ-మరికొన్ని ఇలాంటి సుందర దృశ్యాలూ ఆమె ద్వేషాన్ని ఒకటికి పాతికింతలు పెంచేసినాయి.

"ఈ మగరాస్కెల్స్‌కి ఏమిటంత మిడిసిపాటు? వీళ్ళకి ఆడదెందుకు లొంగి వుండాలి? వంటింటి కుందేలుగా మగా డెందుకు వుండకూడదు? చీరలు ఆడదే ఎందుకు కట్టుకోవాలి? మగాడెందుకు కట్టుకోడు? మగాడినిచూస్తే ఆడదెందుకు సిగ్గుపడాలి ? ఎందుకు భయపడాలి ? ఆడది స్వతంత్రంగా, మగాడిమీద ఆధారపడకుండా ఎందుకు బతకలేదు? మగాడు చేసేపనులన్నీ స్త్రీకూడా చేయ గలదు కదా?" అని మండిపడింది.

"వీళ్ళ అంతేమిటో చూస్తాను. నా తోనే ఈ ఆంధ్రదేశంలో రివల్యూషన్ మొదలు" అని డయిరీలో రాసుకొంది.

ఆ మర్నాడేకొంతమంది స్నేహితురాం డ్రను పోగుచేసి 'వీరనారీ నికేతన్' ప్రారంభించింది. ఇందులో చేరదల్చు కొన్నవారు కొన్ని నిబంధనలకు కట్టు బడి ఉంటామని హామీ రాసివ్వాలి.

ఆ నిబంధనలు ఇలా ఉంటాయి:

నన్ను చేసుకొనేవాడికి కట్నం ఇవ్వను. పెళ్ళంటూ చేసుకొంటే నేనేం చెప్పినా నోర్మూసుకుని ఆపనిచేసే మగా డినే చేసుకొంటాను. నేను ఉద్యోగం చేస్తాను. నా భర్త వంటచేస్తాడు. నేను ఇంటిబాధ్యత, నాభర్త వంటింటిబాధ్యత తీసుకొంటాము. పిల్లల్ని కనడంవరకే నావంతు. పెంచి పెద్దచేయడం మొగుడి పని వగైరా వగైరాలు...

వీటిని చదివిన ఆమె స్నేహితురాం డ్రంతా "అబ్బో! అబ్బో! ఎంత బాగు న్నయ్యో..." అని తెగ ముచ్చటపడి వెంటనే 'వీరనారీనికేతన్ జిందాబాద్' అని పాతికసార్లు అరచి అందులో సభ్యు లుగా చేరిపోయారు. ఈ సంగతంతా విన్న సరస్వతిఫాదరు అర్జంటుగా అమ్మాయికి సంబంధాలు చూడటం మొదలుపెట్టాడు.

ఈ సంగద్దెల్సిన సరస్వతి తండ్రి దగ్గరకెళ్లి తను తయార్జేసిన నియమా వళి లిస్టుతాలూకు కాపీ ఒకటి ఆయన కిచ్చి "వీటిని అంగీకరించేవా డెవడయినా వుంటే ఇదిగో ఈ స్టాంపున్నచోట సంతకం పెట్టించి తీసుకురా–అప్పుడు ఇంటర్వ్యూ తీసుకొంటాను..." అంది.

ఆ నియమావళిని కళ్ళజోడు పెట్టు కుని ఆరుగంటలపాటు చదివి వెంటనే కారుతీసుకొచ్చి అమ్మాయినెక్కించుకొని మెంటల్ హాస్పటల్‌కి తీసుకెళ్లి డాక్టరుకి చూపించాడు.

"ఏమిటి జబ్బు? ఏం పిచ్చిపనులు చేస్తోంది?" అనడిగాడు డాక్టరు.

"ఇదిగో...ఇది అమ్మాయే రాసింది అన్నాడు తండ్రి నియమావళి లిస్టు ఆయన చేతికందిస్తూ.

"అది చదివిన డాక్టరు కొంచెంగా నవ్వి, "ఇది చాలా ప్రారంభదశలోనే వుంది. ఇంకా బాగా ముదిరాక తీసుకు రండి — ఎంచేతంటే ఒకోసారి ఇలాంటి కేసులు సడన్‌గా నయమయిపోవచ్చు–" అని చెప్పారు.

ఇక లాభంలేదని తండ్రి సరస్వతి సంగతి పట్టించుకోడం మానేశాడు. దాంతో 'వీరనారీనికేతన్' సంస్థ ఎదిగి పోయింది పెళ్ళికాని అమ్మాయిలు చాలా మంది అందులో చేరిపోయారు. మగాళ్ళ తోడులేకుండా అన్ని రంగాల్లోనూ స్త్రీలే ప్రతిభావంతంగా పనిజేయగలరన్న విష యాన్ని రుజూచేయాలని అందరూ ఏక వుమ్మడిగా తీర్మానించేసుకున్నారు.అంతే కాకుండా ప్రజల్లోకివెళ్లి అజ్ఞానాంధకా రంలో పడి తమ వునికిని, ప్రతిభను మరచేపోయి వంటిళ్ళల్లో మగ్గి, మసి

కొట్టుకుపోతున్న ఆడజాతిని వుద్ధరించా లని తలోకంకణం కొని కట్టుకొన్నారు (రాగివి).

"వీరనారి నికేతన్" ప్రథమ సాంస్కృతికోత్సవం అద్భుతంగా జరిగింది. చాలామంది ఆడవాళ్ళు గొంతుపగిలేట్లు మైకులో 'మగాడి నిరంకుశత్వం' మీద లెక్చర్లిచ్చారు. 'మగాడు నశించాలి'అన్న కేకలతో ఆనాటి సభ ముగిసింది. రాత్రికి సరస్వతి స్వయంగా రచించిన మగపాత్రలులేని "మగరాక్షసులు - స్త్రీ భక్షకులు" అద్భుతంగా ప్రదర్శించారు.

ఆ డ్రామాకి లైటింగ్, కర్టెన్ఎరేంజ్ మెంట్, మైక్‌సిస్టమ్, ప్రాంప్టింగ్,మేకప్ ఆర్కెస్ట్రా, ప్లేబాక్, స్టంట్స్, డాన్స్ డైరెక్షన్, అసలు డైరెక్షన్, అన్నీ ఆడాళ్ళే చేపట్టటం ఓ ప్రత్యేకత. ప్రవేశం కేవలం ఆడవారికి మాత్రమే అని వుండటంచేత కేవలం ఆడవారేఆడ్రామా చూశారు. చూసింతర్వాత "నిజంగా చాలా గొప్పాళ్ళం" అని సంబరపడిపోయారు. మర్నాటినుంచీ మొగుడిపని పట్టాలని అనధికారంగా నిర్ణయం తీసుకొన్నారు.

ఆ తరువాత 'ఆడది అబలకాదు. సబలేనని తెలుసుకోండి' డ్రైవ్ మొదలయింది. అందరూ పాదయాత్ర మొదలుపెట్టి ఊరిబయటున్న కూలీవాళ్ల గూడానికి వెళ్ళారు.

అక్కడ ఎవ్వరూ కనిపించలేదు. ఇద్దరు ముసలమ్మలు, బోలెడుమంది చిన్నపిల్లలు గుడిసెల మధ్య చెట్లకింద కూర్చుని కనిపించారు.

"ఆడాళ్ళంతా ఏరీ ?" అనడిగింది సరస్వతి వాళ్ళను.

"ఎందుకమ్మా?" అనడిగారు ముసలమ్మలు, అనుమానంగా చూస్తూ. ఎంచేతంచే అప్పుడప్పుడూ కార్లమీద ఇలాగే బోలెడుమంది ఆడాళ్ళువచ్చి "మీరిలా మురికిగా వుండకూడదు. వుంటే జబ్బులొస్తయి. శుభ్రంగా ఉండండి. తెల్లని బట్టలు కట్టుకోండి, విటమిన్లున్న తిండి తినండి. పాలు ఎక్కువగా తాగండి." అని చెప్పి వెళ్ళిపోతూంటారు. వీళ్ళుకూడా ఆ బాపతేనేమో అని అనుకొన్నారిప్పుడు కూడా-

"మేము ఆడాళ్ళ నుద్ధరించటానికి వచ్చాం. యుగయుగాలనుంచీ మగాళ్ళు మనని అణగదొక్కేశారు. వంట చేయడానికీ, పిల్లలు కనడానికీ తప్ప మరి దేనికీ పనికిరాదన్న అబద్ధాన్ని సృష్టించి మనని కలకాలం వాళ్ళమీద ఆధారపడేట్లు చేశారు. కాని మనం ఇప్పుడు మేల్కొన్నాం. ఇకనుంచీ మనం కూడా వాళ్ళతో సమానంగా పని చేస్తాం. ఇంటి పని మగాళ్ళతో చేయిస్తాం," అంది సరస్వతి ఉద్రేకంగా. ముసలమ్మలిద్దరూ ఆశ్చర్యంగా చూశారు వాళ్ళవంక.

"మీరేం చెప్తున్నారో అర్థం కావడం లేదమ్మా! మా కూలోళ్ళల్లో మాకా ఆడా

మగా భేదం లేదు. అందరం కలిసి కష్ట పడతాము. కలిసే కూలీ చేస్తాము. కలిసే అన్ని పనులూ చేసుకొంటాము. ఇంక ఇప్పుడు మేల్కొనడం ఏమిటి ?" అనడిగారు.

సరస్వతి బృందానికి ఏం చెప్పాలో అర్థం కాలేదు. వాళ్ళందరూ ఆశ్చర్యంలో మునిగిపోయారు.

కూలీజనస్త్రీలు ఇంత ఎడ్వాన్సయిపోయారని వాళ్ళనుకోలేదు.

"జై కూలీజన స్త్రీలూ-జిందాబాద్" అని అరిచారు పావుగంట సేపు.

ఆ అరుపులకి పసిపిల్లలంతా భయపడి కెవ్వున ఏడుపు లంకించుకొన్నారు.

"ఓరి-మీరంతా ఎలక్షనోళ్ళా-వాళ్ళయితేనే ఇలా అరుస్తారు మీకే ఓట్లేస్తాం గాని ఇక పొండి - పిల్లలు దడుసుకొంటున్నారు..." అన్నారు కోపంగా.

అందరూ అక్కడినుంచి కదిలారు.

దోవలో రోడ్డుపక్కనే ఉన్న చెట్టుకింద గుడిశెముందు ఓ రిక్షా ఆగి ఉంది. అందులో ఓ గిరజాల జుట్టోడు పడుకొని బీడీ కాల్చుకొంటున్నాడు. పక్కనే రాళ్ళపొయ్యిమీద అన్నం వండుతోంది వాడి పెళ్ళాం.

"ఎంతసేపే సీయమ్మ - తొరగా వొండు..." అన్నాడు వాడు పెళ్ళాన్ని బూతులు తిడుతూ.

ఇది చూడగానే సరస్వతి బృందానికి కడుపు రగిలిపోయింది.

అందరూ వాళ్ళ చుట్టూ మూగిపోయారు.

"ఏయ్ అమ్మీ ! ఎందుకలా చూస్తా ఊరుకొంటావ్,.నీ మొగుడలా తిడుతూ ఉంటే — ఇంక ఈ మొగాళ్ళ దౌర్జన్యం ఎదుర్కోవాలి. మే మందరం నీకు సహాయం చేస్తాము. ఇకనుంచీ వంట నీ మొగుడిని కూడా వండమను-ఆడాళ్ళూ మగాళ్ళూ అంతా సమానమే-మన మేం తక్కువ తిందిలేదు. తెల్సిందా ! మగాడేం దేముడు కాదు, పూజించటానికి —ఏమయ్యా-నీకు సిగ్గులేదూ, అడదాన్నలా తిడతానికి ?"

"ఇక మీ ఆటలుసాగవ్-ఆడాళ్ళు మీ మగాళ్ళ మీద అధారపడరిక తెల్సిందా ?"

"పిల్లల్ని పెంచటం, వంట చేయడం-మగాళ్ళు చేయాలి..."

రిక్షావాడు బీడీ చేతిలోకి తీసుకొని లేచినుంచున్నాడు.

"ఎట్టెట్టా ! అయితే మగోడు కూడా ఇంటిపని సేయాలన్నమాట..."

"అవును—ఆడది మగాడి బానిస కాదు-ఇద్దరూ సమానమే-" అంతా ముక్త కంఠంతో అరచారు

అహ్హాహ్హాహ్హా...పగలబడి నవ్వాడు వాడు.

"ఏయ్-ఎందుకలా నవ్వుతావు ?"

"సీయమ్మ - మీరు పిచ్చోళ్ళా - మంచోళ్ళా-అని..."



"ఏం?"

"లేపోతే ఏందెహ! సరే మీరు సెప్పి నట్టు నేను వొంట సేత్తాను. పిల్లగాడిని సాకుతాను_మరి రిచ్చా ఎవర్తొక్కు తారు?"

"రిక్షాతొక్కి వచ్చి ఈ పనులన్నీ చేయాలి..." అరిచారు వాళ్ళు.

"సరే—సేత్తాను-ఆడా మగా అంతా సమానమని మీ రే అన్నారుగా-ఇయాల్టి నుంచీ మా ఆడది కూడా రిక్షా తొక్కా లన్నమాటేగా?..."

కొద్దిసేపు సరస్వతి బృందానికి నోట మాట రాలేదు.

"అవును! తొక్కాలి-ఆడది రిక్షా కూడా తొక్కగలదు..." అన్నారు నీరసంగా.

ఈ మాట వినడంతోనే రిక్షావాడి పెళ్ళాం తారాజువ్వలా వాళ్ళమీదకు దూసుకొచ్చింది.

"ఏటీ? ఆడది రిచ్చా తొక్కాలా? సాల్సాల్లే ఎల్లండి. కావాలంటే మీ ర్తొక్కు కోండి రిచ్చా! నా కోపిక లేదు. ఆడు కట్ట పడగలడు. ఆడికి ఒలముంది. అందు కని ఆడే రిచ్చా తొక్కుతాడు. నేనాడికి అన్నం వొండి పెడతాను. ఆడి కాళ్ళు నొప్పులేడితే తెల్లార్లూ పడతాను. మద్దెలో మీకేటి సింత? సిగ్గు నేకుండా సొకాడ దాన్ని రిచ్చా తొక్కమని సెప్తున్నారా?"

"రొండు గజాల్తొక్కితే రొజ్జెల్లు పడు కోవాల మల్లా—"

మరిక కూతలు వినలేకపోయారు.

వాళ్ళు. వెనక్కి తిరిగి వేగంగా నడిచారు.

"ఇదిగో సూడు బుల్లెమ్మా! ఈ సావంతా మీకే! ఈడ మాకా తేడాల్లేవు. మగాడు కండ కరిగిత్తాడు. ఆడది ఆణ్ణి సుక పెడద్ది - అంతే...అహహహ..." అందరి ముఖాలూ అవమానంతో కంది పోయినయి వాడి గొంతు విని. కొద్ది దూరం నిశ్శబ్దంగా నడిచాక సావిత్రి అంది.

"వాడు చెప్పిందీ నిజమేనే! నిజంగా రిక్షా తొక్కటం ఆడదాని వల్లేమవు తుంది? అంచేత మనం ఈ 'రూల్' బీదాళ్ళ పట్ల వర్తింపజేయకూడదు... పైగా వీళ్ళు 'సమానత్వం' ఎప్పుడో సాధించేశారు. కానీ మనం ఇక్కడో ట్రిక్ చేయాలి. ఈ కూలీజనంలోని ఆడదాన్ని మనమే సంస్కరించామని, అందరి తోనూ చెప్పుకొందాం...ఏం?"

"అవును..." అన్నారు అందరూ.

అందరూ కాలనీల్లోకి వచ్చేశారు.

"చూడండి! మనం ఉద్యమం ప్రారంభించింది ముఖ్యంగా మధ్య తరగతి కుటుంబాల్లోని స్త్రీల కోసం—ఈ కుటుంబాల్లోనే స్త్రీ అనాదిగా బానిస బ్రతుకు బ్రతుకుతోంది. ఇక్కడే మనం విజయం సాధించాలి! వీళ్ళను ఈ బంధాల నుండి విముక్తి చేయాలి..." అంది సరస్వతి.

అంతా బిలబిలమంటూ ఓ ఇంట్లోకి నడిచారు. లోపల ఇంటావిడ దర్జాగా మంచం మీద కాలుమీద కాలేసుకొని పడుకుని వారపత్రికలో 'సీరియల్' చదువుతోంది.

అందరూ ఇంట్లోకి రావడం చూచి లేచినుంచుంది.

"వీరనారీనికేతన్ జిందాబాద్" అంటూ అరచారు వాళ్ళు.

ఆవిడ దబ్బున ఇంట్లోకెళ్ళి ఓ పావలా కాసు తీసుకొచ్చి వాళ్ళకివ్వ బోయింది.

"ఏమిటి? పావలా ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగింది సరస్వతి.

"నాదగ్గ రింకేమీలేదు - ఇష్టమయితే తీసుకోండి-లేకపోతేలేదు..." అంది.

"మేం డబ్బుంకోసం రాలేదు..."

"మరి?..."

"వీరనారీనికేతన్" తరపున వచ్చాం! మన ఆడాళ్ళను ఈ బానిస బ్రతుకు నుంచి విముక్తి చేయాలని మా సంకల్పం. యుగయుగాల నుంచీ పురుషుడు తెలివిగా ఆడదాన్ని అణగ దొక్కుతూనే ఉన్నాడు. ఇంక మనం ఇది సహించకూడదు. ఆడది కూడా మగాడితో సమానమని ఋజూ చేయాలి-మగాడితో ఆడది చేసే పనులన్నీ చేయించాలి. ఆడది మగాడిమీద ఆధార పడకూడదు. వాడిని లెఖ్ఖచెయ్యకూడదు. తనూ ఉద్యోగం చేయగలదు-కుటుం బాన్ని పోషించనూ గలదు-తన కాళ్ళ

మీద తను చాలా తేలికగా నిలబడ గలదు. ఇదే మనం ఆచరించి చూపిం చాలి. మగాడి నిరంకుశత్వాన్ని అణచి వేయాలి..."

"ఇప్పుడేం చేయమంటారు ?" సీరి యల్ మధ్యలో ఆగిపోయిందే అన్న బాధతో అంది ఆ ఇంటావిడ.

"మరేమీలేదు. ఇవాళ్ల నుంచీ ఇంటి పనులన్నీ మీ ఆయనతో చేయించండి. పిల్లల్ని పోషించడం మిగతా విషయాలని కూడా ఆయన్నే చెయ్యమనండి. మీరు చదువుకున్న వారు కాబట్టి మీరు ఉద్యోగం సంపాదించండి."

"ఆయన్ని మాన్పించి ఇంటిపని ఆయన కప్పజెప్పండి..."

"కొంచెం మీ మోత ఆపుతారా ?" అడిగిందావిడ అడ్డుపడి.

"ఏమిటి ?"

"అదిగో-ఆ ఫైళ్ళ మధ్య కదుల్తున్న ఆకారం చూసారా ?"

అందరూ అటు చూశారు. అంత వరకూ అక్కడ అన్నీ ఫైల్సే ఉన్న యనుకొన్నారుగాని వాటిమధ్య ఒకాయన కూర్చుని రాసుకొంటున్నాడు.

"ఆ ఫైళ్ళు రాస్తోంది మా ఆయన. పగలంతా ఆఫీసులో పని చేసిచేసి మళ్ళీ ఇంటికొచ్చి కూడా రాస్తూంటారు. అయినా తరిగిచావదు ఆ పని. ఇంట్లో నేన్జేసే పనేమిటనుకొన్నారు. పొద్దున్నొక గంట-సాయింత్రం మొకగంట వంట చేస్తాను. అంతే. మిగతా టైమంతా నా పనికే సరిపోతుంది. స్నానం చేయటం-మేకప్ అవటం-మ ధ్యా న్న మం తా చక్కగా పడుక్కొని సీరియల్స్ చదువు కోటం-సాయింత్రం ఏ పక్కింటి కామా క్షమ్మగారితోనో మార్కెట్ కెళ్ళి కాయ గూరలు తెచ్చుకోవడం-లేదా ఒక్కర్తెనూ సినిమాకి వెళ్ళిపోడం-ఇంత సుఖమైన బ్రతుకొదిలి-నన్నా ఆ ముదనష్టపు ఉద్యోగం చెయ్యమంటారా? ఆడాళ్ళనుద్ధ రించటం అంటే ఇలా ఊబిలోకి దించట మేనా ? నా వల్లకాదు గానీ వెళ్ళండి-కావాలంటే మీరు చేసుకోండి ఆ వెధ వుద్యోగాలు-మూడొందల్రూపాయలకాశ పడి ఆఫీసులో అడ్డమైన వాడినీ 'సార్' అనటం నావల్ల కాదు. ఆ పాట్లేవో మా ఆయనే పడతాడు. నేను దర్జాగా ఇంట్లో ఉంటాను. నాకా నరకం వద్దు...

అందరూ బయటికొచ్చారు.

"వీళ్ళనుద్ధరించటం కొంచెం కష్టమే! బోలెడు ఓపికుండాలి మనకు..." అంది సరస్వతి చెమటలు తుడుచు కొంటూ.

అంతా మరో ఇంట్లోకి నడిచారు.

అక్కడ ఇంటాయనా, ఇంటావిడా ఇద్దరూ గార్డెన్‌లో కుర్చీల్లో కూర్చుని ఉన్నారు. ఆయన దర్జాగా పేపరు చదువుకొంటున్నాడు.

"రండి! ఇద్దరం ఇప్పుడే ఆఫీస్

నుంచివచ్చాము " అందావిడ ఆహ్వానిస్తూ. ఇంట్లోంచి పొగవస్తోంది.

"గాస్ అయిపోయింది. కిర్సనాయిలు దొరకటం లేదు. కట్టెల పొయ్యితో చచ్చి పోతున్నాననుకోండి. ఒకటే పొగ..." తిరిగి అందావిడ.

''అదే - మే మొచ్చిందందుకే- ఉద్యోగం ఇద్దరూ చేస్తారు. కానీ ఆఫీసు నుంచి ఇంటి కొచ్చేప్పటికి పెళ్ళామే ఎందుకు వంటచేయాలి ? మగాడెందుకు చేయకూడదు ? ఆడదంటే ఎందుకంత హీనభావం ? 'వంట' అనేది ఆడదే చేయాలని ఎక్కడేనా రాసుందా ? ఇలాంటి దురలవాట్లు పోగొట్టి ఆడవారిని ఆదుకొంటానికే మేము 'వీరనారీనికేతన్' స్థాపించాము..." చెప్పుకుపోతోంది సరస్వతి.

"కొంచెం నే నొచ్చేప్పేది వింటారా ?" అడ్డుపడింది ఇంటావిడ.

"ఏమిటది ?"

''ఆఫీసునుంచి వచ్చి ఇంట్లో ఆడదే వంటచేస్తుందని మీ కెవరు చెప్పారు ?"

సరస్వతి ఉక్కిరిబిక్కిరయింది.

"అంటే...ఇప్పుడు మీరు వంట చేయటం లేదా ?"

"ఏడ్చినట్లుంది. అసలు నాకు వచ్చే డిస్తే కదా-చేయటానికి. అయినా మా ఆఫీసులోని ఆడాళ్ళల్లో ఎవ్వరూ వంటలు చెయ్యరు. అందరికీ వంట మను షులున్నారు. అంచేత ఎవ్వరికీ వంట బాధలేదు..."

మరింకేం చెప్పాలో తెలీలేదు సరస్వతికి. .

అందరూ వెనక్కి తిరిగి మరో ఇంటికి చేరుకొన్నారు.

ఆ ఇంటి తలుపులు మూసేసి ఉన్నాయి. లోపల్నుంచీ స్త్రీపురుషుల గొంతులు గట్టిగా వినబడుతున్నాయి. ఉండుండి గట్టిగా కొడుతున్న చప్పుడూ- ఏడుపూ అస్పష్టంగా వినిపించసాగినయి.

వీరనారీనికేతన్ సభ్యులు చకచక పనిలోకి దిగిపోయారు. చుట్టు పక్కల ఆడాళ్ళనందరినీ హడావుడిగా పిల్చు కొచ్చేశారు. అందర్నీ ఉద్దేశించి సరస్వతి అప్పుడప్పుడే అర్జంటుగా ప్రసంగిం చేసింది.

"సోదరీమణులారా ! మన ఆడ జాతి ఎంత దౌర్భాగ్యపు స్థితిలో ఉందో తెలుసుకోవాలంటే ఈ ఇల్లే ప్రత్యక్ష సాక్ష్యం. మగాడి నిరంకుశత్వానికి కూడా ఇదే ఇల్లు ప్రత్యక్ష సాక్ష్యం. అదిగో ! అతి దారుణంగా హింసింప బడుతోన్న మన తోటి ఆడదాని కేకలు ఏడుపులు ! చూస్తారేం ఇంక ! తలుపు తట్టండి-తీయకపోతే పగలకొట్టండి ? ఆడది మొగాడి కంటే తక్కువ కాదనీ- ఈ మగ పురుగుల రాక్షసత్వం ఇక చెల్లదనీ ఋజువుచేయండి...''

అందరూ తలుపులు కొట్టారు.



దబ్బున తెరచుకొన్నాయి తలుపులు. ఒక లావుపాటావిడ చేతిలో అప్పడాల కఱ్ఱ పట్టుకొని బయటి కొచ్చింది కోపంగా.

"ఎవరు మీరు? ఏం కావాలి?" అంది ముఖం చిట్లిస్తూ.

"వీరనారీనికేతన్ సభ్యులం. మీ ఆయన మిమ్మల్ని కొట్టటం చెవులారా విన్నాం! అతనికి బుద్ధి చెబుదామని వచ్చాము..."

అమె ముఖంలో కోపం మాయ మయ్యింది.

"ఒకసారి ఇటు లోపలి కొచ్చి చూడండి..." అంది పక్కకు తప్పు కొంటూ. అంతా ముందుకి నడిచి లోప లకు తొంగిచూశారు. ఒక బట్టతలతను స్తంభానికి కట్టబడి ఉన్నాడు. అతని వంటిమీద దెబ్బలు తేలిపోయినయి. "అతను-మా ఆయన-పిచ్చి వేషాలేస్తే నేనే అడపాదడపావాయించేస్తానాయన్ని -నన్ను ఆయన కొట్టడమేమిటి మీ తల కాయ్? ఫొండి నా మొగుడికి బుద్ధి చెప్పుకోలేనంతటి బలహీనురాలిని కాదు నేను..."

అనేసి ఛళ్ళున తలుపులు మూసేసు కొంది.

అంతా నిర్ఘాంతపోయారు.

"ఇలా కూడా జరుగుతుందన్న మాట..." అనుకొన్నారు.

"అదిగో-ఆ మూడో ఇంట్లో పెళ్ళి చూపులు జరుగుతున్నాయట-పదండి!"

ఆడపిల్లని బలిపశువులా వాడిముందు కూర్చో బెట్టటం-వాడేమో లక్ష ప్రశ్నలు వేసి-పాతిక గుంజీలు తీయించి-వీలైనన్ని శరీర భాగాలు కళ్ళతో టెస్ట్‌చేసి-చివరకు నచ్చ లేదనడం—ఇలాంటి అన్యాయాలు ఇకముందు జరగటానికి వీల్లేదు-ఆడది రబ్బరుబొమ్మ కాదు. చేసుకొన్న వాడినే చచ్చినట్లు ప్రేమించి కాపరం చేయడానికి-ఇకముందు ఆడదే కుర్రాడిని చూసి ప్రశ్నలడగాలి. నచ్చితే అప్పుడు పెళ్ళాడాలి..."

"అవునవును!'' అంటూ అరచా రందరూ.

బిలబిలమంటూ అంతా మూడో ఇంట్లో జొరబడిపోయారు. అక్కడ హాల్లో పెళ్ళిచూపులు జరుగుతున్నాయి. అయితే 'వీరనారీనికేతన్' సభ్యులు ఊహించినట్లు పెళ్ళికూతురు చాపమీద కూర్చుని తలవంచుకొన్న దృశ్యం కని పించలేదు. ఆవిడ సోఫాలో దర్జాగా కూర్చుంది. ఎదురుగ్గా మరో సోఫాలో పెళ్ళికొడుకు బోలెడు సిగ్గుతో దిక్కులు చూస్తున్నాడు పెళ్ళికూతురు మొఖంలోకి చూడలేక.

"డౌన్‌డౌన్ పెళ్ళికొడుకూ! పెళ్ళి కొడుకుల నిరంకుశత్వం నశించాలి!-పెళ్ళి చూపులు మారాలి! పెళ్ళికూతురు జిందాబాద్!" అంటూ కేకలు వేశారు సభ్యులంతా.

పెళ్ళికొడుకు ఖంగారుపడి లేచి బయటకు వెళ్ళిపోయాడు వడివడిగా. లోపల్నుంచి పెళ్ళికూతురు తల్లికాబోలు 'రయ్' మంటూ వాళ్ళదగ్గరకు దూసు కొచ్చింది.

"ఎవరు మీరంతా? ఏమిటా కారు కూతలు" అంటూ అరచింది కోపంగా.

"మేము 'వీరనారీనికేతన్' సభ్యులం. అనాదిగా పెళ్ళిచూపులు పేరుతో ఆడ జాతికి జరుగుతోన్న అన్యాయాన్ని ఎదిరించటానికి వచ్చాం! మగాడు ఆడ దాని కంటే ఎందుకు ఎక్కువ? పెళ్ళి చూపుల్లో ఆడదెందుకు తల వంచుక్కూ-చోవాలి? ఆడపిల్ల ఇష్టాఇష్టాలెందుకు పాటించబడవు? కోరిన భాగస్వామిని సెలక్ట్ చేసుకొనే ఆప్షన్ ఆడదాని కెందుకు లేదు?..." సరస్వతి వాగ్ధాటికి 'నోర్ముయ్' అంటూ అడ్డుపడింది పెళ్ళి కూతురు.

"ఏమిటి?'' ఆశ్చర్యంగా అడిగింది సరస్వతి.

"నోర్ముయ్య మంటున్నాను. మీరను కొంటూన్న ఆడపిల్లను నేను కాదు.

ఇంతవరకూ పదకొండు మంది కుర్రాళ్ళు నన్ను చూసి చేసుకొంటామన్నారు. నాకు నచ్చలేదని నేనే తిరస్కరించాను, తెల్సిందా ?" అనేసి విసురుగా లోపలి కెళ్ళిపోయింది.

"అది ఏ కళనుందో-ఈసారన్నా-ఆ పెళ్ళికొడుకుతో చాలా సేవు మాట్లాడింది-ఈ సంబంధం కుదిరిపోతుందని అనుకొన్నాను-పాడుమూక మీరొచ్చి నా కూతురు పెళ్ళి కాస్తా చెడగొట్టారు-ఇంకా చూస్తారేం ? బయటకు పొండి !—ఇంకోసారి ఈ చుట్టుపక్కల కనిపించారంటే-మర్యాద దక్కదు-జాగ్రత్త."

ఆవిడ మాటలు వినలేక అంతా బయటి కొచ్చేశారు.

సరస్వతి ముఖం అవమానంతో ఎర్రగా కందిపోయింది.

"బ్లడీహెల్ ! మనచేత సంస్కరింపబడే ఆడదే లేదా ఈ ఊళ్ళో?..." అని మండిపడింది.

"లేకేం ? ఉంది—" అంది ఓ సభ్యురాలు.

"ఎవరు? ఎక్కడ? పదండి సంస్కరిద్దాం !'' అంది సరస్వతి.

"ఇక్కడే. ఈ వీధిచివర అవధాన్లుగారి రెండో అమ్మాయ్ ! ఆ అమ్మాయికి పెళ్ళయింది. పెళ్ళయిన నెల్లాళ్ళలకే భర్త గుండాగి పోయాడు. ఇప్పుడా అమ్మాయి విధవ. తల్లిదండ్రులు మూల కూర్చోబెట్టి మూఢ ఆచారాలతో హింసిస్తున్నారు. మనం ఆ అమ్మాయిని మళ్ళీ వివాహం చేసుకోమని ప్రోత్సహించాలి. ఆమె తల్లిదండ్రులకు నచ్చజెప్పాలి. మగాడయితే పెళ్ళాం చచ్చిన మర్నాడే మరో వివాహం చేసుకోడంలేదూ ?"

"అవును ! అవును ! పదండి !" అన్నారంతా.

అయిదు నిముషాల్లో అవధాన్లుగారిల్లు చేరుకొని, 'వీరనారీనికేతన్ జిందాబాద్' 'వర్థిల్లాలి' అంటూ కేకలువేశారు. ఆ కేకలు విని అవధాన్లుగారు ఖంగారుగా బయటికొచ్చారు.

"ఏమిటి ?" అనడిగారాయన ఎదురుగ్గా నిలబడ్డ సరస్వతి వంకచూస్తూ.

"నేను వీరనారీనికేతన్ ప్రెసిడెంట్ సరస్వతిని. ఆడాళ్ళకు జరిగే అన్యాయాలని ఎదుర్కోడానికి మా సంస్థ వెలిసింది..." అంది సరస్వతి.

"చాలా సంతోషం ! ఇక్కడ ప్రస్తుతం మీతో ఉద్ధరింపబడాల్సిన వారెవరూ లేరే ?" అన్నారాయన.

"లేకపోవడమేమిటి ? మీ ఇంట్లోనే మీ రెండో అమ్మాయ్ ఉంది—"

"మా రెండో అమ్మాయా ?" ఆశ్చర్యంగా అన్నారాయన.

"అవును ! ఆ అమ్మాయికి భర్త చనిపోయాడని తెల్సింది. వెంటనే ఆ అమ్మాయికి మరో వివాహం చేయాలి. ఆ అమ్మాయిని జీవచ్ఛవంలా వెలుగు

చూడకుండా ఇంట్లో హింసించడాన్ని మేము నిరసిస్తున్నాం..."

"నేను చెప్పేది కొంచెం..." ఏదో చెప్పబోయారు అవధాన్లుగారు, కాని సరస్వతి వినిపించుకోలేదు.

"మగాడు భార్య చనిపోతే వెంటనే పెళ్ళెందుకు చేసుకొంటున్నాడు? అదే పెళ్ళి ఆడదెందుకు చేసుకోకూడదు? భర్తపోయినంత మాత్రాన ఆడదాని యవ్వనం-కోరికలూ అన్నీ వృధా కావల్సిందేనా? వీల్లేదు! వీల్లేదు? వీల్లేదు...వీరనారీనికేతన్ జిందాబాద్! అవధాన్లుగారి రెండో అమ్మాయ్ మళ్ళీ పెళ్ళాడాలి..." అంటూ అరవసాగారు వాళ్ళంతా. అవధాన్లుగారు 'సైలెన్స్' అంటూ గట్టిగా అరచేసరికి అంతా నిశ్శబ్దమయిపోయారు. "నేనుచెప్పేది కొంచెం వినండి! భర్త చనిపోయిన మా రెండో అమ్మాయ్, వారం రోజుల క్రితం ఓ కుర్రాడితో లేచిపోయింది. ఎక్కడుందో అడ్రస్ కూడా తెలీదు. ఖచ్చితంగా ఆ కుర్రాడినే పెళ్ళాడాలీ అని మీరనుకొంటే పోలీస్ ద్వారా ఆచూకీ లాగి ఆమె దగ్గరకెళ్ళి ఆ వివాహమహోత్సవమేదో మీరే జరిపించండి—నాకూ, దానికీ ఎటువంటి సంబంధమూలేదు. ఇక వెళ్ళండి ..." అనేసి తలుపులు మూసుకొన్నారాయన. కిటికీలోనుంచి అవధాన్లుగారి భార్య గొంతు ఏడుపు మధ్య వినిపించింది "ఈ పాడు మూకే నా కూతురిని చెడగొట్టారు దేముడో—లేపోతే అంత గుణవంతురాలి కీపాడు బుద్ధి ఎలా పుడుతుంది రాముడో—"

"నాకు వళ్ళుమండిపోతోంది!" అంది సరస్వతి కోపంగా.

"అవును! మాకూ అంతే!" అన్నారు మిగతా వాళ్ళు కూడా వళ్ళు మంట తెచ్చుకొని.

"ఈ ఊళ్ళో మన ఆడాళ్ళంతా చాలా ఎడ్వాన్స్ అయిపోయారు. వీళ్ళను మనం సంస్కరించాల్సిన అవసరమేమీ లేదు. ఏయే ప్రాంతాల్లో మన ఆడాళ్ళు వెనుకబడి ఉన్నారో ముందు తెలుసుకోవాలి" అంది సరస్వతి.

"అవును! ముందుగా మనరాజధానితో ప్రారంభిస్తే బావుంటుంది..." అందో సభ్యురాలు. చాలా మంది వప్పేసుకొన్నారు.

అప్పటికప్పుడే చందాలు పోగు చేసుకొని టూరిస్ట్ బస్‌లో హైద్రాబాద్ చేరుకొన్నారు. హైద్రాబాద్ బ్రాంచి వీరనారీనికేతన్ సభురాండ్రు వాళ్ళకు పెద్ద ఎత్తున స్వాగతమిచ్చారు. సరస్వతి అంతకు ముందెప్పుడూ వాళ్ళూరు టెంకాయపాలెంవదలి బయటకు పోలేదు. హైద్రాబాద్ సిటీ చూసేసరికి ఆమెకు కళ్ళు తిరిగినట్లనిపించింది.

మిగతా సభ్యురాండ్ర పరిస్థితి కూడా అలాగే ఉంది.

ఎక్కడ చూసినా ఆడాళ్లే—



సినిమా హాల్స్‌లో, సిటీ బస్సుల్లో, మార్కెట్లలో, టాక్సీల్లో, సైకిళ్ళమీద-స్కూటర్లమీదా, హోటల్స్‌లోపలా-ఆఫీసుల్లో ఎటు చూసినా వాళ్ళే-ఎక్కడ చూసినా వాళ్ళే—

రవీంద్రభారతిలో 'వీరనారీనికేతన్' సభలు బ్రహ్మాండంగా జరిగినాయి. చాలా తక్కువమంది-సభలకు హాజరవడం—ఖచ్చితంగా పదహారుమంది-ఆశాభంగం కలిగించినా ఫరవాలేదని సరిపెట్టుకొంది సరస్వతి. మర్నాడు ఇళ్ళవెంబడి తిరిగి తమ సిద్ధాంతాలు ప్రచారం చేయాలని సభ ఏకగ్రీవంగా నిర్ణయించింది.

మర్నాడుదయమే కాలనీల్లోకి బయల్దేరారు. చాలా చోట్ల ఇళ్ళల్లో ఆడాళ్ళు లేరు. ఉద్యోగాలకో, సినిమాలకో, బజారుకో వెళ్ళిపోయారు. ఓ ఇల్లు తలుపు కొట్టగానే ఒకావిడ బయట కొచ్చి 'ఏం కావాలి' అంది ఆశ్చర్యంగా.

"మేము వీరనారీనికేతన్ సభ్యులం!" అంది సరస్వతి.

లోపల్నుంచి ఓ యువకుడు రెండు ఫైళ్ళు పట్టుకొని బయటి కొచ్చాడు. అతన్ని చూడగానే సరస్వతి స్పీచ్ మొదలుబెట్టేసింది.

"అనాదిగా మన ఆడజాతికి జరుగుతోన్న అన్యాయాన్ని ఎదిరించాలి. ఆడది కూడా మగాడితో..."

"ఇంతకూ ఇప్పుడేమంటారు?" విసుగ్గా అడిగిందామె.

మీ భర్తకూడా వంటచేయాలి. ఇంట్లో పని చేయాలి-పిల్లల్ని ఎత్తుకుని తిప్పాలి. —బట్టలుతకాలి...''

"కొంచెం ఆగండి..." గట్టిగా అందావిడ.

"ఎందుకూ ?"

"నాకింకా పెళ్ళి కాలేదు..."

"ఆ !..." ఆశ్చర్యపోయారందరూ.

ముప్ఫై అయిదేళ్ళ వయసున్న ఈమెకు ఇంకా పెళ్ళిగాలేదా ?

''మరి...ఇతను..." ఆ యువకుడి వంక చూపుతూ అడిగింది సరస్వతి.

''అతను నా బాయ్‌ఫ్రెండ్...మా టైమ్ వేస్ట్‌చేయక ఇక వెళ్ళండి..." అంది కటువుగా.

రోడ్డుమీద కొచ్చేసరికి భార్యాభర్తలిద్దరూ పిల్లలతో వెళ్తూ కనిపించారు వాళ్ళను చుట్టుముట్టేశారందరూ.

"వీరనారీనికేతన్ జిందాబాద్..."

"మీరు చేసే పనులన్నీ మీ భర్త కప్పగించండి..."

"మీ చంకలో ఉన్న పాపని-ఆయన కివ్వండి...మీ పాపను మీరెందుకు మొయ్యాలి? తొమ్మిది నెలలు మోసింది చాలు..."

ఆమె భర్త గట్టిగా నవ్వాడు,

"పాపను నేను ఎత్తుకొన్నంత మాత్రాన మీ స్త్రీలు ముందు కొచ్చేసినట్లేనా ?"

"ఇలాగే అన్నిటిలోనూ మగాళ్ళు బాధ్యత తీసుకోవాలి..." అందరూ అరచారు. అతను మళ్ళీ నవ్వి జేబులో నుంచి సిగరెట్ తీసి వెలిగించి భార్యకొక సిగరెట్ ఇచ్చాడు. ఆమె కూడా తన బాగ్‌లోనుంచి లైటర్ తీసి సిగరెట్ వెలిగించుకొంది.

సరస్వతి బృందం తెల్లబోయారు.

"సిగిరెట్లు...అవ్వ..."

అక్కడనుంచి మౌనంగా నడిచారు వాళ్ళు. ఎదురుగ్గా ఉన్న బార్‌లోనుంచి ఒక స్త్రీ తూలుతూ బయటి కొచ్చింది. ఇద్దరు మొగాళ్ళు ఆమెను పడిపోకుండా పట్టుకొని కార్లో కూర్చుండబెట్టారు. సరస్వతి బృందాన్ని చూడగానే నిషాగా నవ్వి 'మైనషేమేహు' అంది.

సభ్యులంతా బెదిరిపోయారు.

"ఏమిటీ ఊళ్ళో ఆడాళ్ళిలా తెగించేశారు ?'' అనుకొన్నారు లోపాయికారీగా. ఓ టాక్సీ వాళ్ళపక్కగా ఆగింది అందులోనుంచి ఓ యువతి దిగి లోపలే కూర్చున్న యువకుడితో "రేపు మధ్యాహ్నం పన్నెండు తరువాత రా ! మా ఆయన కాంప్ కెళ్ళిపోతున్నారు-పదకొండు గంటలకు ?" అంది.

ఆ మర్నాడే సరస్వతి బృందం వాళ్ళూరు తిరిగొచ్చేశారు

వచ్చిన రెణ్ణెల్లవరకూ ఏం చేయాలో తోచలేదు సరస్వతికి. ఈలోగా తమ

వీరనారీనికేతన్ సెక్రటరీ సుధారాణి వివాహం నిశ్చయమైందన్న వార్త అంతా కార్చిచ్చులాగా పాకిపోయింది

వెంటనే సభ్యురాండ్రంతా అర్జంటుగా సుధారాణి ఇంటికి పరుగెత్తారు.

"ఏమిటి పెళ్ళట ? పెళ్ళికొడుకెవరు? మన నిబంధనలన్నిటికీ వప్పుకొన్నాడా." అనడిగారు ఆత్రుతగా.

"వప్పుకోలేదు..." అంది సుధారాణి

"ఎందుకని ?..."

"నేను మీ నిబంధనలు పెట్టలేదు."

"అదేమిటి ? మన సంస్థలో ఉన్న వాళ్ళందరం ప్రతిజ్ఞ చేశాం కదా ..."

"మన సంస్థకి రిజయిన్ చేస్తున్నాను. ఇదిగో రాజీనామా లెటర్..." అంది సుధారాణి ఉత్తరం విసిరేస్తూ.

"కారణం ఏమిటి ?"

"ఏముంది ? కేవలం పర్సనల్. ఇంతలో మన నియమావళికి అంగీకరించే వాళ్ళెవ్వరూ దొరికేట్లు కనిపించలేదు. ఇటు చూస్తే నా వయసు పెరిగిపోతోంది మా బావే వచ్చి నన్ను పెళ్ళాడతావా అనడిగాడు. ఓకే అన్నాను. అతను డాక్టరు చదివాడు. మన నిబంధనలన్నీ వింటే 'గెటవుట్' అని మరో పిల్లని చేసుకొంటాడు. అది నాకిష్టం లేదు..."

సుధారాణి పెళ్ళి బ్రహ్మాండంగా జరిగిపోయింది.

అది జరిగిన కొద్దిరోజుల్లోనే చాలా మంది సభ్యురాండ్ర వివాహాలు కూడా అయిపోయినయి. అందరూ 'నియమావళి' ఉల్లంఘించినట్లు సరస్వతికి రిపోర్టు వచ్చింది వెంటనే వాళ్ళందరికీ 'సభ్యత్వం' రద్దుచేసి పారేసింది సరస్వతి. చివరకు సరస్వతి ఒక్కత్తే ఒంటరిగా మిగిలిపోయింది. ఆమె చెల్లెళ్ళకు తమ్ముళ్ళకూ కూడా వివాహాలయిపోయినాయి తల్లిదండ్రుల బలవంతం- చెల్లెళ్ళు, తమ్ముళ్ళ గొడవ భరించలేక ఆఖరికి ఓ రోజు నియమా లేమి లేకుండానే పెళ్ళికి వప్పుకొందామె. వప్పుకొన్న వారంరోజులకే హనుమంతరావుతో పెళ్ళయిపోయింది. మొదటి రాత్రే ఇద్దరికీ పేచీకూడా వచ్చేసింది. రావడానికి సరస్వతి చాలా సహాయపడింది.

"నువ్ చాలా అందంగా ఉన్నావు సరస్వతీ," అన్నాడు హనుమంతరావ్ సరస్వతిని దగ్గరకు లాక్కొంటూ.

"ఈ డైలాగు ఇప్పటి కెంతమంది ఆడాళ్ళదగ్గర వాడావ్ ?" అంది సరస్వతి విదిలించుకొంటూ.

హనుమంతరావుకి తిక్క పుట్టుకొచ్చింది. పెళ్ళిపీటలమీద పెళ్ళికూతురికే మంగళసూత్రం ఎందుకట్టాలీ, పెళ్ళికొడుక్కెందుకు కట్టకూడదూ అంటూ ఆమె పేచీ పెట్టటం అతనికి గుర్తుకొచ్చింది.

"నీ కెంతమంది మగాళ్ళు చెప్పారీ సంగతి," అన్నాడతను.

"ఛీ! ఆడదానికి నీతి ఉంది. లేందల్లా మీ మగవెధవలకే!" అంది సరస్వతి రెచ్చిపోతూ!

"నీ కెలా తెలుసీ సంగతి? ఏ మగ వెధవయినా మోసంచేశాడా?" అన్నా డతను హేళనగా.

"నన్నా! చెప్పుతీసు క్కొడతాను వాడిని! అందరిలాంటి ఆడదాన్నను కొంటున్నావేమో!" అంది రోషంగా.

"ఏక వచనంతో సంభోదిస్తున్నావే—మర్యాద తెలీదా?" ఉడికిపోతూ అడిగాడతను.

"నన్ను ఏకవచనంతో పిలవటం లేదూ, నువ్వు?"

"నువ్వు నా పెళ్ళానివి. నా కా హక్కుంది..."

"నాకూ ఉందాహక్కు..."

"ఏడిశావ్!"

"నువ్వే ఏడిశావ్..."

ఆ తరువాత తన భావాల్ని మాటల్లో చెప్పటం కుదర్లేదతనికి. ఆమె చెంపలు ఛెళ్ళుమనిపించి చేతల్లోకి దిగాడు

'ఆడది మొగాడితో సమానం' అన్న సిద్ధాంతం ప్రగాఢంగా నమ్మిన సరస్వతి తిరగబడి అతని చెంపమీద కొట్ట బోయింది గాని హనుమంతరావ్ ఆమె చేతిని తప్పించుకొని గొడ్డుని బాదినట్లు బాదేశాడు. మూడు రోజుల వరకూ ఆమె వళ్ళంతా నొప్పులు పోలేదు. ఆ తరువాత మాటా మంతీ లేకుండానే ఇద్దరూ నెత్రో జులు కాపరం చేశారు. ఈ నెత్రోజుల్లోనూ ఓ సారి వంట చేయనందుకూ, మరో సారి మగజాతిని అతనెదురగ్గా తిట్టి పోసినందుకూ మరో రెండుసార్లు ఆమెని చావగొట్టాడతను.

అప్పుడు సరస్వతి కోవిషయం తెలిసింది.

మగాడు ఆడదానికంటె బలవంతుడు. కాబట్టి శారీరక బలం విషయంలో ఆడదీ మొగాడూ సమానమన్న తన సిద్ధాంతం తప్పయింది.

మరో రెండు నెలలకి సరస్వతి గర్భవతయింది.

అప్పుడు ఇంకో విషయం తెలిసొచ్చింది.

సృష్టే ఆడదాన్ని మగాడిమీద ఆధార పడేట్లు చేస్తోంది. ఈ పిల్లల్ని కనే బాదరబందీ లేకపోతే ఆడది మగాడిలా దర్జాగా ఉండేది.

ఆ తరువాత మరో విషయం

మగాడు చేసే కష్టమయిన పనులు కొన్ని ఆడది చేయలేదు.

ఇలా తెలుసుకొంటూండగానే ఆమెని పుట్టింటివారు తీసుకెళ్ళిపోయి పురుడు పోసి తిరిగి హనుమంతరావ్ దగ్గరకు పంపించారు. రైలు దిగి ఇంటికొచ్చేసరికి హనుమంతరావ్ మరో స్త్రీతో సొంత పెళ్ళాంలా కాపరం చేస్తూ కనిపించాడు.

సరస్వతి మండిపడుతూ 'ఇదెవరు?' అనడిగింది, ఆ యువతిని చూపిస్తూ.



"నువ్వెవతివే ?" అందా యువతి ఈసడింపుగా.

"నా యింటికొచ్చి నన్నే ఎవరని అడుగుతావా ?" అంది సరస్వతి ఉక్రోషంగా.

"నీ ఇల్లా ? సిగ్గులేదూ ఆ మాట అంటానికి ? నీ ఇల్లు, నీ మొగుడు అన్న అభిమానం, ప్రేమ నీకుంటే మీ ఆయన నా వెంబడెందుకు పడతాడు?" అందామె.

"ఏమిటిదంతా ? మాట్లాడవేం ?" అంది సరస్వతి హనుమంతరావ్ వంక చూస్తూ, ఉద్రేకంగా.

"అది చెప్పేది నిజమే :—ఇంకో గంటలో నీకు తిరిగి మీ ఇంటికెళ్ళడానికి బండి ఉంది..." అన్నాడతను.

"నీలాంటి వెధవతో కాపరం చేయడం కన్న అదే నయం," అంటూ పుట్టింటికి చక్కా తిరిగొచ్చేసింది సరస్వతి.

వచ్చేసి హనుమంతరావ్‌ని కోర్టు కెక్కించి విడాకులు తీసుకొని అతని జీతంలో తనకూ భాగం సంపాదించు కొంది.

తన కొడుకు పెరిగి పెద్దాడయి మగ జాతిలో కలిసిపోయి ఆడదాన్ని అణగ దొక్కేసాడన్న అసహ్యంతో వాడిని దూరం ఎక్కడో అనాధశరణాలయంలో చేర్పించేసింది. తరువాత తన స్నేహితు రాలి మొగుడు సహాయంతో ఓ చిన్న ఉద్యోగం సంపాదించుకొంది. సంపా దించుకొని పత్రికల్లో మగజాతిని

దుయ్యపడుతూ వ్యాసాలురాసింది. చాలా మంది పాఠకులు ఆ వ్యాసాలు చదివి అద్భుతం అన్నారు. అన్నారు కదాని మరింత దుమె త్తిపోస్తూ వారపత్రికల్లో సీరియల్స్ రాసింది అవి చదివి ఆడాళ్ళు కొంతమంది 'అమోఘం' అన్నారు. మగాళ్ళు చాలామంది నవ్వారు. కొంత మంది నవ్వుకొన్నారు.

దాంతో సరస్వతికి తానో సంఘ సంస్కర్తనేమో అన్న అనుమానం వచ్చింది ఇద్దరు ముగ్గురు స్నేహితు రాండ్ర నడిగితే "నీ మొహం! ఇంకా అనుమానమేమిటి?" అంటూ కోప్పడ్డారు.

ఆ ప్రోత్సాహంతో ఆవిడ మరింత విజృంభించేసింది. 'అలనాటి నుంచీ ఆడదానికి జరుగతున్న అన్యాయాలు' అనే గ్రంథం రచించేసింది. దాంట్లో ఆది శక్తి దగ్గర్నుంచీ, పక్కింటి సుబ్బారావ్ రెండో పెళ్ళాం భానుమతి వరకూ అందరి గురించీ, వాళ్ళకు జరిగిన అన్యాయాల గురించీ వెయ్యి పేజీ ల్రాసింది.

ఆ గ్రంథాన్ని కొన్ని ఆడపిల్లల కాలేజీలు టెక్స్టు బుక్‌గా నిర్ణయించినయి. దాంతో సరస్వతి విలువ పెరిగిపోయింది. పబ్లిషర్లు ఆమె ఇంటిచుట్టూ తిరగ సాగారు. అందులో ఓ యువక పబ్లిషర్ 'నిన్ను పెళ్ళాడతా' నన్నాడు, కాని ఆమె షరతులు విని గంటకు రెండు వందల మైళ్ళ వేగంతో పరుగెత్తు కొంటూ వెళ్ళిపోయాడు. 'ఇంతోటి భార ద్దేశంలో నాకు నచ్చే వరుడే దొరకడా' అని మండిపడింది సరస్వతి. ఆ మర్నాడే పేపర్లో 'వరుడు కావలెను' అన్న ప్రకటన కనిపించింది.

వరుడు 'ఆడది మగాడి కంటే తక్కువ' అన్న చులకన భావం లేని వాడు, పెళ్ళానికి అమితమైన గౌరవం ఇవ్వగల వాడు, 'మగాడు వంట చేయటం -ఆడది ఉద్యోగం చేయటం' తప్పు అననివాడూ, భార్య పరాయి మగాడితో మాట్లాడినా, తిరిగినా తప్పుపట్టని వాడూ, భార్యని పల్లెత్తుమాట అనని వాడూ. కనీసం డిగ్రీ వరకయినా చదివినవాడూ, ఇంతకు ముందొక సారి పెళ్ళాడనివాడూ, ఏ బాదరబందీ లేనివాడూ అయుండాలని ఆ ప్రకటనలో ఉంది.

ఆ ప్రకటన పడిన తర్వాత వారం రోజుల వరకూ ఆ పేపర్ సర్క్యులేషన్ సగానికి సగం పడిపోయింది.

షుమారు పదిహేన్రోజుల తర్వాత ఓ యువకుడొచ్చి ఆమె ఇంటితలుపు తట్టాడు. తలుపు తీసి "ఏమిటి? ఏం కావాలి?" అంది సరస్వతి.

"నా పేరు బసవలింగం..." అన్నాడతను.

"నీ పేరు నా కనవసరం—ఏం కావాలి?"

"వరుడు కావాలని...ఈ ఇంటి అడ్రస్ నుంచి పేపర్లో ప్రకటన..."

"ఓహ్హో..." అంది సరస్వతి అర్థమయినట్లు.

"వరుడెవరు ?" అనడిగింది వెంటనే.

"నేనే..."

"ఓహ్హో...నువ్వా...రా ! కూర్చో!" అంది లోపలకు దారితీస్తూ.

బసవలింగం ఆమె వెంబడే లోపలకు నడిచి బెరుగ్గా కుర్చీలో కూర్చున్నాడు. సరస్వతి టేబుల్ మీద కూర్చుని అతన్ని పరీక్షగా పరీక్షించింది. అతను ఓ సారి ఆమె ముఖంలోకి చూచి భయపడి వెంటనే తలదించేసుకొన్నాడు.

"ఏం చదివావ్ ?" అడిగింది సరస్వతి.

"బి. ఎ. ఫెయిలయ్యానండి..."

"ఎందుకని ?"

"ఏమోనండీ..."

"వంట చెయ్యగలవా ?"

"బాగా వచ్చండీ !"

"ప్రకటనలోని అన్ని విషయాలకూ నువ్వు అంగీకరిస్తున్నావా ."

"పూర్తిగా అంగీకరిస్తున్నానండీ !"

"సరస్వతిని నేనే - నే న్నీకు నచ్చానా ?"

"భలేవారండీ ! నచ్చకపోడం ఏమిటీ ?"

సరస్వతికి అతన్ని చూస్తూంటే బోలెడు ముచ్చటేసు కొచ్చింది తను అతన్ని ఏకవచనంలో పిలుస్తున్నా అతను తనని బహువచనంతో సంబోధిస్తున్నాడు. ఎంతో గౌరవంగా మాట్లాడుతున్నాడు. పైగా చచ్చేంత అమాయకుడిలా కనిపిస్తున్నాడు. ఇతన్ని చేసుకొంటే తన జీవితం ధన్యమయిపోతుంది. మగాడే ఆడదానికి బానిస అని అందరికీ చాటించవచ్చు. రచనల్లోనే కాదు. నిజ జీవితంలో కూడా తను మగాడిని అణగదొక్కగలదని, నిరూపించవచ్చు. తన క్కావలసిందల్లా సరిగ్గా ఇలాంటి భర్తే

మరి కొన్ని ప్రశ్నలు వేసి "సరే రేపు ఉదయం రా ! అగ్రిమెంట్ రాసుకొందాం !" అందామె.

తరువాత కొద్ది రోజుల్లోనే అనేక మంది ప్రముఖుల సమక్షంలో ఇద్దరికీ బ్రహ్మాండంగా శాస్త్రయుక్తంగా వివాహం అయింది. అయితే తన మెడలో తాళి కట్టించుకోడానికి సరస్వతి ఇష్టపడ లేదు.

పెళ్ళయిన మొదటి రోజునే అతనికి పనులు పురమాయించింది సరస్వతి. "చూడు" రేపట్నుంచీ నువ్వు తెల్లారు జామునే లేవాలి. ఇల్లు ఊడ్చి, నాకు వేడినీళ్ళు సిద్ధం చేసి నన్ను లేపాలి. నేను స్నానం ముగించి సిద్ధమయేలోగా వంట పని ముగించాలి అప్పుడు ఇద్దరం కలిసి భోజనం చేద్దాం ! తరువాత నేను ఆఫీసు కెళ్ళిపోతాను.

నువ్వు ఇంట్లో రెస్ట్ తీసుకో! తిరిగి సాయింత్రం నేను ఇంటికొచ్చే సరికి వంట పని ముగించుకొని సిద్ధంగా ఉండాలి. నాకు గడపలోనే చిరునవ్వుతో టీ అందించాలి. అప్పుడు ఇద్దరం, షికారుకో, సినిమాకో వెళ్ళవచ్చు... తెల్సిందా?'' అనడిగింది.

"ఓ?" అన్నాడు బసవలింగం సంతోషంగా.

ఆ రోజుకి అతనే వంట చేశాడు. ఇద్దరికీ మంచాలు వెన్నెల్లో వేసి, దుప్పట్లు పరచాడు. ఇద్దరూ భోజనాలు ముగించారు. సరస్వతి ముందస్తుగా వెళ్ళి తన మంచంమీద పడుకొంది. ఆమెకు అమితానందంగా ఉంది, అలాంటి భర్త దొరకడం! కాసేపటికి వంటిల్లంతా సర్ది, ఓ గ్లాసునిండా పాలు తీసుకొని అణకువగా ఆమెదగ్గరకొచ్చాడు బసవలింగం!

"పాలు తాగండి!" అన్నాడు ఆమె పక్కనే మంచం మీద కూర్చుంటూ.

సరస్వతి లేచి కూర్చొని పాలు తాగింది. ఖాళీ గ్లాసు అందుకొని కింద పెట్టాడు బసవలింగం.

అతని నడుం చుట్టూ చేయి వేస్తూ, 'బసవలింగం' అంది సరస్వతి ప్రేమగా!

"నీ లాంటి భర్త దొరకడం నిజంగా నా అదృష్టం!" అంది అతన్ని గుండెల మీదకు లాక్కొంటూ.

''అంత మాటనకండి! ఆ అదృష్ట మంతా నాది. మీలాంటి ఉత్తమురాలు భార్యగా దొరకటం, నిజంగా నాఅదృష్టం అన్నాడు బసవలింగం ఉద్రేకంగా ఆమెని తనకేసి హత్తుకొంటూ.

ఇలాంటి సుఖానికి దూరమయి చాలా కాలమయింది సరస్వతికి. అంచేత అమితోద్రేకంతో అతన్ని పెనవేసుకు పోయింది. కొద్దిక్షణాలయినా అలా గడ వక ముందే ''ఇంక నాకు నిద్రొస్తోంది, నిద్రపోతాను..." అన్నాడు బసవలింగం ఆమె కౌగిలి విడిపించుకోడానికి ప్రయత్నిస్తూ.

సరస్వతి షాక్ తిన్నట్లు అతని వంక చూసింది. ప్రణయం పరాకాష్టనందు కొనే సమయంలో ఉద్రేకం పొందాల్సింది ఇతనిలా వుంటాడేం అని ఆశ్చర్యంగా ఉందామెకు.

బహుశా, తను మరింత చొరవ తీసుకో వాలేమో! కొన్ని పుస్తకాల్లో చదివింది తను. భర్త కొంచెం ముఖమాటపడే మనిషయితే భార్యే ప్రణయకలాపాల్లో చొరవ తీసుకోవాలని. బసవలింగం అలాంటి స్వభావంగలవాడయి ఉంటాడు.

ఆ ఉద్దేశంతో అతన్ని మరింత గట్టిగా కౌగలించుకొని తనే ముద్దు పెట్టుకొంది సరస్వతి. అయినా బసవ లింగం చలించలేదు.

"నన్ను వదలండి! నిద్రొస్తోంది.." అన్నాడు ఇబ్బందిగా.

సరస్వతి శరీరమంతా కోరికతో వేడెక్కిపోయింది. అలాంటి స్థితిలో అతని మాటలు విపరీతమయిన కోపం తెప్పించినయి. అయినా అది పైకి కన బడనీయకుండా "ఎందుకని ? అప్పుడే అలసిపోయావా ?" అంది చిరునవ్వుతో.

''అది కాదండీ ! ఎందుకనో నా కి లాంటివి ఇష్టముండదు !" అన్నాడతను.

''అదేమిటి ?" ఆశ్చర్యపోతూ అడి గింది సరస్వతి.

అవునండీ! చిన్నప్పటినుంచీ అంతే -వీటిమీద ఏ మాత్రం ఆసక్తి ఉండదు ..." అన్నాడు సిగ్గుపడుతూ

''మరి డాక్టరుని చూసి సంప్రదించ లేదూ ?"

"పెళ్ళయింది ఇవాళే కదండీ !"

నిర్ఘాంతపోయిం దామె.

ఏమిటీ మనిషి ? ఇలాంటి వాళ్ళు కూడా ఉంటారా ఈ లోకంలో ? ఆడ దానిమీద కోరిక లేకపోడానికి కారణం ఏమిటి ? బహుశా మానసికంగా ఏమ యినా వైద్యం కావాలేమో ! మర్నాడే డాక్టరుని సంప్రదించా లనుకొంది సరస్వతి.

డాక్టరు అంతా విని బసవలింగాన్ని పరీక్షించాడు. పరీక్షించి "ఇతను సంసారసుఖానికి పనికిరాడు" అన్న సర్టి ఫికెట్ ఇచ్చాడు

అది విని సరస్వతి మండిపడింది.

"రాస్కెల్ ! ఈ సంగతి ముందే ఎందుకు చెప్పలేదు ?" అంటూ బసవ లింగంమీద విరుచుకుపడింది.

''మీరడగలేదు కదండీ !'' అన్నాడు బసవలింగం తాపీగా.

''వెంటనే బయటికి పో—మరోసారి నీ ముఖం నాకు చూపించకు..." అందామె కోపంగా

"ఎక్కడికి పోనండీ ? నాకు మీరు తప్పితే ఇంకెవరున్నారండీ?" అన్నాడు తను.

''పోతావా-పోలీస్‌ని పిలిచి గెంటించ మన్నావా ?" అందామె రుద్రకాళి అవ తారం దాలుస్తూ.

పోలీసులేంచేస్తారండీ!అయిదేళ్ళకుఇద్దరం అగ్రిమెంట్ రాసుకొన్నాంగదండీ!—"

''కాని ఇది మోసం కిందకు వస్తుంది ! నిన్ను అరెస్ట్ చేయవచ్చు !"

''మోస మెలా అవుతుందండీ! మీ ప్రకటనలో శారీరిక సుఖం గురించి మీరు ప్రస్తావించనేలేదు..."

నిర్విణ్ణురాలయి పోయింది సరస్వతి.

ఒకటీ రెండు రోజులు కాదు-ఈ అవతారాన్ని అయిదేళ్ళు భరించాలి.

''ఈ పాడు మగజాతి..." అంటూ తిట్టబోయి నాలి క్కొరుక్కుం దామె.

ఆ తరువాత ఆమె కలంనుంచి మగవాళ్ళను దుమ్మెత్తి పోసే కథలూ, నవలలూ, నాటికలూ మరింతగా ఎక్కువయిపోయినయి.

---




# దురాశ

మల్లాది వెంకట కృష్ణమూర్తి

ఆరో తారీకు ఆ రోజు.

ఆరో తారీకంటే నా కమితభయం. కారణం ఆరో తారీకే నాకు నెలాఖరిరోజు అవుతుంది. ఫ్యాక్టరీచట్టం ప్రకారం ఏడో తారీఖు లోపల ఫ్యాక్టరీలలో పని చేసేవాళ్లకు అన్ని జీతాలు చెల్లించాలి. ప్రతీనెలా, ఏడో తారీఖే నాకు జీతం ముట్టేది.

అంటే ఆరోతారీఖు నాకు ముప్పై ఒకటవ తారీకన్నమాట. నాలుగు గంటలకో సిగరెట్ అన్నా లేకపోతే నాకు నిస్సత్తువగా, చిరాకుగా వుంటుంది. ఆఖరి సిగరెట్ తాగి నాలుగ్గంటలు దాటిపోయింది అప్పుడే.

జేబులో కేవలం అర్ధరూపాయ మాత్రమే మిగిలివుంది. సరిగ్గా బస్ చార్జీలకు సరిపోతుందంతే. తలనొప్పి ప్రారంభం అయింది నాకు.

బస్‌లో రద్దీగాలేదు, అదృష్టవశాత్తూ. రాత్రి ఎనిమిదింపావయింది. డ్రయివర్, కండక్టర్ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇంకా బస్ బయలుదేరే టైం అయినట్టులేదు. త్వరగా ఇంటికి చేరితే, ప్రక్కింటాయన దగ్గరనుంచి చుట్టముక్క సంపాదించచ్చు అనే ఆలోచన కొద్దిగా రిలీఫ్‌గావుంది.

డిమ్‌గా వెలిగే బస్ దీపాల కాంతిలో జిగేల్‌మంటూ నా కళ్ళబడ్డది.

రూపాయిబిళ్ళ!

ఎదురుసీట్ కింద పొందికగా కూర్చొని వుంది, నీడ పడేచోట. నా మనసు చలించిందా క్షణంలో వంగి దాన్ని అందుకోవాలన్న ప్రయత్నాన్ని అతి కష్టంమీద నొక్కిపట్టాను.

మొదటిసారిగా నా ప్రక్కన మరొకతను కూర్చున్న సంగతి నా గ్రహింపులోకి వచ్చింది. నేను వంగి దాన్ని అందుకుంటే వాడు గమనిస్తాడు తప్పకుండా. అతను జేబుల తడుముకుని 'ఆరూపాయి నాదే మాస్టారు' అంటే ఇవ్వకుండా

వుండలేను. ఆ రూపాయి నిజానికి అతనిది అయినా, కాకపోయినా.

అతను ఎదుటి సీటులోని వ్యక్తిని తట్టి పిలిచి, "మీ రూపాయి బిళ్ల క్రిందేమయినా పడిందేమో చూడండి" అన్నా అనచ్చు, నాకు రూపాయి వస్తోందనే ఆసూయతో.

నా మనస్సు ఆలోచనలతో నిండిపోయింది. ఎలా ఆ రూపాయని సంపాదించడం? జేబురుమాల జారవేసి, వంగి రుమాలతో పాటుగా ఆ రూపాయిని అందుకుంటే?

ప్రక్కన కూర్చున్నతను చూసే ప్రమాదం వుంది. దురాశే అయినా, ఆ రూపాయని అంత తేలికగా వదులుకోదలుచుకోలేదు. బస్ అంతా ఖాళీగావుంటే, వాడు నా ప్రక్కనే వచ్చి కూర్చోవాలా?

నా ప్రక్కన కూర్చొనున్నతని చూపు ఏ క్షణంలోనయినా ఆ రూపాయబిళ్ల మీద పడచ్చు. పడితే, అతను తీసుకోవచ్చు, లేదా ఆ రూపాయబిళ్ళ పైభాగంలోని సీటు తాలూకు వ్యక్తిని అడగచ్చు మీదేనానని. నా చేతులు దాటిపోనివ్వకూడ దనుకున్నాను ఆ రూపాయబిళ్ళని, ఏది ఎలా అయినా సరే.

ఒకసారి మెరుపులాంటి ఆలోచనలు నా బుర్రకి తడుతూంటాయనిపిస్తూంటుంది నాకు. నాకు తట్టిన ఉపాయం మంచిదా, కాదా అని ఆలోచించాను కొన్ని క్షణాలు.

జేబులోంచి చిల్లర తీసాను ఒక పావలాబిళ్ల, రెండు పది పైసల బిళ్ళలు, ఒక అయిదు పైసలబిళ్ల, మొత్తం అర్ధ రూపాయి. ఆ నాలుగు నాణేలు కలసి. ఆ నెలాఖరున మిగిలిన డబ్బది.

గలగల చప్పుడయేలా, నా చేతిలోని చిల్లరని సీటుకిందకి జారవిడిచాను, పొరపాటున చెయ్యిజారి ఆ చిల్లర కిందపడ్డట్టుగా. ఎదుటి సీటులోని వ్యక్తి వెనక్కి తిరిగాడు, ఆ గలగల చప్పుడికి. నా ప్రక్కన కూర్చున్నతను నా వంక, ఎదురుగా సీటుకిందపడ్డ చిల్లరవంకా చూసాడు.

నేను వంగి, ఎదురుగా సీటుకిందపడ్డ చిల్లరనంతా ఏరాను. నా అర్ధరూపాయతోపాటు, ముందరనుంచే పడివున్న ఆ రూపాయబిళ్ళనికూడా అందుకున్నాను నిర్భయంగా. నా ఆలోచనకి నాకే ఎంతో గర్వం వేసింది.

ఎవరికీ అనుమానం కలగకుండా రూపాయ సంపాదించగలిగాను. పెంపుడు పావురాళ్లు వెళ్ళి, స్వేచ్ఛగా తిరిగే పావురాయిని వెంటబెట్టి తీసుకువచ్చినట్లు, నా అర్ధరూపాయి చిల్లరవెళ్ళి ఆ రూపాయని వెంటబెట్టి తీసుకువచ్చింది

నా చేతిలోని గాంధీబొమ్మ రూపాయి బిళ్ళవంక గర్వంగా చూసుకున్నాను. సిగరెట్స్ కొనుక్కోవచ్చు. రేపు సాయంత్రందాకా కాల్చడానికి సరిపడా.

ముందు సీటులో కూర్చొనున్న టెర్లిన్ పేంట్, టెర్లిన్‌షర్ట్ వ్యక్తి లేచి నిల్చుని,

ఓసారి నా వంక, గ్రీజ్ మరకలు అంటి వున్న నా కాకీరంగు బట్టలవంక అను మానంగా చూసాడు.

వెంటనే తన జేబులు తడుముకుని అన్నాడు నావంక నిశితంగా చూస్తూ.

"నా జేబులో చిల్లరకూడా పడిన ట్లుంది."

తల అడ్డంగా వూపాను వెంటనే.

"గాంధీ రూపాయబిళ్ళ, ఓ పావలా. పాత పావలా అది. కావాలంటే చూడండి," మృదువుగా అన్నాడతను. పొరపాటే చేసాను. నా గుప్పిట తెరచి, నా చేతిలోని చిల్లరని ఆ టెర్లిన్ షర్ట్ అతనికి చూపించాను అప్రయత్నంగా, తల మరోసారి అడ్డంగా వూపుతూ.

"నే చెప్పలా," అంటూ టెర్లిన్‌షర్ట్ వ్యక్తి నా అరచేతిలో వున్న చిల్లరలోంచి ఏరుతున్నట్లుగా రెండు నాణాలు—గాంధీ బొమ్మ రూపాయబిళ్ళ ఒకటి, పాత పావలాబిళ్ళ ఒకటి—తీసుకుని అన్నాడు. "నాదే ఈ చిల్లర. ఇందాక పూలు కొని రెండురూపాయల నోటు ఇస్తే, ఈ చిల్లర ఇచ్చాడు ఆ పూలకొట్లోని అతను."

ఎడం చేతిలోని పూలపొట్లంతో కిటికీ లోంచి ఓ పూల దుకాణంవంక చూపించాడు అతను, కావాలంటే ఆ పూల దుకాణంవాడు సాక్ష్యం చెప్తాడనే సంగతి స్పష్టంగా ధ్వనించేలా.

"నాదే," తడబడ్డాను.

మెత్తగా నవ్వి అన్నాడు ఆ టెర్లిన్ షర్ట్ అతను

"నా జేబుకి చిల్లువుంది. కావాలంటే చూడు." కుడిచేతి వేలిని చొక్కాజేబు లోకి పోనిచ్చి, జేబుకున్న చిల్లుని చూపించాడు.

బిత్తరపోతూ చూస్తూండిపోయాను నేను.

"థాంక్స్ ఎనీవే" అన్నాడతను ఆ డబ్బుని పేంట్‌జేబులో వేసుకుని, మళ్లా తన సీట్‌లో కూర్చుంటూ.

నా చేతిలో మిగిలివున్న మూడు నాణాలవంక—రెండు పది పైసల బిళ్ళలు, ఓ అయిదు పైసలబిళ్ళ—పావలావంక చూసుకున్నాను.

ఆ పావలాతో ఇంటికి బస్ టికెట్ కొంటే, చలిలో రేపు ఉదయం నడిచి వెళ్లాలి ఫేక్టరీకి. ఉదయం షిఫ్ట్‌కి. ఇక బస్ ఛార్జీ లేదు.

ఓడిపోయాను. అందుకే కిక్కురు మనలేదు నేను. ఒక్కోసారి పెంపుడు పావురాళ్ళు, స్వేచ్ఛగా తిరిగే పావురాళ్ళతో ఎగిరిపోతూ ఉంటాయి శాశ్వతంగా—అదృష్టం బావుండనప్పుడు.






బాగ్దాద్ పరిపాలించే ఖలీఫా హారున్ అల్‌రషీద్ ఒక రాత్రి తన వజీరైన జఫర్ అల్‌భర్మన్‌తో, "మనం ఈ రాత్రి నగరంలోకి వెళ్ళి, గవర్నర్లూ, వలీలూ ఏంచేస్తున్నారో తెలుసుకుందాం. ఎవరిమీ దేదైనా ఫిర్యాదులుండే పక్షంలో వాళ్ళను తప్పక తొలగిస్తాను," అన్నాడు.

"చిత్తం," అన్నాడు జఫర్.

ఖలీఫా, జఫర్, అంగరక్షకుడు మస్రూర్ మారువేషాలు వేసుకుని, బాగ్దాద్ వీధులవెంట సంచారం బయలుదేరారు. ఒక చిన్న గొందిలో వారికి ఒక ముసలాడు కనిపించాడు. వాడు తన నెత్తిన ఒక వలా, చేపలబుట్టా పెట్టుకుని, చేతిలో ఒక కర్రపట్టుకుని, చిన్నగా ఇలా పాడుతూ పోతున్నాడు :

"నీ తెలివైన బుర్ర మందమతుల
అంధకారంలో ప్రకాశిస్తుందన్నారు.

ఇక అక్కడంటాను నా పాండిత్యంతో
నేను సంపాదించేదానికన్న సానిది
ఒక గంటలో ఎక్కువ సంపాదిస్తుంది.

అంగడిలో నా పుస్తకాలూ,
నా తెలివితేటలూ
ఉప్పుచేప ఖరీదు చెయ్యవు.

భూమి అడుగున తెలివికి విలువ
ఉండవచ్చు.

*అందుచేత నాలాంటి బిచ్చగాళ్లు*
*సమాధిలో పెట్టేడు చోటు*
*దొరికినదాకా తిరగక తప్పదు"*

ఇది విని ఖలీఫా జఫర్‌తో, "ఈ పేద వాడి అవతారమూ, వాడి పాటా చూడగా తీరని దరిద్రంలో ఉన్నట్టున్నాడు," అని ముసలాణ్ణి సమీపించి, "నాయనా, నీ వృత్తి ఏమిటి ?" అని అడిగాడు.

"దొరా, నేను చేపలు పట్టేవాణ్ణి, ముసలివాణ్ణి. పెద్ద కుటుంబం గలవాణ్ణి మధ్యాహ్నంనుంచీ ఇప్పటిదాకా నాకు మించి శ్రమపడినాకూడా, అల్లా దయ దలిచి నా బిడ్డలకు పట్టెడుకూడు దొరికే టట్టు చెయ్యలేదు. నా మీదా, నా జీవితం మీదా చాలా విసుగెత్తింది. చావాలని తప్ప నాకు ఏ కోరికా లేదు." అన్నాడు ముసలాడు.

"మాతోబాటు టైగ్రిస్‌నదికి మళ్లీ వచ్చి, నా కోసం మరోసారి వల వేస్తావా? నా అదృష్టం చూసుకుంటాను. వలలో ఏంపడినా నూరు దీనారాలిస్తాను," అన్నాడు ఖలీఫా.

ముసలాడు సంతోషంగా వాళ్లవెంట నదికి తిరిగివచ్చి, వలవేసి, కొద్ది క్షణా లలో ఒక బరువైన పెట్టెను పైకి తీశాడు. తాళంవేసిఉన్న ఆ పెట్టె చాలా బరువుగా ఉన్నది. ఖలీఫా ఇచ్చిన నూరు దీనా రాలూ సంతోషంగా తీసుకుని ముసలాడు వెళ్ళిపోయాడు. జఫర్, మస్రూర్ కలిసి ఆ పెట్టెను రాజభవనానికి మోసు కొచ్చారు.

జఫర్, మస్రూర్‌లు పెట్టె తాళం పగులగొట్టుతుంటే, ఖలీఫా దివిటీలు వెలిగించాడు. పెట్టె లోపల ఖర్జూరపు ఆకులతో అల్లిన పెద్ద బుట్ట ఉన్నది. దాని మూతి ఎర్రతాడుతో కుట్టి ఉన్నది. ఈ తాడును కోసేసరికి బుట్టలో మొదట ఒక తివాసీ, దానికింద ఒక పడదాని మేలిముసుగూ, తరవాత తెల్లగా పాలి పోయి ఉన్న స్త్రీ శవమూ కనిపించాయి. ఆ శవం ముక్కలు ముక్కలుగా నరికి ఉన్నది.

ఇది చూసి ఖలీఫా మొదట రోదించి, తరవాత పట్టరాని ఆగ్రహంతో జఫర్ కేసి తిరిగి అరుస్తూ, "వజీర్ కుక్కా ! నా నగరంలో ఇలాటి హత్యలు జరుగు తున్నాయి. ఈ రక్తపాతపు పాపం విచారణ దినంనాడు నాకుచుట్టుకుంటుంది. అల్లా! ఈ హంతకుణ్ణి చూపిస్తేగాని ఊరుకోను. జఫర్, ఈమెను హత్య చేసినవాణ్ణి తీసుకురాకపోయావో నీ తల కోటగుమ్మానికి కడతాను నీ తలతో బాటు మీ నలభైమంది బర్మెక్‌ల తలలు కూడా కోటగుమ్మానికి కట్టిస్తాను!" అన్నాడు.

జఫర్ మూడురోజులు గడువు అడిగాడు. అంత కోపంలోనూ ఖలీఫా సరే నన్నాడు.

పాపం, జఫర్ దిగులుపడి నగరంలో



యువ

తిరుగుతూ, "హంతకుణ్ణి ఎలా పట్టి ఖలీఫాకు అప్పగించను? అసలు హంత కుడికి మారుగా మరొకణ్ణి తెస్తే వాణ్ణి హత్యచేసిన పాపం నాకు చుట్టుకోదా? ఎలాటి దురవస్థ వచ్చి పడింది నాకు!" అనుకున్నాడు

ఆయన ఇంటికి పోయి, మూడు రోజులపాటు బయటికి రాలేదు. మూడు రోజులూ హతాశుడై నీరసించిపోయి, ఆయన నాలుగోనాడు ఖలీఫా వద్దకు వచ్చాడు.

హంతకుడేడీ అని ఖలీఫా అడిగాడు.

"కనిపించనిదాన్ని ఎలా చూడను? దాగిఉన్నదానికోసం ఎలా వెతకను? నగరంలోని ఇంతమంది మనుషులలో హంతకుణ్ణి పట్టుకోగలనా?" అన్నాడు జఫర్.

ఈ సమాధానానికి ఖలీఫా మండిపడి, జఫర్ తల కోటగుమ్మానికి కట్టమని ఉత్తరువిచ్చి, ఆ సంగతి నగరమంతా ఇలా చాటింపు వేయించాడు:

"ఖలీఫాకు వజీరైన జఫర్ అల్ బర్మక్ తలా, మరి నలభై మంది బర్మక్‌ల తలలూ కోటగుమ్మానికి వేళ్లాడగట్టటం చూడగోరే వారందరూ రావచ్చు."

జఫర్‌నూ, ఆయన జ్ఞాతులనూ చంపు తుంటే చూడటానికి బాగ్దాదు నాలుగు దిక్కులనుంచీ ప్రజలు తండోపతండా లుగా వచ్చారు. నేరం ఏమిటో వారికి తెలీదు, కాని బర్మక్‌లు దయాస్వభావులూ ధర్మపరులూ కావటంచేత ప్రజలకు వారంటే చాలా అభిమానం. అందుచేత జనం ఏడవసాగారు.

వధ్య స్థానం సిద్ధం చేయబడింది. శిక్ష అమలుజరగటానికి ఖలీఫా ఉత్త రువు రావటమే తరువాయి.

అకస్మాత్తుగా గుంపులోనుంచి ఒక అందమైన యువకుడు, మంచి దుస్తులు ధరించి ముందుకువచ్చి, జఫర్ కాళ్లపై పడి, "ధర్మప్రభూ, పేదలపాలిటి పెన్నిధీ! నేను మిమ్మల్ని విడిపించ వచ్చాను. టైగ్రిస్‌నదిలో దొరికినపెట్టెలో ఉన్న స్త్రీని చంపినది నేనే నన్ను చంపి, ఆమెకు జరిగిన ద్రోహానికి ప్రతీకారం చెయ్యండి!" అన్నాడు.

ఈ మాటలు విని జఫర్ తాను బయటపడినందుకు సంతోషించి కూడా, ఆ యువకుడికోసం బాధపడ్డాడు. అతన్ని ఆయన వివరాలు అడగ బోతూండగా, ఒక వృద్ధుడు జనంలో నుంచి తోసుకుంటూ ముందుకువచ్చి, జఫర్‌కూ, యువకుడికీ వందనంచేసి, "ఓ వజీర్, ఈ కుర్రవాడి మాటలు నమ్మవద్దు. ఆ యువతిని చంపినది నేనే. అందుకు నేనే శిక్ష అనుభవించాలి!" అన్నాడు.

"ఓ వజీర్, ఈ వృద్ధుడికి మతి సరిగా లేదు. ఆయన ఏం మాట్లాడు తున్నాడో ఆయనకే తెలీదు. హత్య

చేసినది నేను. నేనే శిక్ష పొందాలి," అన్నాడు యువకుడు.

వృద్ధుడు అతనితో, "బాబూ, నువు యువకుడివి. నీకు జీవితం మధురమైనది. నేను ముసలివాణ్ణి. నాకు ప్రపంచంతో రుణం తీరిపోయింది. నీ కోసమూ, వజీర్ కోసమూ, ఆయన జ్ఞాతులకోసమూ సంతోషంగా ప్రాణాలర్పిస్తాను. మళ్ళీ చెబుతున్నాను, నేనే హంతకుణ్ణి. నాకే శిక్ష పడాలి," అన్నాడు.

ఆ ఇద్దరూ ఈ విధంగా ఆత్మనేరారోపణ చేసుకోవటం చూసి ఏమీ పాలుపోక రక్షకభట నాయకుడి అనుమతిపొంది, ఖలీఫా వద్దకు ఇద్దరినీ వెంటబెట్టుకు వెళ్ళి, "మహాప్రభూ, ఇడుగో హంతకుడు," అన్నాడు

ఖలీఫా ఆ ఇద్దరినీ చూసి, "ఆ స్త్రీని ఎవరు చంపారు?" అని అడిగాడు.

"నేనే !" అని ఇద్దరూ సమాధానం చెప్పారు.

"ఇద్దరి తలలూ తీయించు," అన్నాడు ఖలీఫా జఫర్‌తో.

"కాని, వారిలో ఒక్కడే హంతకుడైతే రెండోవాణ్ణి శిక్షించటం అక్రమం కద !" అన్నాడు జఫర్.

ఈ మాట విని యువకుడు, "పైన ఆకాశాన్నీ, కింద వనంలాగా భూమినీ అమర్చినవాడిమీద ప్రమాణం చేసి చెబుతున్నాను. నేనే హత్యచేశాను. ఆ సంగతి రుజువు చెయ్యగలను," అంటూ తాను శవాన్ని ఎలా బుట్టలో కట్టినదీ వివరంగా చెప్పాడు. ఆ వివరాలు తెలిసినవాళ్లు ఖలీఫా, జఫర్, మస్రూర్‌లు మాత్రమే గాక, అతనే హంతకుడన్న నమ్మకం ఖలీఫాకు కలిగింది. ఆయన ఆశ్చర్యపడి, "ఎందుకలా చేశావు ? చేసినవాడివి, చిత్రహింసలు పెట్టకుండానే నేరం ఎందుకు ఒప్పుకుంటున్నావు ? అసలు నువు శిక్షించమని ప్రాధేయపడుతూ రావటానికి కారణమేమిటి?" అని అడిగాడు.

యువకుడు తన కథ ఇలా చెప్పాడు:

"ప్రభూ, ఆ యువతి నా భార్య, ఈ పెద్దమనిషి కూతురు. ఆమె చిన్నతనంలోనే కాపురానికి వచ్చి, నావల్ల ముగ్గురు కొడుకులను కన్నది. ఆమెకు నేనంటే ఎంతో ప్రేమ. నాకు ఎంతో విధేయురాలై ఉండి, సేవలు చేసేది. నా మటుకు నాకు ఆమెలో ఎలాటి దోషమూ కనిపించలేదు.

"ఈ నెల మొదట్లో ఆమెకు జబ్బు చేసింది. మంచి వైద్యులను పెట్టాను. అల్లా అనుగ్రహంవల్ల ఆమె వ్యాధిని వారు నివారణ చేశారు. తిరిగి ఆమెతో సంసారం చేద్దామన్న ఉద్దేశంతో ఆమెను స్నానశాలకు వెళ్ళిరమ్మన్నాను స్నానం చేసేముందు ఆమెకు ఆపిల్ పండు తినాలనీ, వాసన చూడాలనీ కోరికగా ఉన్నట్టు ఆమె చెప్పింది. వెంటనే నేను ఆపిల్‌పండు కొందామని, నగరంలోకి వెళ్లాను. కాని పళ్లవర్తకులలో ఎవరి




దగ్గిరా ఆపిల్‌పళ్లు లేవు. వట్టి చేతులతో తిరిగివచ్చి, నా భార్యకు ఆశాభంగం కలిగించటం ఇష్టంలేక ఆమెకు కనిపించకుండా ఆ రాత్రి గడిపి, మర్నాడు పళ్ల తోటలన్నీ చుట్టబెట్టాను. ప్రతిచెట్టూ చూశాను. చివరకు ఒక ముసలి తోటమాలి నాతో, 'నాయనా, ఈ ప్రాంతాల ఎక్కడా ఆపిల్‌చెట్లు లేవు; బస్రాలో ఖలీఫాగారి తోటలు మాత్రమే ఉన్నాయి. అక్కడకూడా నీకు పండు దొరకటం దుర్లభం. ఎందుకంటే ఆ ఆపిల్ పళ్ళన్నీ ఖలీఫాగారి సొంతానికి!' అని చెప్పాడు.

"నేను ఇంటికి తిరిగి వచ్చి, నా భార్యకు నేను విన్నమాట చెప్పి, ఆమెమీది ప్రేమ కొద్దీ బస్రాకు ప్రయాణమయాను. రాకపోకలకు పదిహేను రోజులు పట్టింది. అదృష్టం బాగున్నది. బస్రా తోటమాలి మూడు దీనారాలకు మూడు ఆపిల్‌పళ్లు అమ్మాడు.

"నేను సంతోషంగా నా భార్య వద్దకు వెళ్ళి, మూడు ఆపిల్‌పళ్లూ ఆమెకిచ్చాను. ఆమె వాటిని చూసి ఆనందించక, వాటిని ఉదాసీనంగా పక్కన పెట్టింది. దీన్నిబట్టీ, ఇతర లక్షణాలను బట్టీ, నేను లేని సమయంలో ఆమె జ్వరం తిరగబెట్టిందని గ్రహించాను. పదిరోజులపాటు ఆమెకు ఎంత జబ్బు చేసిందంటే, నేను ఒక్క క్షణంకూడా ఆమెవద్దనుంచి కదలలేదు. ఆ తరవాత అల్లా కటాక్షంవల్ల ఆమె వ్యాధి నిమ్మళించింది. నేను ఆమెను వదిలి నా దుకాణానికి రాగలిగాను.

"మధ్యాన్నంవేళ నేను దుకాణంలో కూర్చుని ఉండగా, చేతిలో ఒక ఆపిల్ ఎగరేసుకుంటూ ఒక నీగ్రో దుకాణం పక్కగా వచ్చాడు.

"నేను వాణ్ణి పలకరించి, 'ఆ ఆపిల్ ఎక్కడ దొరికింది. నేనుకూడా కొనాలి'' అన్నాను.

"నీగ్రో నవ్వి, 'నా ప్రియురాలిచ్చింది. ఇవాళ దాన్ని చూడబోయాను. కొంతకాలంగా జబ్బు పడిందిట ఆమె పక్కన మూడు ఆపిల్ పళ్లున్నాయి. వాటిని గురించి అడిగితే, తన మొగుడు వాటికోసం బస్రాదాకా పోయి, మూడింటినీ మూడు బంగారు దీనారాలకు కొన్నట్టు చెప్పింది. ఆమె నాకీ ఆపిల్ ఇచ్చింది,' అన్నాడు."

"మహాప్రభూ, నా కళ్లకు చీకట్లు కమ్మాయి. నేను దుకాణం మూసి, వెర్రివాడిలాగా వీధులవెంబడి నడుస్తూ మా ఇల్లు చేరాను. పక్కకేసి చూస్తే రెండే ఆపిల్‌పళ్ళున్నాయి. మూడోది ఏమయిందని నా భార్య నడిగితే, తనకు తెలియదన్నది. నీగ్రో చెప్పినది నిజమే నని నాకు తోచిపోయింది. నేను కత్తి తీసుకుని ఆమెమీద పడి, ఆమెను ముక్కలు ముక్కలుగా నరికాను. వేగంగా ఆమెను ఒక బుట్టలో పెట్టి, పైన మేలిముసుగూ, తివాసీ కప్పి, ఆ బుట్టను ఒక పెట్టెలో పెట్టి, ఆ పెట్టెను నా కంచర గాడిదమీద పెట్టి టైగ్రిస్‌కు తీసుకుపోయి, నా చేతులతోనే దాన్ని నదిలోకి తోశాను.

''అందుచేత నన్ను వెంటనే చంపెయ్యండి ఈ పాపం పరిహారం కాకపోతే అది నా మెడకు శాశ్వతంగా చుట్టుకుంటుంది.

"ఆమెను టైగ్రిస్‌లో పడేసి, ఎవరూ చూడకుండానే ఇంటికి తిరిగి వచ్చాను. అక్కడ నా పెద్దకొడుకు ఏడుస్తూ కనిపించాడు. వాడికి తన తల్లి చావు గురించి ఇంకా తెలీదని రూఢిచేసుకుని, ఎందు కేడుస్తున్నావని అడిగాను.

"అమ్మదగ్గిరఉన్న ఆపిల్ పళ్లలో ఒకటి తీసుకుని, తమ్ముళ్ళతో ఆడుకునేందుకు నదిలోకి వెళ్లాను. ఒక పెద్ద నీగ్రోవాడు ఇటుగా వచ్చి నా చేతిలో ఉన్న ఆపిల్ లాక్కుని, అదెక్కడిదని అడిగాడు. నాన్న బస్రావెళ్ళి మూడు దీనారాలు పెట్టి మూడు ఆపిల్‌పళ్ళు తెచ్చాడని చెప్పాను. అప్పటికీ వాడు దాన్ని నాకు తిరిగి ఇయ్యక, నన్ను కొట్టి పండు పటుకుపోయాడు. పండు తీసుకున్నానని అమ్మ నన్ను కొట్టుతుంది," అన్నాడు నా కొడుకు.

''ఈ మాట వినగానే, నీగ్రోవాడు నా భార్యగురించి చాలా నీచంగా అబద్ధమాడాడనీ, నేను ఆమెను నిష్కారణంగా చంపాననీ గ్రహించాను నేనూ, నా మామగారూ పక్కపక్కనే కూర్చుని అర్ధరాత్రిదాకా ఏడ్చాం. ఇవాళతో అయిదురోజులుగా మేం ఏడుస్తూనే ఉన్నాం.

''మహాప్రభూ, నేను చేసిన ఈ ఘోర పాపానికి ప్రాయశ్చిత్తం వెంటనే చెయ్యండి."

ఈ కథ విని ఖలీఫా నిర్ఘాంతపోయి, "అల్లా! నే నా నీగ్రోవాడి ప్రాణాలు తప్ప ఎవరి ప్రాణమూ తియ్యను!" అన్నాడు.

యువకుడు హత్య చేయటానికి తగినంత కారణం ఉన్నదనీ, నీగ్రో వెధవే ఈ ఘోరానికి మూలకారణమనీ ఆయనకు తోచింది.

ఆయన జఫర్‌తో, "దీని కంతకూ మూలమైన దుర్మార్గుడు ఆ నీగ్రోను పట్టుకురా. లేకపోతే, వాడికి మారుగా నిన్ను చంపుతాను," అన్నాడు.

జఫర్ ఏడుస్తూ బయలుదేరి, "నీగ్రోను ఎలా దీసుకురాను? మొదటి సారి నా అదృష్టం ఒకసారి కిందపడి పగలని కుండలాటిది. ఈసారి నాకు అల్లా తప్ప దిక్కులేదు. నాకున్న మూడు రోజులూ వెతకటంలో వ్యర్థపుచ్చక, ఇంట్లో కూచుని భగవధ్యానం చేసుకుంటాను," అనుకున్నాడు.

ఆయన మూడురోజులపాటు ఇల్లు కదలలేదు. నీగ్రోను పట్టి తీసుకురాకపోతే తన ప్రాణంతీసే ఉద్దేశాన్ని ఖలీఫా మార్చుకోలేదని తెలిసి, నాలుగోరోజున ఆయన కాజీని పిలిపించి, తన మరణశాసనం రాసి, ఏడుస్తూ తన పిల్లల కందరికీ వీడ్కోలు చెప్పాడు. ఆయన తన కడగొట్టు కుమార్తెను గట్టిగా ఆలింగనం చేసుకునేటప్పుడు ఆమె జేబులో ఏదో ఉండి, ఆయన రొమ్ముకు గట్టిగా తగిలింది. అదేమిటని ఆయన అడిగితే, "ఆపిల్ నాన్న, మన నీగ్రో రైహాన్ నాలుగురోజులనాడు నాకు రెండు దీనారాలకు అమ్మాడు," అన్నదామె.

"నీగ్రో," "ఆపిల్" అనే మాటలు వినగానే ఆయన ఆనందంతో గట్టిగా కేకపెట్టి, రైహాన్‌ను పిలవమన్నాడు.

ఆపిల్ గురించి ప్రశ్నిస్తే, రైహాన్ ఇలా చెప్పాడు.

"దొరా, కొన్ని రోజులకిందట నేను నగరంలో పోతూండగా ఒక సందులో కొందరు పిల్లలు ఆడుకుంటూ కనబడ్డారు. వాడిలో ఒకడి చేతిలో ఈ ఆపిల్ ఉన్నది. నేను దాన్ని లాక్కుని, వాణ్ణి కొట్టాను. వాడు ఏడుస్తూ, తన తండ్రి తన తల్లికోసం దీనితోబాటు మరి రెండు ఆపిల్ పళ్ళను మూడు దీనారాలు పెట్టి బస్రానుంచి కొనితెచ్చాడని చెప్పాడు. ఆమెకు జబ్బుచేసిందిట, పళ్ళు కావాలన్నదిట. నేను వాడి ఏడుపు లక్ష్యపెట్టకుండా ఆపిల్ తీసుకొచ్చి, రెండు దీనారాలకు చిన్నమ్మాయిగారికి అమ్మాను."

ఇన్ని ఆపదలకు తన బానిసే మూలకారణం అయినందుకు జఫర్ చాలా బాధపడ్డాడు. ఆయన వాణ్ణి బంధించి, తనకు వెంట్రుకవాసిలో చావు తప్పినందుకు సంతోషిస్తూ రాజభవనానికి వేగంగా వెళ్లాడు.

ఆయన ఖలీఫాకు జరిగినదంతా చెప్పాడు. అంతా విని ఖలీఫా ఆశ్చర్యం పొంది, ఈ కథను తన లేఖకుల చేత రాయించి అధికార పత్రాలలో చేర్పించాడు.

———

సాగరానికి శ్రీ కంఠాన్ని చూడాలని లేదుకాని, బజ్జికోసం వెళ్లాలని పించింది. ఇంటికి తాళం వేసిఉంది. ఎదురుగా ఉన్న కిళ్లీబడ్డీ ఆసామి పిలిచి పార్వతమ్మ యిచ్చిన అడ్రసు సాగరానికిచ్చాడు.

పార్వతమ్మ శ్రీకంఠాన్ని తన కన్న ఊరికి తీసికెళ్ళింది. సాగరానికి శ్రీకాకుళం వెళ్లడానికి ఉత్సాహంగానే ఉంది. చిన్ననాటి స్వప్నసీమ, స్వర్గసీమ. మనస్సు పరవళ్లుతొక్కింది. తాతల నాటి యిల్లుకూడా ఉంది శ్రీకాకుళంలో. నాగావళి వంతెనమీద బస్సు వెళ్తుంటే ఏట్లోకి ఉరకాలనిపించింది చిన్నప్పటి లాగ యీతలు కొట్టడానికి.

సాగరం దిగిన బస్సునుంచే సూర్య నారాయణకూడా దిగిన సంగతి సాగరానికేం తెలుసు??

వెనకటి చికాకోల్‌కాదు, శ్రీకాకుళం జిల్లాకేంద్రం. నాలుగుమేడలు లేచాయి. ఖర్చు పెట్టించేవన్నీ బాగా పెరిగాయి. వర్తకులు బలిశారు. అంతే. జీవనాధారాలేమీ పెరగలేదు. చెప్పుకోడానికి చిన్న పరిశ్రమేదీ లేదు. నలుగురు బతికే అభివృద్ధేమీ జరగలేదు. వెనకబడ్డ ప్రాంతం లక్షణాలన్నీ చెక్కుచెదరకుండా ఉన్నాయి.

తెలిసినవాళ్లెవరూ కనిపించలేదు. అంతా పైకూళ్లవాళ్లే జండాలు ఎగరవేస్తున్నారు. సాగరానికి మంచి స్నేహితుడైన చిత్రకారుడు శ్రీకాకుళంవాడే, కనిపించలేదు. ముత్యాలరావు కనిపించాడు. కోటీశ్వరాలయానికి వెళ్లారు. పెద్దగంట మోగించే ఓపిక యిప్పుడు ఎవరికీ ఉన్నట్టులేదు. సాగరం చిన్నతనంలో పరుగెత్తి ఎగిరి కొట్టేవాళ్ళు, పరీక్షల రోజులలో విద్యార్థులు మరీని. వరదభయం లేకుండా నాగావళి నది గట్టుమీద పెద్ద ప్రహరీ కట్టారు! అంతకు ముందు నది యెంతో నేత్రపర్వంగా కనిపిస్తూండేది. సంధ్యాసమయంలో యేటి ఒడ్డున సాగరం ఎంతసేపు నదీ జలాల్లో ప్రతిఫలిస్తున్న సంధ్యకాంతుల్ని చూస్తూ గడిపేవాడో తెలిసేదికాదు.

ఆంజనేయుడి గుడి అలాగే వుంది. ఇత్తడివాహనాలు చిలుంపట్టి మకిలితో నల్లబారి ఉన్నాయి

పాతఇంటికి వెళ్ళి చూసుకున్నాడు. ఇల్లుచూస్తూన్న శాస్త్రికూడా కలిశాడు. శ్రీకాకుళం సారంలేని రంగుకాగితం పువ్వులాగ కనిపించింది. సారాసీసాల అభివృద్ధి దుకాణాల్లో బాగాకనిపించింది. వినోదాలు, అందాలు, పెరిగాయి. కాలం తనకు కావలసినవాటిని సమకూర్చుకోక

ఊరుకుంటుందా? అనుకున్నాడు శ్రీకంఠం దగ్గిరికి ఉదయం వెళ్లొచ్చుఅని హోటలు లాడ్జి తీసుకున్నాడు. పక్క గదిలోకి ఒక ముసలాయన వచ్చాడు సాగరాన్ని చూసి ఎరిగున్నవాడిలాగా మందహాసం చేశాడు.

రాత్రి ప్రక్కగదిలో ముసలాయన "గోదావరీ విమలవా......" అంటూ యేదో పద్యం శ్రావ్యంగా చదువుకొంటున్నాడు. గోదావరి అన్నమాటకి సాగరం కలుక్కుమని అదోలా అయిపోయాడు. మళ్ళీ మళ్ళీ ఆ పద్యాన్నే ప్రక్కగది నుండి వింటూనే ఏదో నిద్రపోయాడు.

* * *

"పిన్నేదీ? పిన్ని రాలేదు?" అంటూ బుజ్జి అడుగుతున్నాడు సాగరాన్ని. "రాదు బుజ్జి, యిప్పుడు రాదు...... వస్తుందిలే!" అంటూ అనలేక అంటున్న సాగరాన్ని "రావయ్యా ! రా......" అంటూ తలనిండా కట్టుతోఉన్న శ్రీకంఠం సరళంగా ఆహ్వానించాడు.

శ్రీకంఠంకి గోదావరి రాసిన ఉత్తరం చూపించాడు సాగరం. శ్రీకంఠం చదువుతూ నెత్తి బాదుకున్నాడు. నోరు పెగల్చలేకుండా గుడ్లలో నీరుపెట్టుకుంటూ రెండుచేతులు మీదికెత్తి జోడిస్తూ పైకి చూస్తూ "క్షమించు తల్లీ-దావానాలంలో నన్ను మగ్గిపోనీ!" అన్నాడు. పార్వతమ్మను పిలిచి హారంతెప్పించి సాగరం ఒళ్లో పెట్టాడు. సరిగా మాట్లాడలేక పోతున్నాడు. "ఇది నాదగ్గరుంటే నన్ను కాల్చేస్తున్నది — నీ దగ్గిరుండనీ, అది గోదావరికి చెందింది. గోదావరి లేదు, దానికి నువ్వే వారసుడివి?..." అంటున్నాడు. సాగరం అయోమయంగా చూస్తున్నాడు. పార్వతమ్మ అదోలా చూస్తున్నది. బుజ్జికేదీ తెలియటంలేదు.

శ్రీకంఠం మెల్లమెల్లగా బొంగురుగా అంటున్నాడు, " 'నిర్దయ' - కోరాలనుకున్న కుంభకర్ణుడిలాగ పశ్చాత్తాపం ఎరక్కుండా ఉంటాననుకున్నాను, కాని నేనూ మామూలి వాడినే అయిపోయాను. అలాచేసింది, నీ గోదావరి. మెదడు బాగుచేసి వెళ్లిపోయింది, అవతార మూర్తిలాగ.

మొదట్నించీ నేను దుష్టుడ్నే అనుకోకు. చిన్నతనంనించీ మంచిమంచివే చదువుకున్నాను. పురాణేతిహాసాలు, సంస్కృతంకూడా బాగా చదివినవాణ్ణే. అయితే మా అక్క సావిత్రిని సూర్యనారాయణ అనే వాడెవడో లేవదీసుకెళ్లినప్పటికింకా చిన్నవాణ్ణే ఆ సూరిబాబెవడో నాకు తెలీదు, చూళ్ళేదు. ఆతర్వాత మేం ఆ ఊళ్లో తలెత్తుకు తిరగలేక — మరో ఊరికొచ్చాం.

అక్కడోనాడెవడో, "అదుగో-వాడి అక్కే లేచిపోయింది! బలే విగ్రహం. మనకు చిక్కకుండా పోయిందిలే, చాలా ట్రయ్యిచేసినా! దాంతమ్ముడే వాడు!"

అంటూ నలుగురిలోఉన్న నన్నుచూపిస్తూ అన్నాడు. నాకు ఒళ్లుతెలియని కోపం వచ్చి రెండులాగాను. గలాటా అయింది. వాడు పెద్ద ఇనపరెంచితో నా తలమీద గట్టిగా బాది చీకట్లో తప్పించుకు పారి పోయాడు. నేను ఆ దెబ్బతిని బ్రతికి బయటపడ్డాక మారిపోయాను. ఆ గాయం మచ్చ యిప్పుడు కనిపించదు, అంతా ఏకంగా కలిసిపోయింది, గోదావరి బుద్ధి తెప్పించినదాంతో. ఆ మొదటిదెబ్బకి మనుషులంటే మ్రింగేయాలనుకునే రాక్ష సుణ్ణయ్యాను, అన్నీ వక్రమైన ఆలోచ నలే వచ్చేవి. కనిపిస్తే ఆ అక్కను, ఆ సూర్యనారాయణను నరికేయాలనుకునే వాణ్ణి. కర్కోటకుల పనే బాగుందని పించింది. నేను నరకవలసిన అవసరం లేకుండానే మా అక్క చివరిదశలో ప్రాధేయంగా రాసింది. నాఅడ్రసు ఎలాగో సంపాదించి, కసితోనేదాన్ని మంటగలిపి గోదావరిని దుర్బుద్ధితోనే లాక్కొచ్చాను. ఆ సూర్యనారాయణ చచ్చాడటగానీ, మంచివిలువైన నగలే పెట్టాడు. బంగారం గొలుసును అమ్మేసి తగలేసి పాపం మిగుల్చుకున్నాను. అందుకే ఆ హారం నీదగ్గరే ఉండాలంటున్నాను......

రెండోసారి దెబ్బతో మెదడు చెడి పోయింది. తిరిగి బాగుపడింది. గోదావరి ఏ స్వర్గాన, ఎక్కడుందో తల్లి చికిత్స చేసింది—నేను పశ్చాత్తాపంతో దహించుకు పోతూ ఉండడానికి......" అంటూ శ్రీకంఠం చెప్పుకుంటూన్నప్పుడే సూర్య నారాయణ లోపలికివస్తూనే, "అనుమతి లేకుండా వచ్చానని మరేం అనుకోకండి. వయసులో పెద్దవాణ్ణి, నమస్కారాలు క్షమాపణలూ చెప్పుకోకూడదు గనక. ." అంటున్నాడు. సాగరం చూశాడు, హోటల్‌లాడ్జింగ్‌లో కనిపించని మనిషే. వయస్సుమీరినా చాలా చురుగ్గాఉన్నాడు. నుదురు అనుభవశాలి అని చెబుతూంది. మంచివాడు లాగున్నాడు.

''శ్రీకంఠంగారూ! మీరొక వజ్రాల హారాన్ని అమ్ముతారని తెలిసివచ్చాను!" అన్నాడు సూర్యనారాయణ.

"అది ఇప్పుడు నాదికాదు, అదుగో- అతనికి చెందిపోయింది ?" అన్నాడు శ్రీకంఠం.

"ఐతే ఒకపని చేయండి. యిదుగో బయానాగా ఐదువేలు నగదు—మీ దగ్గి రుంచండి. మీరు మధ్యవర్తులు—ఆయన హారం అమ్మడానికి యిష్టపడితే మిగతా యిచ్చి ఎంతకైనా కొంటాను!" అని శ్రీకంఠం ఒడిలో కరెన్సీకట్టల సంచి పెట్టేసి, సాగరాన్ని చూసి మందహాసం చేస్తూ, ''సాగరం వస్తాను!" అంటూ బాణందూసుకుపోయినట్లు వెళ్లిపోయాడు

నివ్వెరపోయి చూస్తూన్నవారు తెప్ప రిల్లి, "పిచ్చివాడు కాబోలు," అన్నాడు శ్రీకంఠం.

''కాదు!- సాగరం అన్న పేరతని కెలాగతెలుసు!" అన్నాడు సాగరం,

ఆశ్చర్య సంభ్రమాలతో. శ్రీకంఠం కరెన్సీ తనిఖీచేసి, సాగరానికే యివ్వ బోతే, హారంకూడా వద్దన్నాడుసాగరం. ''చేతులు కావివి కాళ్లు మన్నించి ఉంచు!'' అని చేతులుపట్టుకున్నాడు. ''అతడన్నట్లే చేద్దాం, జరిగేది చూద్దాం!'' అన్నాడు శ్రీకంఠం.

బుజ్జిని ముద్దాడి, మిఠాయి కొను క్కోమని పదికాగితం చేతిలోపెట్టి వీధి కేసితిరిగాడు సాగరం. "పిన్నికి రమ్మని చెప్పు! పిన్నికి చెప్పు రమ్మన్నానని..." అంటున్న బుజ్జిమాటలు వెనక విని పిస్తూంటే, "అలాగే....అలాగే...." అంటూ అశ్రువులతో వెళ్లాడు.

శ్రీకంఠం దగ్గర నోట్లకట్టచూశాక పార్వతమ్మ ముఖం కొంత కళగానేఉంది, బుజ్జిచేతిలో పదికాగితం తీసుకుంటూ, ''మానాయినే, ఇప్పుడీఊళ్లో యింకొక్కటి ఉంటే రోజుకొక హాలుకెళ్లొచ్చు. ఈవాళే క్రొత్తవి రెండు, రెండు హాళ్లలో - మొద టాటకి ఒకటి, రెండోఆటకి మరోటీ చూపిస్తాను. పద వెళ్దాం,'' అంటున్న తల్లితో "నేరాను, పిన్నిరావాలి మరి. ," అంటున్నబుజ్జిని పార్వతమ్మ లోపలికి లాక్కెళ్ళింది.

* * *

పక్క గదిలో దిగిన పెద్దమనిషి ఖాళీచేసి వెళ్ళిపోయాడట. పేరుమాత్రం తెలిసింది - సూర్యనారాయణ అని.

సాగరం కుడిభుజం అదిరిందిగాని అదేం పట్టించుకోలేదు

తొమ్మిదిమైళ్ళ దూరం స్టేషనుకి శాస్త్రితోకలసి వెళ్తూ బస్సులో ధరొస్తే ఇల్లు అమ్మేస్తానన్నాడు. వొద్దుగాక వొద్దు. తాతలుకట్టినఇల్లు తల్లిలాంటిఊరు బాగు చేసుకోవాలేగాని విడవగూడదు అన్నాడు శాస్త్రి. శాస్త్రిలాంటి స్నేహితుడు దొరకడం అదృష్టమే అనుకున్నాడు సాగరం.

రైలు కదిలింది. ప్లాట్‌ఫారంమీద నించున్న శాస్త్రి దూరదూరానికి వెళ్లి పోయాడు.

ఆపెద్దమనిషి ఎవరు? ఆ మందహాసం ఏంటి? సాగరం అన్నాదేమిటి?- రైల్లో ఒకటే తెగకుండా ఆలోచన!.



# పరుచుకున్న వెన్నెల పరుగెత్తే మనసు

కొల్లిపాక రమామణి

ఆకాశమంతా నల్లమబ్బులు కమ్ముకున్నాయి. ఎప్పుడైనా వర్షం పడవచ్చు.

సంధ్య మనసుతో కూడా దిగులు ఆవరించింది. ఉదయం లేచినదగ్గర నించీ యింటిపనులలో మునిగిపోయినా, మనసు ఎక్కడో ఆలోచిస్తూంది. ఆదివారం, పిల్లలిద్దరికీ తలంటుపోసి, తనూ తలంటుకుంది. తడి ఆరనిజుత్తు జారుముడి వేసుకుని, యిడ్లెన్లుచేసి, పిల్లలిద్దరికీ పెట్టింది.

"నువ్వు తినలేదేం అమ్మా?" అందినీల.

"తింటాను" అంది సంధ్య. కాని తినలేదు. వంట మొదలుపెట్టింది.

సన్నగా జల్లు ప్రారంభమైంది. వంటింటి కిటికీలోంచి లోపలికి పడుతోంది.

"అమ్మా, యివాళ అంకుల్ రారేమో! వర్షంలో ఎలావస్తారు?" అంది నీల తిరిగి.

తన మనసులోని భయాన్నే కూతురు చెప్పినట్టు భావించింది సంధ్య.

"ఏమో, రారేమో!" అంది నిర్లక్ష్యం

నటిస్తూ. కాని ఆమె మనసంతా అతని ఆగమనానికి ఆత్రుతపడుతోంది.

నీల కాలుగాలినపిల్లిలా యిల్లంతా తిరుగుతోంది.

"అమ్మా, బావుందా?" బాబు తల్లి కొంగు పట్టుకులాగాడు . వాడి రెండో చేతిలో డ్రాయింగ్ పుస్తకం, దానిలో బఫూన్‌బొమ్మ. చేతులనిండా, బట్టల నిండా నీటి రంగులు ఆ చేత్తోనే ముక్కు తుడుచుకున్నట్టున్నాడు. ముక్కు చివ రంతా ఆకుపచ్చరంగు. సంధ్య నవ్వింది. "ఆఁ బాగుంది. నువ్వేబఫూన్‌లా ఉన్నావు. పోయి ముఖం, చేతులు కడుక్కో" అంది.

"అంకుల్‌కి చూపిస్తా. అమ్మా, అంకుల్ మనని యివాళ సర్కస్‌కి తీసుకువెళతారా?" వాడి కళ్ళనిండా ఆశ.

"అసలు అంకుల్ యివాళ వస్తారో రారో!"

"ఎందుకు రారు? క్రిందటి ఆదివారం చెప్పారుగా, యివాళవచ్చి మనందరినీ సర్కసుకి తీసుకువెళతానని!" వాడికి అంకుల్‌మీద ఎంత నమ్మకం!

బాబు ముఖంకడుక్కోడానికి నీళ్ళగది లోకి వెళ్ళాడు. కాలింగ్ బెల్ మ్రోగింది.

''అరుగో అంకుల్ వచ్చారు" బాబు తుర్రుమన్నాడు. నీల దబదబ పరుగెత్తిన చప్పుడు, తలుపుతీసిన శబ్దం.

"హలో నీలా, హలో బాబూ" శంకర్ గొంతు. పిల్లలిద్దరి నవ్వులు. సంధ్య గుండె దడదడ లాడింది.

"అయ్యో, అంకుల్ మీరు పూర్తిగా తడిసిపోయారే! తువాలు తీసుకు రానా ?" నీల.

సంధ్య తువాలు తీసుకొని ముందు గదిలోకి వచ్చింది. శంకర్ పూర్తిగా తడిసిపోయాడు. తలమీదనించి నీళ్ళు క్రిందికి కారుతున్నాయి. ఆమెకి కష్టం తోచింది. అతని కళ్ళు ఆమె కళ్ళతో కలుసుకున్నాయి. అతని కళ్ళలోకి మెరుపు వచ్చింది. "హలో, సంధ్యా" పలకరింపుకి, ఆమెనవ్వికళ్ళువాల్చుకుంది.

"నీలా, అంకుల్‌కి తువాలు యివ్వు. నేను కాఫీచేసి తెస్తా."

వడి వడిగా వంటింట్లోకి నడిచింది సంధ్య. గాస్ స్టౌ వెలిగించి, ఒకవైపు యిడ్లెన్నగిన్నె పెట్టింది. రెండో ప్రక్క కాఫీకి నీళ్లు పడేసింది.

వాళ్ళది మేడమీద రెండో అంతస్థులో పోర్షను. పడకగది, డ్రాయింగ్ రూమ్, రెంటినీ ఆనుకుని వీధివైపుకి రెండు బాల్కనీలు. బాల్కనీలో కూచుని చూస్తే వీధి చక్కగా కనిపిస్తుంది. పడక గది మధూ, అతని భార్య లీల వాడు కుంటారు. డ్రాయింగ్‌రూమ్ రాత్రికి సంధ్యకి, పిల్లలకి పడకగదిగా మారు తుంది.

శంకర్, పిల్లలూ డ్రాయింగ్‌రూమ్‌లో కూచున్నారు. అక్కడ ఏంచేస్తున్నారో

కాని, వాళ్లు ముగ్గురూ నవ్వుతున్నారు. పిల్లల నవ్వులతో యిల్లంతా నిండి పోయింది. అప్పటిదాకా నిశ్శబ్దంగా వున్న ఆ యింటికి ఒక్కసారి చైతన్యం వచ్చినట్టు వుంది.

జుత్తు ఒక్కసారి వేళ్ళతోనే సవరించుకుని, యిడ్డెన్లప్లేటు పట్టుకుని డ్రాయింగ్‌రూమ్‌లోకి బయలుదేరింది సంధ్య. ఆమె కాళ్ళు తడబడ్డాయి.

గదిలో ఒక్కసారి మాటలు ఆగిపోయాయి. పిల్లలిద్దరూ నవ్వును బిగపెట్టుకున్నారు. ఆమె ఆశ్చర్యంగా అతని వైపు చూసింది. అతని కళ్ళలో కొంటెతనం.

"అమ్మా, అంకుల్‌ని చూడు" బాబు కిసుక్కున నవ్వాడు. నీల కిలకిలా నవ్వింది.

సంధ్యగమనించలేదు. శంకర్ పాంట్ స్థానంలో సంధ్య చీరను నాలుగుగా మడిచి లుంగీలా కట్టుకున్నాడు. పైన తువ్వాలు కప్పుకున్నాడు. అతని పాంటూ, షర్టూ వరండాలో తాడుమీద వ్రేలాడుతున్నాయి.

శంకర్ రూపుచూసి సంధ్య నవ్వు అణచుకోలేకపోయింది. గట్టిగానే నవ్వింది. ఆ నవ్వుతో యింతవరకూ వున్న సంకోచం పోయింది.

అతనుమాత్రం ఏంచేస్తాడు? మధు లుంగీలు కట్టడు. అతని పైజామాలు శంకర్‌కి సరిపోవు. శంకర్ మంచి పొడుగు.

"తీసుకోండి," అంది యిడ్డన్ల ప్లేటు బల్లమీద పెడుతూ. "వెరీగుడ్. వేడి వేడి యిడ్డెన్లూ, కొబ్బరిపచ్చడీ." సంతోషంగా అతను పళ్ళెం ముందుకు లాక్కున్నాడు. కొబ్బరి పచ్చడంటే అతని కిష్టమని ఆమెకు తెలుసు.

"పిల్లలూ, మీరో? మీరూ యిడ్డెన్లు తెచ్చుకోండి."

"మేం యిందాకే తినేసాం అంకుల్. అమ్మే తినలేదు."

"తొందరగా మీ ప్లేటూ తెచ్చుకోండి" అన్నాడతను. చెయ్యి వెనక్కి తీసుకుని, సోఫాలో వెనక్కి వాలుతూ.

"ఊహుఁ మీరు తినండి. మీకు నేను కాఫీ కలిపి తీసుకువస్తా." సమాధానం కోసం ఆగకుండా వెనక్కి తిరిగిందామె.

"మీ అమ్మకి నేనంటే యిష్టంలేదు, చూశావా నీలా! నాతో కూచుని యిడ్డెన్లు తినదుట." సన్నగా నవ్వాడు శంకర్.

"అమ్మకి మీరంటే చాలా యిష్టం అంకుల్."

"నీ కెలా తెలుసూ?" కొంటెగా అడిగాడు.

నీల తెల్లమొహం వేసింది. అతను నవ్వేసాడు. పిల్లలిద్దరూ నవ్వారు.

ఆ గదిగుమ్మం దాటుతున్న సంధ్యకి వారి మాటలు వినపడ్డాయి. తాను ఎక్కడో హృదయకుహరంలో

గుప్తంగా దాచుకున్న మాటలు ఎవరో వెలికితీసి, గట్టిగా చదివేసినట్టు ఆమె భయపడింది. నీలమీద పట్టరానంత కోపంవచ్చింది. సిగ్గుతో తిరిగి వంటిల్లు దాటి ముందరికి రాలేకపోయింది. కూతురిచేత శంకర్ కి కాఫీ పంపించింది.

ఆమె వంట అయేసరికి పదకొండు దాటింది. అప్పటికి వర్షంకూడా తగ్గు ముఖం పట్టింది.

"బాబూ, భోజనానికి వస్తారా?" లోపలినించే పిలిచింది సంధ్య.

''అంకుల్ మీరూ రండి''నీల పిలుపు.

"ఇప్పుడేకదా నేను యిడ్లీ తిన్నాను. మీరు తినండి"

"ఉహుఁ. మీరూ మాతో తినాలి అంకుల్" నీల మారాం.

"పదండి. నేనూ మీతో డైనింగ్ టేబిల్ దగ్గిర కూచుంటా."

శంకర్ యిద్దరు పిల్లలినీ చెరో చేత్తో పట్టుకుని వంటింట్లోకి వచ్చాడు.

వారి వంటిల్లు పెద్దదే. ఒకవైపు వంటకీ, రెండోప్రక్క భోజనాల బల్లకీ సదుపాయంగా వుంది.

పిల్లలిద్దరూ భోజనాలకి కూర్చున్నారు.

"ఛ, యిదేంకూర? నాకొద్దు" అంది నీల.

"బంగాళదుంపలు, నీ కిష్టమేకదా!'' అంది సంధ్య.

"వేపుడు చేయలేదేం? ఈ ముద్ద కూరేంటి? లీలత్త అయితే చక్కగా వేయించి పెడుతుంది."

"రోజూ వేపుడేనా? ఈ మసాలా కూరకూడా ఎంతో బాగుంటుంది."

నీల నసుగుతూ కొంచెం కూర తిని, వదిలిపెట్టేసింది. "ఆ కూరంతా తినెయ్యాలి. ఏదీ పారెయ్యకూడదు. బాగా తింటేనే నేను మిమ్మల్ని సర్కస్ కి తీసుకువెళతా" శంకర్ బెదిరించాడు.

నీల బుంగమూతిపెట్టి, అయిష్టంగానే కూర తినేసింది.

"ఎన్ని గంటలకు వెళదాం అంకుల్?" బాబు తొందర.

"తొందరగా భోజనంచేసి, నువ్వూ, అక్కా కాసేపు పడుకోండి. నాలుగింటికి బయలుదేరుదాం."

"ఉహుఁ నాకునిద్రరాదు అంకుల్."

''ఇప్పుడు పడుకోపోతే, మళ్ళీ రాత్రి సర్కస్ లో నిద్రపోతారు. ఆఖర్నే మంచి మంచి మోటార్ సైకిల్ ఫీట్స్ వున్నాయి."

"అంకుల్ నేను పడుకుంటా" నీల.

''నేనూ నిద్రపోతా" బాబు.

''అలా ఉండాలి మంచి పిల్లలంటే."

సంధ్య పిల్లలిద్దరికీ చేతులు కడిగి, తుడిచింది. శంకర్ పిల్లలను తీసుకుని పడకగదిలోకి వెళ్ళాడు.

ఆమె కంచాలు కడిగి, టేబిల్ శుభ్రంచేసి, అతనికోసం కంచం పెట్టింది.

"అదేమిటి ఒకటే పెట్టారు? మీరు

తినరా! నేను ఒంటరిగా కూచుని తినను" శంకర్ వంటింటి గుమ్మానికి చెయ్యి ఆన్చి నుంచున్నాడు.

సంధ్య మాట్లాడలేదు. మౌనంగా యింకో కంచం పెట్టింది. తాను కలసి తిననంటే, అతను భోజనం చెయ్యడు. కాని ఒంటరిగా అతని ఎదురుగా కూర్చుని భోజనం చెయ్యాలంటే ఏదో సంకోచం.

"పిల్లలిద్దరూ యిట్టే పడుకున్నారు" అన్నాడు శంకర్, అన్నం కలుపుతూ.

ఇల్లు నిద్రపోతున్నట్టు నిశ్శబ్దంగా వుంది. "కూర చాలా బాగుంది" అతను మళ్ళీ కూర వడ్డించుకున్నాడు.

శంకర్, మధు స్నేహితుడు. ప్రతి ఆదివారం వారింటికి వస్తాడు. వారితో రోజంతా గడుపుతాడు. మధుతో, లీలతో సంధ్యతో కలిసి భోజనం చేస్తాడు సాయంత్రం పిల్లలను స్కూటర్ మీద ఎక్కడికేనా తీసుకువెళ్ళితిప్పుకువస్తాడు. పిల్లలు ఎంతో ఉత్సాహంతో అతని రాకకు ఎదురుచూస్తారు. అతను రాని ఆదివారం లేదు.

"మధు దగ్గరనించి ఉత్తరం వచ్చిందా?"

"ఆఁ, అన్నయ్య ఒంటరిగా యిర వయ్యోతారీకు యిక్కడకు వస్తాడట. వదిన అటునుంచి అటే ఏలూరు వెళ్ళి, ఓ పదిహేనురోజులు వుండి వస్తుందిట."

"మధు వచ్చేసరికి నేను ఉండను." ఆగాడతను. ఆమె ప్రశ్నార్థకంగా అతనివైపు చూసింది.

"రేపు నేను బొంబాయివెళుతున్నాను. ఆఫీసువాళ్ళు పంపుతున్నారు. నిన్ననే వెళ్ళవలసింది. కాని రేపటికి వాయిదా వేయించుకున్నాను"

"మళ్ళీ ఎప్పుడు వస్తారు?" ఆమె కంఠంలో ఆతృత దాచుకుందామన్నా దాగలేదు.

"ఓ నెలరోజు లవుతుందేమో!"

"అన్ని రోజులే!" ఆమె తినడం మానేసింది.

"పని తొందరలో అయిపోతే ముందు గానే వచ్చేస్తా." అతను ఆమె కళ్ళలో భావాన్ని గమనించాడు.

"పిల్లలు మీకోసం ఎదురుచూస్తారు" అంది ఆమె, అతని చూపులని తప్పించు కుంటూ.

"నాకు తెలుసు" అతను మెల్లిగా నవ్వాడు.

ఆమె నాలుగు మెతుకులు కతికి భోజనం అయిందనిపించింది.

"అరె! అప్పుడే మజ్జిగ వడ్డించు కున్నారు! ఇవాళ మెయిల్ స్పీడులో తినేసారే!" అన్నాడతను.

ఆమె నవ్వేసింది.

"సాయంత్రం మీరూ సర్కస్‌కి రావాలి." శంకర్ లేచి, చెయ్యికడు క్కున్నాడు.

"నేను రాను'' అంది తల అడ్డంగా తిప్పుతూ సంధ్య.

"రావాలి. ఒంటరిగా మీరు యింట్లో కూచుని ఏంచేస్తారు." అతను వంటిల్లు దాటాడు.

వంటిల్లు సర్ది, సంధ్య పడకగదిలో పిల్లలమధ్య నడుం వాల్చింది. శంకర్ డ్రాయింగ్‌రూమ్‌లో సోఫామీద దిండు పెట్టుకుని, వెనక్కివాలి పేపరు చదువుతున్నాడు.

శంకర్ ఎప్పుడూ ఆమెతో ఎక్కువగా మాట్లాడడు. కాని మౌనంగా అతను చూపే ఆదరణ, అనురాగం ఆమె హృదయాన్ని తాకుతుంది.

నీల, బాబు లేచారు. వాళ్ళకి ఒకటే హుషారు. పాలు తాగేశారు బట్టలు వెయ్యమని తల్లిని వేధించారు.

"అంకుల్, నా ఎర్రగౌను చూడు, ఎంత బాగుందో," అంది నీల పరుగెత్తుకుని శంకర్ దగ్గిరికి వెళ్ళి.

"చాలా బాగుంది. మరి మీ అమ్మ కూడా రెడీయేనా? అమ్మకూడా మనతో సర్కస్‌కి వస్తానంది" శంకర్ మాటలు వంటింట్లో బ్రెడ్ సాండ్‌విచెస్ చేస్తున్న సంధ్యకి గట్టిగా వినిపించాయి. అతను కావాలనే అబద్ధం చెప్తున్నాడు.

"నేనలా అనలేదు'' అని పిల్లలతో చెప్పలేదు తాను. కాని అతనితో ఒంటరిగా బయటకు వెళ్ళడమా? ఆమె సందిగ్ధంలో పడింది.

"ఓ అమ్మకూడా వస్తోందా!" పిల్లలిద్దరూ గెంతులు వేశారు.

"అమ్మా, నువుకూడా వస్తున్నావా? తొందరగా తయారవమంటున్నారు అంకుల్."

సంధ్యకి అతనిమీద కోపం వచ్చింది. అయినా నిస్సహాయత. అభిమానంతో అతను ఆమెని జయించగలడు.

బట్టలు మార్చుకుని బయటికివచ్చింది పిల్లలూ, శంకర్ గుమ్మందగ్గరే ఎదురు చూస్తున్నారు.

అతను ఆమెని చూశాడు. ఆడంబరం లేని అలంకరణ. అయినా ఆమె అలంకరణలో ఆకర్షణవుంది. పసుపు అంచు వున్న ఆకుపచ్చచీర కట్టుకుంది. పసుపు రంగు జాకెట్టు. నుదుట కనీ కనిపించనట్టువున్న చిన్న నల్లచుక్క. జుట్టు సాఫీగాదువ్వి, చిన్నముడి వేసుకుంది.

"నీలా, నువ్వూ, నేనూ బస్‌మీద వెళదాం" అంది సంధ్య తలుపువేస్తూ.

"అంకుల్ స్కూటర్ వుంది. కదమ్మా! అందరం వెళ్ళిపోదాం."

"మనందరం ఒక స్కూటర్‌మీద పట్టం."

"ఎందుకు పట్టం? రింకు, టింకు, పింకు, వాళ్ళమమ్మీ, డాడీ అందరూ కలిసి ఒకే స్కూటర్‌మీద వెళతారుగా!"

సంధ్య విసుక్కుంది "నీలా, నీక్కాదూ చెపుతూంట? మనం బస్‌మీద పోదాం రా."

నీల అయిష్టంగా చూసింది.

"అరె! నీలా, మీ అమ్మకి స్కూటర్ ఎక్కడమంటే భయం. అందుకే రానంటూంది. మీరు బస్ మీద వచ్చెయ్యండి."

శంకర్ పరిస్థితిని కాపాడాడు.

నీలా, బాబూ నవ్వారు.

"అమ్మకి స్కూటరంటే భయం" బాబు గట్టిగా నవ్వాడు.

నీల, సంధ్య బస్‌మీద సర్కస్ డేరాలు చేరారు. పిల్లలిద్దరూ మధ్యన కూచుంటే, శంకర్, సంధ్యా వాళ్ళకి చెరొకవైపున కూర్చుని సర్కస్ చూశారు. ఓ మూడుగంటలు వాళ్ళు నలుగురూ తక్కిన ప్రపంచాన్ని మరిచిపోయారు. తను పెద్దవాడయ్యాక బఫూన్ కాబోతున్నట్టు బాబు తన నిర్ణయాన్ని ప్రకటించేసాడు.

సర్కస్ పూర్తయేసరికి పిల్లలిద్దరికీ నిద్రకళ్ళు పడ్డాయి. హోటల్‌లో ఏకంగా భోజనంచేసి, యింటికి వెళదామన్నాడు శంకర్. బసుల్లో చాలా రష్ ఉండటం వల్లశంకర్ స్కూటర్‌మీద పిల్లలతో పాటు కూచోక తప్పలేదు సంధ్యకి.

"అమ్మా! రోజూ ఆదివారం అయితే బాగుండును" అంది నీల, హోటల్లో తందూరీ రొట్టెలు తింటూ.

"ఎందుకూ?"

"రోజూ అంకుల్ వస్తారుగా!"

శంకర్ గట్టిగా నవ్వి, ఎడంచెయ్యి నీల తలమీద ప్రేమగా వేసాడు.

సంధ్య కూడా నవ్వి, కళ్ళు వాల్చుకుంది.

భోజనంచేసి, యిల్లు చేరేసరికి రాత్రి పదకొండు దాటింది. బాబుని భుజంమీద వేసుకుని లోపలికి తీసుకువచ్చి పడుకోబెట్టాడు శంకర్. నిద్రలో తూలుతున్న నీలను నడిపించుకు వచ్చింది సంధ్య.

"కొద్దిగా మంచినీళ్ళు కావాలి."

సంధ్య వంటింట్లోకి వెళ్ళి గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చేసరికి అతను వీధివైపు బాల్కనీలో పిట్టగోడ నానుకుని నుంచున్నాడు. ఆమె గ్లాసు అతనికి అందించి వెనక్కి తిరిగింది.

"సంధ్యా!"

ఆమె ఆగి అతనివైపు చూసింది. అతను దూరంగా ఎక్కడో చూస్తున్నాడు. ప్రొద్దుటి వర్షం ప్రభావం కావచ్చు-ఎవరో ఆకాశాన్ని శుభ్రంగా కడిగి, రంగువేసినట్టు స్వచ్ఛమైన నీలి రంగుతో అందంగావుంది. నక్షత్రాల కాంతి ఆ రంగుకి మెరుపు పూత పూసినట్టు వుంది. లెక్కలేనన్ని నక్షత్రాలను చూస్తూ "అమావాస్యనాడు కూడా ఆకాశం ఎంత బాగుంటుంది!" అనుకుంది సంధ్య.

అతను హఠాత్తుగా ఆమెవైపు తిరిగాడు.



"సంధ్యా నన్ను పెళ్ళిచేసుకోడానికి మీకేమైనా అభ్యంతరమా!"

అతని మాటలు వింటూనే ఆమె పారిపోయింది. ఎప్పుడో ఒకప్పుడు యీమాట అతని నోటినుంచి వస్తుందని తెలుసు. కాని ఆ రోజు యీరోజే అవుతుందనుకోలేదు. ఆసరా కావాలి అన్నట్టు బాల్కనీ గోడని పట్టుకు నుంచుంది. పిట్టగోడ మీదనున్న ఆమె చేతులు వణికాయి. ఆమెవి చిన్న చేతులు. వణుకుతున్న ఆ చేతుల దగ్గిరకి అతని బలమైన చేయి కదిలింది. కాని మధ్యలోనే అతనిచెయ్యి ఆగిపోయింది.

"నన్ను కొంచెం ఆలోచించుకోనీండి."

"మీకు కావలసినంత టైము యిస్తున్నాను. నేను బొంబాయినించి రాగానే మాత్రం మీ సమాధానంకోసం ఎదురు చూస్తా. నాకు సుముఖంగానే మీ జవాబు ఉంటుందని ఆశిస్తా. మధుతో తర్వాత మాట్లాడుతా. వస్తా." అతను గబగబా వెనక్కి తిరిగి బయటి గుమ్మందాకా వెళ్ళాడు. ఒక్క క్షణం ఆగి "సంధ్యా" అని పిలిచి, ఏదో చెప్పబోయాడు. ఆమె అతనివైపు తిరిగింది. అతని కళ్ళనిండా ఆమెమీద ఆరాధన.

"అచ్చా. గుడ్‌నైట్. ఉత్తరం రాస్తా. జవాబు రాస్తారుగా?"

"రాస్తా" అన్నట్టు ఆమె తల వూగించింది.

అతను తలుపు తీసుకుని బయటకు వెళ్ళిపోయాడు. తలుపువేసి, ఆమె తిరిగి బాల్కనీ దగ్గరకివచ్చి, క్రిందికి చూసింది. శంకర్ వచ్చి స్కూటర్ స్టార్ట్‌చేసి, ఎక్కి కూర్చున్నాడు. అతను తల పైకి ఎత్తిచూసాడు. సంధ్య గబుక్కున స్తంభం ప్రక్కకి తప్పు కుంది. అతని పెదవులమీదికి చిరునవ్వు ప్రాకింది.

* * *

## 2

''అనిల్, పిల్లలను తీసుకుని అలా తిప్పుకురారా. తెల్ల సింహాన్ని చూసి రండి" అంటూ లలిత పిల్లలను పంపేసింది.

లలితా, సంధ్యా 'జూ'లో కూచున్నారు. 'జూ' పెద్దది. చాలా మంది జనం వచ్చారు. అయినా అంత మందిలోనూ వాళ్ళకి ఏకాంతం దొరుకు తుంది. పిల్లలు జంతువులను చూస్తూ రెండు మూడుగంటలు తల్లులను వేధించరు.

స్నేహితురాళ్ళిద్దరూ పచ్చగడ్డిలో కూచున్నారు. వారికి కొద్దిదూరంలో ఎఱ్ఱముక్కు తెల్లకొంగలు నీటిలో జలకాలాడుతున్నాయి. లలిత అల్లుతున్న స్వెటర్ వుంది.

"చెప్పమ్మాయ్" అంది లలిత.

"ఏంచెప్పను?" కొంగలను చూస్తూ అంది సంధ్య.

"ఈ మధ్య ఏదో జరిగింది."

"ఎక్కడ?"

"నీ జీవితంలో."

"నా జీవితంలోనా?'' సంధ్య ఆశ్చర్యం ప్రకటించింది.

"ఈ మధ్య నువ్వు చాలా పరాకుగా వుంటున్నావు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ వుంటావు. ఏమిటా ఆలోచన?"

"నీ కేమని చెప్పను లలితా!"

"నేను చెప్పనా?'' లలిత నవ్వింది.

"ఊఁ.''

"శంకర్ నిన్ను పెళ్ళిచేసుకోమని అడిగాడుకదూ? అవునా,"

"అవును" సంధ్య ముఖం ఎఱ్ఱబడింది.

"నువ్వేమన్నావు?''

"నేనేం చెప్పలేదు లలితా. నేనెటూ నిర్ణయించుకోలేకుండా వున్నాను."

లలిత మౌనంగా వూలు అల్లుతూ కూర్చుంది.

"స్త్రీ జీవితంలో ఒకేసారి ఒకే పురుషుణ్ణి ప్రేమిస్తుంది అంటారు. నిజమేనా లలితా? ఆ మాటలు నువ్వు నమ్ముతావా,"

"నేను నమ్మను."

"వివాహితురాలు భర్త నికాక, పరాయి వ్యక్తిని ప్రేమించడం మహా పాప మంటావా?"

లలిత గలగలా నవ్వింది. "అంత ఘోరమైన నేరం కాదులే."

"నీకంతా హాస్యంగా వుంది." కోపం తెచ్చుకుంది సంధ్య

"నాకు సరదాగానే వుంది మరి నీకేదో పెద్ద కొండంత సమస్య ఎదురైనట్టు తలపట్టుకు కూర్చుంటే, చూడ్డానికి నాకు తమాషాగానే వుంది."

"నాకు సమస్య లేదంటావా?" ఆశ్చర్యంగా, బాధగా చూసింది సంధ్య.

"నీ కొచ్చిన కష్టమేమిటమ్మాయ్? నీ పిల్లలకి తండ్రిలేడు. నీవు నాలుగేళ్ళుగా అన్నా, వదినలమీద ఆధారపడివున్నావు. ఇప్పుడు నీ సంసారంలో సత్యం ఖాళీ చేసిన స్థానంలోకి శంకర్ వస్తానంటున్నాడు. నీకు తోడుగా నీడగా వుంటానంటున్నాడు. నీ పిల్లలకి తండ్రినౌతానంటున్నాడు. ఒంటరిగా, భారంగా నడుస్తున్న నీకు అతను చేతులు అందిస్తానంటున్నాడు. ఆ బలమైన చేతులను అందుకోకుండా తటపటాయించడం నీ అవివేకం."

''ఎంత తేలిగ్గా చెప్పావు లలితా? నేను రాత్రిళ్ళు నిద్రపట్టక ఎంత కుమిలిపోతున్నానో నీకేం తెలుసు!"

"ఎందుకుట?"

"ఇద్దరు పిల్లలతో మళ్ళీ పెళ్ళా? నాకేమిటో పాపంచేస్తున్నట్టు భయంగా వుంటోంది."

"ఏం పాపం చేస్తున్నావు?''

"సత్యానికి అన్యాయం చేస్తున్నట్టు అనిపిస్తుంది.''

"సత్యానికి నువ్వేలా ద్రోహం చేస్తున్నావు సంధ్యా? అతనికి నూరేళ్ళు నిండాయి. అతని దారి అతను చూసుకున్నాడు. ఒంటరిగా మిగిలిపోయింది నువ్వు. నీ కిప్పుడు ఎన్నేళ్ళు? ఇరవై ఎనిమిదికదూ? ఇంకా నీ నిండుజీవితం, ఒడుదుడుకులు, ముసలితనం ముందరే ఉన్నాయి. ఎన్నాళ్ళని మీ అన్నా, వదినల మీద ఆధారపడి వుంటావు? మధూ, లీలా మంచివారే అనుకో! కాని వారి సంసారం పెద్దదిగా పెరిగి, ఆర్థిక యిబ్బందులు చికాకుపెడితే ఎవరి మనసు ఎలా మారుతుందో చెప్పలేం. నువ్వీ చిన్న ఉద్యోగం చేస్తూ, నీ కాళ్ళమీద నువ్వు నిలబడగలవా? నీకు తోడు కావాలని వుండదా? భార్య చనిపోయిన మగవాడు రెండో పెళ్ళి చేసుకుంటే మనం తప్పు పడుతున్నామా? పైగా 'మంచిపని చేసాడు. ఒంటరిగా ఎన్నాళ్ళు ఉండగలడు?' అంటున్నాం. అదే పరిస్థితులలో స్త్రీ తిరిగి ఎందుకు వివాహం చేసుకోకూడదూ? విశాల హృదయుడు, శంకర్ లాంటివాడు సహచరుడుగా లభిస్తే నీ జీవితం ఎంతో సుఖమయ మవుతుందికదూ?"

"నీకు తెలియదు లలితా! ఎన్నో భయాలు. పిల్లలు యీ క్రొత్త పరిస్థితులకి తట్టుకోగలరా? తెలిసినవాళ్ళంతా ఏమనుకుంటారు?"

"పిల్లల విషయంలో నీవు నిశ్చింత వహించవచ్చు. అతనికి వాళ్ళంటే యిష్టం, పిల్లలకి శంకర్ అంటే ఆపేక్ష. అతను వాళ్ళని సర్దుకోగలడు. పోతే సంఘానికి నువ్వు భయపడటం తెలివి తక్కువతనం. నువ్వు తప్పుచేయటం లేదని మనస్ఫూర్తిగా నమ్మినపుడు, యింకో వ్యక్తికి హానిచెయ్యనపుడు నిన్నెవరూ ఏమి చెయ్యలేరు. మంచి పనికి ఎప్పుడూ భగవంతుడి సహాయం, సహృదయుల తోడ్పాటు ఉంటుంది."

"నువ్వన్ని సమస్యలనీ ఎంతో సుళువుగా పరిష్కరించేస్తున్నావ్. బహుశః అవి నీ సమస్యలుకాక, ఎదుటి వ్యక్తి సమస్యలు కావటంవల్లేమో!"

లలిత నవ్వింది. "అది నిజం సంధ్యా. ఎదుటివారి సమస్యలు గోరంతలుగా, మనవ్యక్తిగత సమస్యలు కొండంతలుగా ప్రతీవారికీ తోచడం సహజం."

"అన్నిటికంటె పెద్దసమస్య ఒకటి వుంది లలితా." అని సంధ్య మౌనంగా వుండిపోయింది.

"ఏమిటి?"

సంధ్య ఏదో చెప్పనా, వద్దా అని తటపటాయిస్తోంది. ఆమె పరిస్థితి గమనించి గట్టిగా నవ్వింది స్నేహితురాలు.

"ఏమిటోయ్? నా దగ్గిర అంత సంశయం?"

"ఏమీలేదు" సంధ్య తల విదిలించేసి వూరుకుంది.

"నీకు శంకర్ అంటే యిష్టంకదూ?" లలిత రెట్టించింది.

"నా గురించి ఆలోచించుకుంటూ వుంటే నాకే అర్థంకాదు లలితా. సత్యాన్ని పెళ్ళిచేసుకున్నాను. మూడేళ్ళు కాపురంచేశాను. ఇద్దరు పిల్లలకి తల్లి నయ్యాను. ఇప్పుడు నా జీవితంలో యీ విపరీతం ఏమిటి? భగవంతుడు నాకెందుకీ పరీక్ష పెట్టాడు? అతనియెడల నాకీ ఆకర్షణ ఏమిటి? నాది చంచలమైన మనసా? నా మనసు నేను చెప్పినమాట వినదు. నామీద నాకే కోపంవస్తుంది. వైరాగ్యంలో పడవలసిన నా మనసు, రాగబంధంవైపు ఎందుకు పరుగెడుతోంది? నన్ను నేను సంబాళించుకోలేక, పరిస్థితులతో రాజీపడలేక నలిగిపోతున్నాను." సంధ్య కళ్ళలో నీళ్ళు నిండుకున్నాయి.

"పిచ్చిపిల్లా బాధపడకు. స్త్రీకి భర్తే జీవితమనీ, అతని తోడిదే లోకమనీ, భర్తృవియోగమైతే అతని స్మృతులతో భార్య శేషజీవితాన్ని గడిపేయాలనీ—యిలాంటి పురాతన భావాలు మన రక్తంలో జీర్ణించుకుపోయాయి. నీ మనసు ఆ భావాలని వ్యతిరేకిస్తోంది. నీలో విప్లవం వుంది. పాత, క్రొత్త

భావాల మధ్య మనసు నలిగిపోవడం సహజం కాని నువ్వు తప్పుచేస్తున్నట్టు నేను కొంచెంకూడా అనుకోటంలేదు. ఒంటరితనం భరించటం కష్టం మంచి జంట దొరికే అవకాశం ఉన్నప్పుడు ఒం టరిగా వుండిపోవడం అనవసరం. ఇంతకీ ఎంతమంది స్త్రీలకి యిలాంటి అవకాశం వస్తుంది? ఇంకోమాట చెప్పనా? సత్యాన్ని నీ తల్లిదండ్రులు ఎంచి నీకు భర్తగా చేసారు. శంకర్ నీమనసుకి నచ్చినవ్యక్తి, నువ్వు కోరుకున్న గుణాలుకలవాడు."

"ఒకసారి కాపరం అలా మంట కలిసాక, మళ్ళీ యింకో బంధం కలి పించుకోవాలంటే ఏదో తెలియనిభయం లలితా," సంధ్య రుమాలుతో కళ్ళు తుడుచుకుంది

"ఇల్లు కూలిపోయిందే అనుకో! అలా అని చెట్టుక్రింద ఎన్నాళ్ళు నిలబడతాం? స్తోమతవుంటే యింకో యిల్లు కట్టుకో డానికి ప్రయత్నించమా?" సంధ్య చేయి తన చేతిలోకి తీసుకుని నొక్కుతూ అంది లలిత. స్నేహితురాలి వాత్సల్యం ఆమెకి మనోనిబ్బరాన్నిచ్చింది.

దూరంగా పిల్లలు రావడం కని పించింది.

"తొందరలో శుభవార్త తెలియ బరచు అవివేకంగా అందిన అవకాశాన్ని జారవిడుచుకోకు. శంకర్ చాలా మంచి వాడు" అంటూ లేచింది లలిత

లలితలాంటి దగ్గరస్నేహితురాలికి కూడా చెప్పుకోలేని భయం ఒకటి సంధ్య హృదయంలో అలాగే వుండి పోయింది.

* * *

### 3

మూడు నెలల తర్వాత 'మే' నెలలో శంకర్, సంధ్యా భార్యాభర్తలయ్యారు. శంకర్, మధుతో ఆలోచించి బొంబా యికి బదిలీ చేయించుకున్నాడు. క్రొత్త ప్రదేశంలో ఉద్యోగంలో చేరేముందు పదిహేను రోజులు సెలవు తీసుకుని ముసోరి ప్రయాణం పెట్టాడు.

ఆ రోజు ఉదయం పదకొండు గంటలకి రిజిష్ట్రారు ఆఫీసుకి వెళ్ళారు. సంధ్య వైపునించి మధు, లీల, లలితా, శంకర్ వైపునించి అతని స్నేహితుడు గోకుల్ వారి వివాహానికి సాక్ష్యులుగా నిలిచారు. లీల నూతన దంపతుల గౌర వార్థం యింట్లోనే పెద్దఎత్తున విందు భోజనం ఏర్పాటుచేసింది. ఆడబడచుకు క్రొత్త చీరా, పసుపూ, కుంకుమా యిచ్చి ఆదరించింది

శంకర్, సంధ్యా రాత్రి ముసోరీ ఎక్స్‌ప్రెస్‌లో డెహరాడూన్ బయలు దేరారు. పిల్లలని తమదగ్గిర వుంచు కుంటామన్నారు మధూ, లీలా కాని శంకర్, సంధ్యా యిద్దరూకూడా యిష్ట పడలేదు. పిల్లలతోనే తరలివెళ్ళారు. సంధ్య తాను చేస్తున్న ఉద్యోగానికి రాజీనామా యిచ్చింది.

మర్నాడు ఉదయం పదిగంటలకి

డెహరాడూన్ చేరి, టాక్సీలో ముసోరీ వెళ్ళారు. ముసోరీ కొండలమీద చల్ల గాలి తగలగానే ఆ ఎండాకాలంలో వారికి హాయి అనిపించింది. పిల్లలు ముందునించే ప్రయాణం మాట విని గెంతువేసారు.

వాళ్ళు దిగిన హోటల్ ఎత్తుప్రదేశంలో కట్టారు. పిల్లలిద్దరూ గదిలో ప్రతి కిటికీ దగ్గిరకీ వెళ్ళి బయటికి చూశారు. "అమ్మా, అమ్మా, తొందరగా రా. అది చూడు. అదేమిటి?" అన్నాడు బాబు, కళ్ళు పెద్దవిచేసుకుని బయటికి చూస్తూ.

సామాను సర్దుతున్న సంధ్యా, శంకర్ ఒక్కసారే తలఎత్తి కిటికీలోంచి చూసారు.

"అదా! ఏరియల్ రోప్‌వే అంటారు," అది సంధ్య, తనూ కుతూహలంగా చూస్తూ.

"అమ్మా, మనం అలాంటిది సినిమాలో చూశాము కదే" అంది నీల.

'ఊఁ.'

శంకర్ కిటికీదగ్గిరకివచ్చి పిల్లల వెనకాల నుంచున్నాడు. మనుష్యులని ఎక్కించుకుని ఆకాశంలో అటూ, యిటూ తీగమీద కదులుతున్న పెట్టెని వాళ్ళిద్దరూ చూస్తున్నారు. వారి కళ్ళలో ఎంతో ఆశ్చర్యం.

"అది ఎక్కుదామా బాబూ?" అన్నాడు శంకర్, బాబు భుజంమీద చెయ్యి వేస్తూ.

"ఎక్కుదాం అంకుల్," నీల అతని చెయ్యిపట్టుకుని ఊపింది.

"తప్పకుండా ఎక్కుదాం. తరవాత అయిస్క్రీమ్ తిందాం. మళ్ళీ బోలెడు బొమ్మలు కొనుక్కుందాం."

అతని మాటలు విన్నకొద్దీ వారి ఉత్సాహం పెరిగింది.

"నేను చెప్పినమాట వినాలి మీరు."

"ఏమిటి?" అన్నట్టు పిల్లలు అతని ముఖంలోకి చూశారు.

"నన్ను అంకుల్ అని పిలవడం మానెయ్యాలి"

"ఎందుకు మానెయ్యాలి?" నీల ఆశ్చర్యం.

"నాన్నా అని పిలవాలి."

సామాను సర్దుతూ, వారిమాటలు వింటున్న సంధ్యకి ఒక్కసారి గుండె దడదడ లాడింది.

"మన డాడీ ఫోటోలో ఉన్నారు కదమ్మా?" నీల తల్లివైపు తిరిగింది.

"ఆయన డాడీ. నేను నాన్న." శంకర్ సంధ్యని ఆపదనించి రక్షించాడు.

"అంకుల్ నాన్న ఎలా అవుతారు?" మళ్ళీ నీల.

"అంకుల్ యిప్పుడు నాన్న అయిపోయాడు. దేముడు చేసేసాడు."

శంకర్ మాటలని నమ్మలేనట్టు చూసింది పిల్ల.

"బాబూ, అంకుల్‌ని ఏమని పిలవాలి?" శంకర్ బాబువైపు తిరిగాడు.

"అంకుల్ అని."

"ఉహుఁ నాన్న. నీకు గన్ కొంటాను."

"పెద్ద గన్ కావాలి అంకుల్."

"మళ్ళీ అంకుల్ అంటే కొనను."

"నాన్నా, గన్ కావాలి," బాబు నవ్వేశాడు.

"నాకూ గన్ కావాలి, నాన్నా," నీల అతని చెయ్యి పట్టుకుంది. కాని నాన్నా అని పిలిచినపుడు, దాని ముఖంలో సిగ్గో, క్రొత్తో, అయిష్టమో-ఏ భావమూ స్పష్టంగా తెలియలేదు.

సంధ్యకి ఆ వాతావరణం గాలి ఆడనట్టు ఉక్కిరిబిక్కిరిగా వుంది. తువాలూ, చీరా తీసుకుని బాత్‌రూంలోకి తప్పుకుంది.

ఆమె స్నానంచేసి వచ్చేసరికి శంకర్, పిల్లలూ కిటికీదగ్గిర కూర్చుని కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

సంధ్య పిల్లలిద్దరినీ స్నానంచేయించి, ముస్తాబు చేసేసరికి, శంకర్ తయారయ్యాడు. అందరూ హోటల్లో భోజనం చేసి, బయటపడ్డారు.

అక్కడి వాతావరణం తమాషాగా వుంది. పైన బాగా ఎండగా వుంది. అయినా గాలి అతిచల్లగా వుంది. ఆ చల్లగాలికి స్వెటర్‌లు అవసరం అనిపించేటట్టు వుంది.

కొండమీద మనుష్యులు పొట్టిగా, బలంగా వున్నారు. "వీళ్ళని 'గడ్‌వాలీలు' అంటారు," అన్నాడు శంకర్, హోటల్‌దగ్గిరనించి క్రిందికి వేసిన దారిలో నడుస్తూ.

రోప్‌వే మీద బాక్స్‌లో కూర్చుని వెళుతూవుంటే ఆకాశంలో వ్రేలాడుతున్నట్టే వుంది. నీలా బాబూ భయంతో తల్లిచీర గట్టిగా పట్టుకున్నారు. రోప్‌వే వారిని ఆ కొండలమీద ఎత్తైన శిఖరానికి చేర్చింది. 'లాల్ డిబ్బా' మీద నిలిచి చూస్తే దూరంగా హిమాలయాలు కనిపిస్తున్నాయి. వేసవికాలం కావడంవల్ల ముసోరి కొండలమీదికి చల్లదనంకోసం చాలామంది వచ్చారు. కొంతమంది విదేశీయులు.

"అదేమిటి అంకుల్, కెమేరానా?" అన్నాడు బాబు, యిద్దరు విదేశీయులని చూపిస్తూ.

"బాబూ, ఇందాక ఏంచెప్పాను?" నవ్వాడు శంకర్.

బాబు అర్థంకానట్టు చూసాడు

నీల నవ్వి "నాన్న," అంది.

"నాన్నా, అదేమిటి?" అన్నాడు తిరిగి బాబు.

"వాటిని బైనాక్యులర్స్ అంటారు. అందులోంచి చూస్తే, దూరంగా వున్న

వస్తువులు దగ్గరగా, పెద్దవిగా కనిపిస్తాయి.

''నాకు కావాలి."

"వద్దు, బాబూ, తప్పు. ఇంకొకరి వస్తువులని అలా అడగకూడదు," అంది సంధ్య.

''ఇక్కడ కూచుందామా?" అన్నాడు శంకర్, ఆమె ప్రక్కకి వస్తూ.

సంధ్య కూచుంది. ఆమెకి కొద్ది దూరంలో అతను కూచున్నాడు. విపరీతంగా వున్న గాలికి ఆమె కట్టుకున్న తెల్ల సిల్కుచీర పైకి ఎగిరిపోతూంది. పైట అస్తమానూ ఎగిరి అతని భుజాన్ని తాకుతుంది. చీరచెరుగు నడుంమీద నించి తీసుకొని దోపుకుంటున్న ఆమె ఒక్కసారి అతనిని చూసి ఆగిపోయింది. అతను ఆమెవైపే చూస్తున్నాడు. అతని కళ్ళు క్రొత్తగా వున్నాయి. వాటిలో కోరిక. ఆమెకి ఒక్కసారి ఒళ్ళంతా మంచులా చల్లబడింది. ముఖం అటు తిప్పేసుకుంది.

పిల్లలు యిద్దరూ విదేశీయులతో పరిచయం చేసుకుని, బైనాక్యులర్స్ తీసుకుని దూరపు కొండలని చూస్తున్నారు.

చుట్టూ కొండలు. క్రింద లోతైన లోయలు. ఎత్తైన పచ్చనిచెట్లు. హృదయాన్ని ఆహ్లాదపరిచే వాతావరణం. వాళ్ళక్కడకొద్దిసేపు కూర్చుని, లేచారు.

పిల్లలద్వారా శంకర్‌కి విదేశీయులతో పరిచయం కలిగింది. వాళ్ళిద్దరూ అమెరికానుంచి వచ్చారు వారు బదరీనాథ్ వెళ్ళాలని వచ్చారు. కాని వారి టాక్సీకి యింకా ముగ్గురు ప్రయాణీకులు అవసరం. ఎవరేనా వస్తారేమోనని చూస్తున్నారు.

"సంధ్యా, మనం బదరీ వెళదామా?" అన్నాడు శంకర్ ఆమెని చూస్తూ.

బదరీనాథ్ పేరు వినగానే ఆమె హృదయం ఉప్పొంగింది. ఎక్కడో మంచుకొండలలో వెలసిన ఆ క్షేత్రం పేరు వినడమేగాని, చూడలేదు. "మీకు వీలైతే, తప్పక వెళదాం" అంది.

ఆమె సరదాపడుతోందని గ్రహించాడతను. వెంటనే అమెరికనులతో మాట్లాడాడు. హోటల్‌కివెళ్ళి టాక్సీకి ఫోనుచేసి, మర్నాడు ప్రొద్దున్నే బయలుదేరడానికి నిర్ణయించారు.

అప్పటికే చీకటిపడుతోంది సంధ్యనీ పిల్లలనీ బజారుకు తీసుకువెళ్ళి బదరీ ప్రయాణానికి అవసరమైన వూలుబట్టలు కొన్నాడు. తానొక స్వెటర్ కొనుక్కున్నాడు.

పిల్లలిద్దరూ అలసిపోయారు. వస్తూనే పడుకున్నారు.

గదిలోవున్న మంచాలు చూస్తూంటే సంధ్యకి అప్పటిదాకా వున్న ఉత్సాహమంతా ఆవిరిలా హరించుకుపోయింది. ఆ గదిలో రెండుమంచాలు కలిపి



ఉన్నాయి. విశాలమైన ఆ కర్రమంచాల మీద డన్‌లప్ పరుపులు, తెల్లదుప్పట్లూ.

శంకర్ పేపరు చదువుతూ కూర్చున్నాడు. కాని అతను పేపరు అడ్డంపెట్టుకుని ఏదో ఆలోచిస్తున్నాడని తెలుస్తూనే వుంది.

ఆమె కిటికీ దగ్గిరకి కుర్చీ జరుపుకొని కూర్చుంది. మనసులో ఏదో తెలియని పిరికితనం. శంకర్ తన పిల్లలకి తండ్రి అయ్యాడు. తనకి రక్షణ కల్పించాడు. నూతన జీవితాన్ని యిచ్చాడు. కాని తను అతనికి ఏమి యివ్వగలదు? తన సర్వస్వాన్నీ అర్పించుకోవాలనే కృతజ్ఞత వుంది. కాని తన దగ్గిర ఏముందని యివ్వగలదు? తాను కన్య కాదు. పాత జ్ఞాపకాలు తనని వెన్నంటి అతనికి దూరంగా ఉంచుతాయి. ఒకే గదిలో, ఒకే మంచంమీద అతనితో గడపగలదా? దానికి తన శరీరం, మనసూ, రెండూ వ్యతిరేకిస్తాయి. కాని ఎన్నాళ్ళిలా?

అతను పేపరు మడిచిపెట్టి, ఆమెకి దగ్గిరగా నడిచివచ్చాడు. ఆమె కూర్చున్న కుర్చీమీద చేతులువేసి "నిద్ర రావటం లేదా?" అన్నాడు.

ఆమెకి భయంతో అంత చలిలోనూ చెమటలు పోసాయి.

"నిద్ర రావటంలేదు. ఇంకాస్సేపు కూర్చుంటాను."

అతను కాస్సేపు అలాగే నుంచున్నాడు.

"తొందరగా పడుకోండి. మళ్ళీ రేపు ప్రయాణం వుంది," అని చెప్పి అతను వెళ్ళిపోయాడు. ఆమె మనసు కుదుటబడింది. అతను లైటు ఆర్పి, పిల్లలకి ఒక వైపు పడుకున్నాడు.

సంధ్య చాలాసేపు అక్కడే కూర్చుంది. శంకర్ కూడా నిద్రపోలేదని అతను అటూ, ఇటూ కదలడంబట్టి తెలుస్తూనే వుంది.

చివరికి అతను పడుకుని వుంటాడని నిశ్చయానికి వచ్చాక, ఆమె లేచివెళ్ళి, పిల్లలని మధ్యకి జరిపి రెండోచివర పడుకుంది.

''సంధ్యా" వులిక్కిపడి లేచిందామె. వంగివున్న అతనిముఖం ఆమెకి దగ్గరగా ఉంది. తడబాటుతో లేచి కూర్చుంది.

"లేస్తారా? టైమవుతోంది. ఆరు గంటలకంతా మనం బయలుదేరాలి" అన్నాడతను నిటారుగా నిలబడుతూ. ఆమె సర్దుకుని లేచింది.

వాళ్ళు తయారై, మధ్యలో డెహరాడూన్‌లో టిఫిన్ తీసుకుని, దారికి పళ్ళూ, రొట్టె, జామ్, బిస్కట్లూ కొనుక్కుని, టాక్సీ రోడ్డు ఎక్కేసరికి ఎండ పైకి వచ్చేసింది.

"అదిగో గంగ" అన్నాడు శంకర్, చేతితో నీలకి చూపుతూ. ఋషీకేశ్ దగ్గిర గంగమీద వంతెనదగ్గిర, డ్రైవర్ టాక్సీ ఆపి, "దీన్ని లక్ష్మణఝూలా అంటారు" అన్నాడు ఆ వంతెన తీగలతో కట్టినది. వుయ్యాలలా నదిమీద వ్రేలాడుతోంది. క్రింద స్తంభాలుకాని, మరే కర్రలుకాని ఊతగా లేవు మనుషులు వంతెనమీద నడుస్తూంటే అది ఊగుతోంది. ఝూలా అంటే ఉయ్యాల అని విదేశీయులకి విశదపరిచాడు శంకర్. వాళ్ళు ఆ వంతెన ఫోటో తీసుకున్నారు.

టాక్సీ కదిలింది. సంధ్య కుతూహలం కూడా హెచ్చింది. కొండ ఎక్కడం ప్రారంభించింది టాక్సీ. వారితోపాటు గంగానదీ వచ్చింది. కుడివైపు గంగ, ఎడమవైపు కొండలు. "గంగ యిక్కడి నించీ మనతోనే వస్తుంది. బదరీ దాకా వస్తుంది'' అన్నాడు డ్రైవరు. మధ్య మధ్యలో చిన్న చిన్న పాయలు వచ్చి గంగలో కలుస్తున్నాయి. అవి కలిసే ప్రదేశాలు ప్రయోగలు.

లోతుగా లోయలోకి వెళిపోతుంది గంగ ఒకసారి. ఇంకోసారి వాళ్ళ దారి కడ్డంగా ప్రవహిస్తుంది. ఒకచోట నిశ్శబ్దంగా, అమాయకురాలిలా ఉంటుంది. ఇంకో కొంత దాటేసరికి జింకపిల్లలా గెంతులువేస్తూ, తృళ్ళితృళ్ళి పడుతూ

వుంటుంది. ఆ గంగ చేసే తమాషాలు, సోయగాలూ, దాటిపోతున్న ఎత్తైన కొండల బారులూ చూస్తూ పరవశించి పోయింది సంధ్య.

"అమ్మో ఎంత పైకి వెళ్ళిపోయామో!" అంది నీల, క్రింద లోయలలోకి చూస్తూ.

"అమ్మా! ఆకాశంలో వెళ్లి పోతున్నాం" అన్నాడు బాబు.

ఇంతలోనే అంతఎత్తుకొండా మాయమై మైదానంలోకి ప్రవేశించింది టాక్సీ.

అమెరికన్‌లు - జార్జ్, మైక్‌ముందు డ్రైవరు ప్రక్కన కూర్చున్నారు. వెనక శంకర్, సంధ్య, పిల్లలూ కూచున్నారు. పిల్లలిద్దరూ చెరో కిటికీప్రక్కనా కూచో డంతో, ఆమె, అతనూ మధ్యన కూచోక తప్పలేదు. పిల్లలు అటూ, యిటూ కదిలినప్పుడల్లా ఆమే, అతనూ మరీ దగ్గిరగా వస్తున్నారు. అతనికి అంత దగ్గిరగా, తాకుతూ కూర్చుంచే ఆమెకి ఊపిరి సలపనట్టు సిగ్గుగా వుంది. కాని అతను చాలా ఉత్సాహంగా ఉన్నాడు. అతని ముఖంలో ఓ ఆనందం వెల్లి విరిసింది.

చల్లగాలికీ, కారుఊపుకూ పిల్లలు నిద్రపోయారు. రాత్రి నిద్రలేక సంధ్య కూడా తూగుతోంది. శంకర్‌మీద ఎక్కడ పడతానో అనే భయంతో మళ్ళీ బలవంతంగా నిద్ర ఆపుకుంటోంది.

కాని ఆమె ప్రయత్నం ఫలించలేదు, నిద్ర ఆమెని జయించింది. ఒడిలో బాబుని పెట్టుకునే ఆమె నిద్రపోయింది. అలా ఎంతసేపు నిద్రపోయిందో! టాక్సీ ఆగిన కుదుపుకు కళ్ళు తెరచింది. ఆమె అతని మీద ఒరిగి పడుకునివుంది. అతని ఒక చెయ్యి ఆమెచుట్టూ తిరిగి కుడిభుజం మీదనించి వ్రేలాడుతోంది. రెండోచెయ్యి ఒళ్ళో పడుకున్న నీల తలమీదవుంది. అతను రెండు చేతులతోనూ తల్లీ, కూతుళ్ళని పొదవి పట్టుకుని నిద్రా భంగం కాకుండా కాపాడినట్టువుంది. సంధ్య సిగ్గుపడుతూ లేచి సమంగా కూర్చుంది.

"ఎక్కడికి వచ్చాం?"

"ఈ ఊరిపేరు శ్రీనగర్. డ్రైవరు టీ తాగుతాడుట. మీకూ కావాలా?" అతనింకా ఆమెని 'మీరు' అనడం మానలేదు.

పిల్లలు లేచారు. అతను వెళ్ళి డిక్కీ లోంచి పేముబుట్ట పైకితీసాడు. ఆమె బ్రెడ్‌కి జామ్‌రాసి, పిల్లలకీ, శంకర్‌కీ, విదేశీయులకీ యిచ్చింది. టీ త్రాగి, పళ్ళు తింటూ ప్రయాణం సాగించారు.

సంధ్య బయటికి చూస్తూ కూచుంది. ఈమారు అతను నిద్రలోకి జారాడు. అతను సంకోచమేమీ లేకుండా ఆమె భుజానికి ఆనుకుని తలపెట్టుకుని సుషుప్తిలో పడ్డాడు. ఆమెకి అతనిని చూస్తే ఆశ్చర్యం వేసింది. రెండేళ్ళుగా శంకర్‌తో పరిచయంవున్నా, అతను ఒక హద్దు లోనే వుండేవాడు. ఏనాడూ అతిగాగాని,

ఆసభ్యంగాకాని అతను ప్రవర్తించలేదు. ఆమెకి గౌరవం యిస్తూ, దూరంగానే మసిలేవాడు. కాని యీ రెండు రోజులలో అతనిలో చాలామార్పువచ్చింది. ఆమెకి దగ్గరగా రావాలని ప్రయత్నం, ఆమెను తాకడంలో ఓ కాంక్ష అతనిలో కనిపిస్తున్నాయి. మెళ్ళో తాళిగట్టడంతో అతనికి ఆమెమీద ఆ చనువు వచ్చిందేమో! కాని ఆమె సహజంగా వుండలేకపోతూంది.

మళ్ళీ టీకోసం టాక్సీ 'పీపల్ కోట్'లో ఆగింది. ఈ మారు గాలి చల్లగా తాకింది. పిల్లలిద్దరికి స్వెటర్స్ వేసింది సంధ్య. "సాయంత్రం నాలుగు గంటలైతే బదరీరోడ్డు మూసేస్తారు. మనం జ్యోషీమఠ్‌లో ఆగిపోవాలి," అన్నాడు డ్రైవరు, టాక్సీ స్టార్ట్‌చేస్తూ.

'జ్యోషీమఠ్' సమీపిస్తూ వుంటే దూరంగా మంచు నిండిన శిఖరాలు కనిపించాయి. "అదిగో మంచు' అని చూపించాడు శంకర్. పిల్లలు ఆశ్చర్యంగా చూసారు.

జ్యోషీమఠ్‌లో ఆ రాత్రి ఆగిపోయారు. వేరేగది దొరకకపోవడంతో విదేశీయులు శంకర్ కుటుంబంతో ఒకే గదిలో గడిపారు. అది సంధ్య మనసుకు శాంతినిచ్చింది.

మర్నాడు ఉదయమే బదరీనాథ్ ప్రయాణం. "పదివేల అడుగుల పైకి వెళతాం" అన్నాడు శంకర్, సంధ్యతో. దారంతా ఎత్తైన మంచుకొండలు. గలగల పారే గంగానది. సూర్యుడి కిరణాలు పడి మెరుస్తోంది మంచు. "అమ్మా, తెల్ల కొండలు," అన్నాడు బాబు.

బదరీనాథ్ హిమాలయపర్వతాలమధ్య విశాలమైన లోయలో ఉంది. ఆ లోయ చూస్తూనే పరవశించింది సంధ్య. చుట్టూ మంచుకొండలు. మధ్యనలోయ. లోయని రెండుగా చీలుస్తూపారే గంగానది. ఆమె మనస్సు సంతోషంతో నృత్యం చేసింది.

హోటల్లో గది తీసుకుని, సామాను పడేసి, గుడిదగ్గిర వేడినీళ్ళ కుండాలలో స్నానంచేశారు. దేముడి దర్శనం చేసుకుని, లోయంతా కలయతిరిగారు. పర్వత సానువులలోంచి పారే మంచి నీటి జలపాతాల దగ్గిరకి వెళ్ళి చూసారు. "అబ్బ! అమ్మా యీ నీళ్ళు ఎంత చల్లగా వున్నాయో" అంది నీల, నీటిలో పెట్టిన కాలు గబుక్కున వెనక్కి తీసుకుంటూ.

"మంచు చూద్దాం రండి" అంటూ శంకర్ కొండలమీదికి దారితీసాడు. ఉత్సాహంతో అతని వెనకే పరిగెత్తాడు బాబు.

మంచు గట్టిగా రాయిలా వుంది. ఓ చిన్న కర్రముక్క తీసుకుని శంకర్ దానిమీద గీసి, మెత్తని పువ్వురేకుల లాంటి మంచుని తీసి ముద్దచేసి, బాబు మీదికి విసిరాడు.

"అంకుల్ నాన్నా, నాకూ కావాలి" బాబు ఎగిరాడు.

"అంకుల్‌ని విడిచిపెట్టు."




"నాన్నా! నాకూ యివ్వవ్" అంది నీల, అతని వెనక చేరుతూ. పిల్లలూ, అతనూ మంచుమీద నిలబడ్డారు

"నీలా, మంచు చల్లగా లేదా?" అంది సంధ్య, దూరంగా నిలబడి.

"లేదమ్మా, నువ్వూ రా."

సంధ్య అక్కడే తటపటాయిస్తూ నుంచుంది.

శంకర్ పిల్లలచెవుల్లో ఏదోచెప్పాడు. వెంటనే మూడు మంచుముద్దలు ఎగిరి వచ్చి సంధ్యని తాకి, క్రిందికి పూల జల్లులా జారిపోయాయి.

''వద్దు, వద్దు" ఆమె నవ్వుతూ చేతులు అడ్డంపెట్టింది. ఆమె వద్దన్నకొద్దీ ఆమెమీద మంచువర్షం కురిసింది. సంధ్యకూడా మందుకునడిచి వారితో చేరి మంచుతీసి పిల్లలమీద విసిరింది. వాళ్ళు నలుగురూ కాసేపు చిన్నపిల్లలై ఆడుకున్నారు బాబూ, నీలా కేరింతలు పెట్టారు. పిల్లల సరదా, వారి ఉత్సాహం చూసి, ఆమెకి ఆనందంతో కళ్ళలో నీళ్ళు వచ్చాయి.

"మీ అమ్మ ఓడిపోయింది. ఏడుస్తోంది'' అన్నాడు శంకర్, నవ్విస్తూ. పిల్లలిద్దరూ ఆమె దగ్గిరిగా చేరి "అమ్మా ఓడిపోయావా?" అంటూ చప్పట్లు కొడుతూ, అతనితోపాటు నవ్వారు.

చీకటిపడుతూ వుంటే, వారు అయిష్టంగానే హోటల్‌దారి పట్టారు. ఆమెకి గాలిలో తేలిపోతున్నట్లు హాయిగావుంది.

అద్దెకి తెచ్చిన రొజాయిలు వెచ్చగా కప్పుకుని, పిల్లలు నిద్రపోయారు.

ఆమె ముడి విప్పుకుంటూ, నిలువు టద్దంముందు స్టూలుమీద కూర్చుంది. అద్దానికి ఎదురుగావున్న సోఫామీద అతను కూచుని సిగిరెట్టు కాలుస్తున్నాడు. అతని ముఖం ఆమెకి అద్దంలో కనిపిస్తోంది. అతని కళ్ళలో మెదిలే కోరిక ఆమెని కలవరపెట్టింది.

సంధ్య లేచి కిటికీ దగ్గరికి వెళ్ళి నిలుచుంది. పైన వెన్నెల వెన్నెలలో మంచు శిఖరాలు అద్భుతంగా ఉన్నాయి. వెన్నెల నురుగులలో మగురుతున్నట్టు ఉంది లోయ.

శంకర్ లేచి ఆమెదగ్గిరకి వచ్చాడు. ఆమెని తన వైపుకి తిప్పుకున్నాడు. అతని కన్నులలో వెన్నెల మెరిసింది. ఆమె ముఖాన్ని తన చేతులలోలకి తీసుకుని ముద్దుపెట్టుకున్నాడు శంకర్.

ఆ ముద్దులో వేడిలేదు. పసితనం ఉంది. మంచులా, చల్లగా వున్నాయతని పెదవులు. అతనిఒళ్ళంతా వణుకుతోంది. అతనిలో ఏదో బెదురు. శంకర్‌ని చూస్తే ఆమెకి ఎందుకో నవ్వు వచ్చింది. అతని కళ్ళలోకి చూస్తూ ఆమె నవ్వింది. అతనూ నవ్వాడు హఠాత్తుగా ఆమెలో యీ మూడురోజులుగా ఉన్న భయం పోయింది. ఆమెలో ప్రేమ వెల్లువై ప్రవహించింది. అతని భుజం మీద చేతులువేసి దగ్గరగా తీసుకుని, అతని రెండుచెంపలమీదా గాఢంగా ముద్దుపెట్టుకుంది.

"నువ్వు నా గురువ్వి" అన్నాడతను ఆమె భుజంమీద తలపెట్టి- అవును. తనైతే మూడేళ్ళుకాపురంచేసింది అతనికి అదే మొదటిసారి!

ఆ రాత్రి ఆమె మూడేళ్ళలో తను నేర్చుకున్న అనుభవ సారమంతా అతనికి ఓ గంటలో నేర్పింది.

"నవ్వకు. తొందరలోనే నీకు పాఠాలు చెప్పగలను'' అన్నాడతను, ఆమె ఒళ్ళో తలపెట్టి పడుకుంటూ.

ఆమె వంగి ప్రేమగా అతని శిరస్సుని చుంబించింది. అతను తృప్తిగా నిద్రపోయాడు.

సంధ్య క్రొత్త జీవితానికి నాందీ పలికింది. 'ఈ రోజుగురించి ఎంత భయపండిది తాను! పాతజీవితాన్ని మర్చిపోలే ననుకుంది. కాని ఎంత తమాషా! కాలం అన్ని జ్ఞాపకాలనూ మరుగుపరుస్తుంది. కాలం అన్ని గాయాలనీ మాన్పుతుంది. మరిచిపోవడం అన్న వరమే మానవునికి లేకపోతే జీవితం ఎంత దుర్భరం అవుతుంది! ఏడ్చినకళ్ళు మళ్ళీ ఎప్పటికీ నవ్వలేవు భగవాన్, నీ సృష్టి ఎంత విచిత్రం!' అనుకుంది సంధ్య, దూరంగా కనిపిస్తున్న నారాయణుని మందిరానికి చేతులు ఎత్తి మ్రొక్కుతూ.



# నలుగురు ఫకీర్లు

(గత సంచిక తరువాయి)

నాలుగో ఫకీరు చెప్పుకుపోతున్నాడు.

ఆ రాత్రి బుర్ర ఏ స్థితిలో ఉన్న దంటే, నాకు నిద్రపట్టక, ఎప్పుడు తెల్ల వారుతుందా, ఎప్పుడు మళ్ళీ వెళ్ళి ఆమెను చూస్తానా అనిపించింది. ఒక్కోసారి ఆ తండ్రి నాకు ఆమెను ఇయ్యటానికి ఒప్పుకుంటే, ముబారక్ ఆమెను ఎత్తుకు పోయి మలిక్‌సాదిఖ్‌కు ఇస్తాడేమోనని పించేది. అప్పుడు నేను "ఆమె మన చేతికి రానీ, ఎలాగో ముబారక్‌ను ఒప్పించి, ఆమె సాంగత్య సుఖం పొందు తాను" అనుకునేవాణ్ణి. ముబారక్‌ను ఎలాగో ఒప్పించినా మలిక్‌సాదిఖ్ రాజు కొడుకును చేసినట్టే నన్నూ చేస్తాడమో నని భయం కలిగేది. ఏమైనా ఆ నగరపు రాజు తన కొడుకు హతుడైన మీదట మరొకడికి ఆమె దక్కటం సహించడు. ఇలా ఆశానిరాశలమధ్య ఊగిసలాడుతూ ఆ రాత్రి నేను నిద్రపోలేదు.

తెల్లవారగానే నేను చౌక్‌కు వెళ్ళి, కొన్ని మేలురకం వస్త్రాలూ, లేసూ, కొన్ని తాజా పళ్ళూ, ఎండిన పళ్ళూ ముసలివాడి వద్దకు తీసుకుపోయాను.

ఆయన వాటిని చూసి పరమానందం చెంది, ''ఎవడికీ ప్రాణంకన్న ప్రియ తమమైనది ఉండదు. నా ప్రాణం నీకేవిధంగానైనా ఉపయోగించేటట్టుంటే, దాన్ని త్యాగంచేసి అయినా నీకు నా

కూతురిని ఇద్దును. కాని అలాచేసి నీ ప్రాణానికే ప్రమాదంతెచ్చి, ఆలోకంలోకి పాపం మోసుకుపోవలసి వస్తుందని నా భయం" అన్నాడు.

"నిజానికి నేనిప్పుడీ నగరంలో అసహాయుణ్ణి. నువ్వు అన్నివిధాలా నా తండ్రిలాంటివాడివి. నేను ఇక్కడికి వచ్చి ఆమెను కళ్ల చూడకముందు ఆమెను అన్వేషిస్తూ ఎంతకాలం ఎన్ని కష్టాలూ, బాధలూ, శ్రమదమాలూ పడ్డానో ఆలోచించు. దేవుడుకూడా నా పట్ల దయదలచి, ఆమెను నాకు ఇవ్వాలన్న బుద్ధి నీలో కలిగించాడు. నీ సంకోచమల్లా నాకేదన్నా మూడుతుందనేగద. కాని న్యాయం ఆలోచించు. ప్రేమపాశానికి భయపడి ప్రేమ ప్రమాదంనుంచి ఆత్మరక్షణ చేసుకోవటాన్ని ఏ మతమూ హర్షించదు. ఏమైనా జరగనీ: నేను అన్నివిధాలా భ్రష్టత్వం పొందాను. నేను ప్రేమించిన మనిషిని పొందటమే నాకు నిజమైన జీవితంగా భావిస్తున్నాను. నేను బతికి ఉంటానా, చస్తానా అన్న విచారం నాకు లేదు. అదీగాక, రాసిపెట్టి ఉండకపోయినా నేను నిరాశతో చావడం తథ్యం. విచారణ రోజున నిన్ను న్యాయం అడుగుతాను," అన్నాను.

ఇలాంటి వాగ్వాదాలతో, సమ్మతించటమా, మానటమా అన్న ఊగిసలాటలతో, భవిష్యత్తు గురించిన ఆశలతో భయాలతో, ఒక నెల గడిచింది. ప్రతి రోజూ ఆ ముసలివాడికి పరిచర్యలు చేస్తూ, నా కోరిక తీర్చమని వేడుకున్నాను.

చివరకు ముసలివాడికి జబ్బుచేసింది. జబ్బులో ఆయనకు నేనే సేవచేశాను. రోగస్థితి వైద్యుడికి ఎప్పటికప్పుడు చెప్పి వైద్యులు చెప్పిన మందులు తీసుకుపోయి రోగికి ఇచ్చేవాణ్ణి. స్వయంగా గంజి కాచి, ఆయనకు ఇచ్చేవాణ్ణి.

ఒకనాడు ఆయన నాపట్ల చాలా మెత్తబడి, "కుర్రవాడా, నీది మహా మొండిపట్టు: నువు నీ ధోరణి మార్చుకోకపోతే ఉండే అపాయం ఏమిటో నీకు అనేక పర్యాయాలు చెప్పాను. ఆ విషయం మరిచిపొమ్మన్నాను. ప్రాణం ఉంటేనే అన్నీ ఉండేది. కాని నీవు గోతిలో దూకటానికి నిశ్చయించావు. సరే, ఇవాళ నీ మాట నా కూతురికి చెబుతాను, ఏమంటుందో చూద్దాం" అన్నాడు,

సాధుల్లారా: ఈ చల్లనిమాటలువిని నేను ఎలాపొంగిపోయానంటే, నాదుస్తులు బిగుతెక్కాయి నేను ముసలాయన పాదాలపైన వాలి, "నా బతుక్కూ, భవిష్యత్తుకూ మూలరాయి వేశారు." అని చెప్పి, నా బసకు తిరిగి వచ్చేశాను. నాకు నిద్రాహారాల స్పృహ లేకపోయింది తెల్లవార్లూ ముబారక్‌తో నాకు కలగనున్న సుఖం గురించి మాట్లాడాను.

మర్నాడు ఉదయం మళ్ళీ వెళ్ళి ముస

లాయనకు వందనం చేశాను. ఆయన నాతో, "సరే, నేను నా కూతురిని నీ కిస్తాను. దేవుడు ఆమె ద్వారా నీకు మేలు చేయాలి. మిమ్మల్నిద్దరినీ భగవంతుడి రక్షణలో ఉంచుతున్నాను. నా బొందిలో ప్రాణం ఉన్నంతకాలమూ నాతో ఉండండి. నేను కన్నుమూశాక మీ ఇష్టం వచ్చినట్టు చెయ్యండి. ఆ తరవాత మీ చర్యలకు మీరే కర్తలు" అన్నాడు

ఈ మాటలన్న కొద్దిరోజులకు ఆయన చనిపోయాడు. మేం ఆయనకు అశ్రుతర్పణాలు వదిలి, ఆయనను ఖననం చేశాం. మూడోరోజు కర్మకాండ ముగిసినాక ముబారక్ ఆమెను డోలీలో సరాయ్‌కి తీసుకువచ్చాడు.

"ఈమెను అంటకుండా, పవిత్రంగా మలిక్‌సాదిఖ్‌కు అప్పగించాలి. జాగ్రత్త! ఆమెను తాకి, నీ శ్రమఅంతా వ్యర్థం చేసుకోకు," అన్నాడు ముబారక్.

"మిత్రుడా, ఎక్కడి మలిక్‌సాదిఖ్? నా హృదయం నా చెప్పుచేతలలోలేదు. నేను నిగ్రహించుకోలేను. ఏమైతే కానీ, నేను నాశనమైనా సరే, ఆమె నాకు కావాలి," అన్నాను.

ముబారక్ నిగ్రహం కోల్పోయి కోపంతో, "కుర్రాడిలాగా ప్రవర్తించకు. క్షణంలో ప్రళయం ముంచుకొస్తుంది. మలిక్‌సాదిఖ్ ఎక్కడో ఉన్నాడని అతని నియమాలు ఉల్లంఘిస్తావా? బయలుదేరేముందు అతను స్పష్టంగా నీకు అంతా చెప్పాడు. అతను చెప్పినది తు. చ. తప్పకుండా చేసి, ఈమెను క్షేమంగా అప్పగించినట్టయితే, ఆయన మాట తప్పకుండా, నువు పడిన శ్రమ అంతా పరిగణించి, ఆమెను తానే నీ కియ్యవచ్చు. అలా జరిగితే ఎంత బాగుంటుంది? నీకు నీప్రియురాలితోబాటు ఆయన స్నేహంకూడా దక్కుతుంది" అన్నాడు.

వాడు నన్ను గట్టిగా మందలించి, భయపెట్టేసరికి నేను మాట్లాడలేక పోయాను. రెండు ఒంటెలు కొని, అంబారీలో ఎక్కి మేం మలిక్‌సాదిఖ్ దేశానికి బయలుదేరాం.

## 16

మేం వెళ్లి వెళ్లి ఒక మైదానప్రాంతం చేరాం. అక్కడ పెద్ద ధ్వనులు విని పించాయి.

"దేవుడు చల్లగా, మన శ్రమ విఫలం కాలేదు. భూతాల సేనలు చేరుకున్నాం," అన్నాడు ముబారక్.

వాడు వారిని కలుసుకుని, ఎక్కడికి పోతున్నారని అడిగాడు.

"రాజుగారు మిమ్మల్ని కలుసుకో మని పంపారు. ఇప్పుడు మేం మీ ఆజ్ఞ లకు బద్ధులం. ఆజ్ఞ ఇస్తే, క్షణంలో మిమ్మల్ని రాజుగారివద్ద చేర్చుతాం," అన్నారు వాళ్లు.

ముబారక్ నాకేసి తిరిగి, "రాజుగారి దృష్టిలో మనం ఎలా పైకివచ్చామో

చూశావా? ఇంతగా కష్టాలూ, శ్రమా అనుభవించినమీదట తొందర ఏమిటి? ఏదైనా అపచారం జరిగితే, మన శ్రమ అంతా వ్యర్థమైపోయి, రాజుగారి ఆగ్రహానికి గురి అవుతాం,'' అన్నాడు.

''అదంతా మీ యిష్టం. ముందుకు సాగండి,'' అన్నారు భూత సైనికులు.

అహోరాత్రాలు ప్రయాణం చేశామన్న మాటేతప్ప, మాకెలాటి కష్టమూ కలగలేదు. అయినప్పటికీ, భూతాల రాజుండేచోటుని చేరవచ్చి మజిలీచేసిన సమయంలో, ముబారక్ నిద్రపోతూ ఉండటం గమనించి, నేను ఆ సుందరాంగి కాళ్లమీద పడి, నా హృదయ వేదనా, మలిక్‌సాదిఖ్ భయంచేత కలిగిన నా మనక్షోభా వెళ్లబోసుకున్నాను; ఆమె చిత్తరువు చూసిన రోజు లగాయతు నాకు ఆహారామూ, విశ్రాంతీ లేవని చెప్పాను. ఇంత సదవకాశం ఏర్పడికూడా ఆమె నాకు కాకుండా పోతున్నది.

"నా మనస్సుకూడా నీమీదనే ఉన్నది. నాకోసం ఎన్ని అగచాట్లు పడ్డావు! నన్ను తీసుకురావటం నీకు ఎంత శ్రమ అయింది. దేవుణ్ణి గుర్తుంచుకో. నన్ను మరవవొద్దు. ఏం జరుగుతుందో చూద్దాం," అన్నదామె.

ఇలా అని ఆమె దుఃఖంతో ఉక్కిరి బిక్కిరి అయింది.

ఇంతలో ముబారక్ మేలుకుని, మేమిద్దరమూ విలపించటం చూసి "విచారించకండి. నా దగ్గిర ఒక లేపనం ఉన్నది. దాన్ని ఈమె శరీరమంతా పట్టిస్తే, ఆ వాసనకు మలిక్ అసహ్యపడి ఆమెను నీతో వదిలెయ్యవచ్చు," అన్నాడు.

ముబారక్ చెప్పిన ఈ ఉపాయం వినగానే నాకు బలం వచ్చింది. నేను వాణ్ణి కౌగలించుకుని, "మిత్రమా, నువు ఇప్పుడు నాకు తండ్రివి. నీ మూలంగానే నా ప్రాణం దక్కింది. విచారంతో చావకుండా నన్నిప్పుడు కాపాడు," అన్నాను.

వాడు నన్ను ధైర్యంగా ఉండమన్నాడు.

తెల్లవారేసరికి భూతాల సందడి వినపడింది. మలిక్‌సాదిఖ్ అంతరంగికులు అనేకమంది రావటం కనిపించింది. వాళ్లు తమవెంట నాకు బట్టల జతా, ముత్యాల పల్లకీ తెచ్చారు. నా ప్రియురాలి శరీరానికి ముబారక్ లేపనం పట్టించాడు. వాడు ఆమెకు మేలైన దుస్తులు తొడిగి, పల్లకీలో కూర్చోబెట్టి మలిక్‌సాదిఖ్ వద్దకు తీసుకుపోయాడు.

ఆమెను చూడగానే భూతాలరాజు నాకు గొప్పగా సత్కారంచేసి, నన్ను తన సరసనే కూర్చోబెట్టుకుని, "నేను నీ పట్ల ఎవరూ ఎవరిపట్లా చూపనంత ఆదరం చూపుతాను. నీ రాజ్యం



నీకోసం ఎదురుచూస్తున్నది. నీవు నాకు కొడుకులాంటివాడివి" అన్నాడు.

ఆయన నాతో ఇలా ఎంతో మంచిగా మాట్లాడుతూ ఉండగా, సుందరాంగి వచ్చింది. అకస్మాత్తుగా లేపన దుర్గంధం సోకి ఆయనకు తల తిరిగిపోయింది. దాన్ని సహించలేక ఆయన లేచి బయటికి వెళ్ళి, నన్నూ ముబారక్‌నూ పిలిచాడు. అయన ముబారక్ కేసి చూసి "ఏమోయ్ నేను చెప్పిన పని చాలా బాగా చేశారు! నన్ను మోసగిస్తే, నా ఆగ్రహానికి పాత్రులవుతారని చెప్పానా? ఈ కంపే మిటి? నేను మిమ్మల్ని ఏంచేస్తానో చూడండి" అన్నాడు. ఆయనకు చాలా కోపం వచ్చింది.

ముబారక్ హడలిపోయి తన బట్టలు విప్పేసి "మహారాజా నేను షండుణ్ణి! షండత్వం కలిగించుకున్నమీదనే తమ పనిమీద బయలుదేరాను" అన్నాడు.

భూతాలరాజు ఈ మాట విన్న మీదట నాకేసి తిరిగి, "అయితే ఇది నీ పనేనన్నమాట!" అంటూ శివం ఎత్తి నన్ను తిట్టసాగాడు. ఆయన వాలకమూ, మాటలధోరణీ చూస్తే నన్ను చంపేస్తాడని పించింది. ప్రాణభయంతో తెగబడి, నేను ముబారక్ పిడికత్తి లాగేసుకుని రాజు పొట్టలో పొడిచాను. ఆ దెబ్బతో ఆయన వంగిపోయి, తూలాడు. (నేనా యనను చంపానే అనుకున్నాను.) కాని ఆ ఘాత నేను ఊహించినంత ప్రమాద కరం కాదని తెలిసి నాకు ఆశ్చర్యం కలిగింది. నేను వింతగా చూస్తూఉండగా ఆయన నేలమీద పొర్లి, బంతిలాగా మారి ఆకాశంలోకి ఎగిరాడు. ఆయన ఎంత ఎత్తు వెళ్లాడంటే చివరకు కనిపించకుండా

పోయాడు. మరుక్షణం ఆయన మెరుపులాగా కనబడి, ఆగ్రహంతో గర్జిస్తూ, నన్ను బలంగా తన్నేసరికి, కళ్లు బైర్లు కమ్మి, వెల్లికిలాపడి, మూర్ఛపోయాను.

ఆ మూర్ఛలో ఎంతకాలం గడిచిందో దేవుడికి తెలియాలి. నేను మళ్లీ కళ్లు తెరిచి చూసేసరికి కీకారణ్యం మధ్య ఉన్నాను. నా చుట్టూ ముళ్లపొదలుతప్ప ఇంకేమీలేవు ఆ పరిస్థితిలో నేను ఏంచెయ్యాలో, ఎక్కడికి పోవాలో నాకేమీ పాలుబోలేదు. దీర్ఘంగా నిట్టూర్చి, హతాశుణ్ణయి, కనిపించిన దారిన నడవసాగాను. ఎవరైనా కనిపిస్తే మలిక్ సాదిఖ్ గురించి అడిగాను. అవతలివాడు నాకు మతిపోయిందనుకుని తాను ఎన్నడూ అలాంటి పేరైనా వినలేదని చెప్పాడు.

ఒకనాడు ఒక కొండ ఎక్కి, దాని మీదనుంచి దూకి చచ్చిపోవాలనుకున్నాను. నేను దూకే క్షణంలో అదే రౌతు ప్రత్యక్షమై, "ప్రాణాన్ని ఎందుకు పోగొట్టుకుంటావు? మనిషికి అన్ని కష్టాలూ, క్లేశాలూ వస్తాయి. నీకు చెడ్డ రోజులు పోయి, మంచిరోజులు రాబోతున్నాయి. త్వరగా కాన్‌స్టాంటినోపుల్ వెళ్ళు. నీలాగ బాధలు పడినవారు ముగ్గురు అదివరకే అక్కడికి వెళ్లారు. వారిని చేరుకుని, ఆ దేశపు రాజును కలుసుకో. అక్కడే మీ అయిదుగురి కోరికలూ ఈడేరుతాయి," అన్నాడు.

ఇదే నా కథ. ఆ దేవదూత ఇచ్చిన శుభసందేశం ప్రకారం ఇక్కడికి వచ్చి రాజును కలుసుకున్నాను. మన కందరికీ ఇప్పుడు మేలు సిద్ధించాలి.

* * *

రాజు ఆజాద్‌బఖ్త్‌కూ, నలుగురు ఫకీర్లకూ ఇలా సంభాషణ జరుగుతూ ఉండగా, అంతఃపురంనుంచి ఒక ఖొజ్జా పరుగెత్తుకుంటూ వచ్చి, వందనం చేసి రాజుగారికి జయంకలగాలంటూ, "ఇప్పుడే చంద్రబింబంలాటి రాజకుమారుడు పుట్టాడు," అని చెప్పాడు.

రాజు నిర్ఘాంతపోయి, "ఎవరూ గర్భవతిగా ఉన్న జాడలేదే, ఎవరికి పుట్టాడు?" అన్నాడు.

"ఆడబానిస మాహ్రూకు. ఆమెమీద ఇటీవల ఏలినవారు ఆగ్రహించటంచేత, విచారంతో కుములుతూ అంతఃపురంలో ఒకమూల పడిఉన్నది. ఆమె జోలికి వెళ్ళటానికీ, ఆమె అతీగతీ తెలుసుకోటానికీ ఎవరూ సాహసించలేదు. దేవుడు ఆమెను అనుగ్రహించి చంద్రబింబంలాటి కుమారుణ్ణి ప్రసాదించాడు," అన్నాడు ఖొజ్జా.

రాజు ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయాడు. నలుగురు ఫకీర్లు ఆయనను ఆశీర్వదిస్తూ, "మీకు ఎల్లప్పుడూ సుఖం కలగాలి, మీకుమారుడు కలకాలం వర్ధిల్లాలి!" అన్నారు.

"ఇదంతా మీ రాక చలవ ఇలా

అవుతుందని నేను ఊహించలేదు. మీ అనుమతి అయితే నేను వెళ్ళి బిడ్డను చూసివస్తాను," అన్నాడు రాజు

"తప్పకుండా వెళ్ళిరండి." అన్నారు ఫకీర్లు.

రాజు అంతఃపురానికి వెళ్ళి, చంటి బిడ్డను ఒడిలోకి తీసుకుని, భగవంతుడికి ధన్యవాదాలు చెప్పుకున్నాడు. ఆయన మనస్సు తేలికపడింది. ఆయన ఆ బిడ్డను తెచ్చి ఫకీర్ల కాళ్ళదగ్గిర ఉంచాడు. ఫకీర్లు ఆ బిడ్డను ఆశీర్వదించి, భూతోచ్చాటన చేశారు.

రాజు ఉత్సవాలు జరిపే ప్రయత్నాలు చెయ్యమని ఉత్తరువిచ్చాడు రాజుగారి వాద్యగాళ్లు మంగళవాద్యాలు చేశారు. ఖజానా తలుపులు తెరిచారు. రాజుగారు కానుకలిచ్చి పేదలందరినీ ధనికులు చేశాడు. ప్రభుత్వోద్యోగు లందరికీ భూములూ, బిరుదులూ ఇచ్చాడు సైనికులందరికీ అయిదేళ్ళ జీతం బహూకరించాడు. పండితులకూ, సాధువులకూ భూములూ, జీవన భృతులూ ఇచ్చాడు. బిచ్చగాళ్ళ సంచులలో బంగారు, వెండి నాణాలు కురిశాయి. రైతులకు మూడేళ్ల పాటు శిస్తు మాఫీ అయింది వాళ్లు ఆ మూడేళ్ళు పండించుకున్నదంతా వారిదే. నగరమంతా ఉత్సవాలతోనూ, సంబరాలతోనూ ఓలలాడింది.

ఈ ఆనందోత్సాహమంతా భగ్నం చేస్తూ అంతఃపురంలోంచి ఆర్తనాదాలు అకస్మాత్తుగా బయలుదేరాయి. దాసీలూ, కొజ్జాలూ రాజువద్దకు ఏడుస్తూ పరిగెత్తి వచ్చి, "మేం రాజకుమారుడికి నీళ్లు పోసి దాదికి అప్పగించగానే, పైనుంచి ఒక మబ్బు దిగివచ్చి దాదిని కప్పేసింది. మరుక్షణంచూస్తే, దాది స్పృహతప్పి పడి ఉన్నది; రాజకుమారుడు లేడు. ఎంత ఘోరం!" అన్నారు

ఈ భయంకర వార్తవిని రాజు దిమ్మెరపోయాడు. దేశమంతా దుఃఖంలో మునిగిపోయింది. రెండు రోజులపాటు ఎవరూ వంటలు చేసుకోలేదు. రాజకుమారుడు పోయిన దుఃఖంతోనే వారికి కడుపు నిండింది. ఎక్కడ చూసినా శోకం తాండవించింది.

మూడోనాడు మళ్ళీ మబ్బు కనిపించింది. అంతఃపురంలోకి ఒక రత్నాలు పొదిగిన ఉయ్యాలతొట్టె దిగింది. మబ్బు మాయమైపోయినాక చూస్తే, ఆ తొట్టెలో రాజకుమారుడు వేలు చీకుకుంటూ కనిపించాడు. తల్లి వెంటనే వాణ్ణి తీసుకుని, తన రొమ్ముకు హత్తుకున్నది. పిల్లవాడికి ముత్యాలకూర్పుచేసిన వలిపెపు దుస్తులున్నాయి; చేతులకూ, కాళ్ళకూ రత్నాలు తాపిన బంగారు మురుగులున్నాయి; వాడి మెడలో రత్నహారం ఉన్నది. తొట్టెలో పిల్లవాడితోబాటు ఆటవస్తువులున్నాయి. అందరూ ఆనందపారవశ్యంచెంది, బిడ్డను దీవించారు.

రాజు ఫకీర్లకోసం ఒక దివ్యమైన

రాజభవనం కట్టించి, అందులో వారికి అవసరమైన సదుపాయాలన్నీ కలిగించాడు. రాచకార్యాలు లేని వేళల్లో ఆయన అక్కడికివెళ్ళి, వాళ్ళ యోగ క్షేమాలు చూసేవాడు.

ప్రతినెలా మొట్టమొదటి గురువారం నాడు అదే మబ్బు దిగివచ్చి, రాజకుమారుణ్ణి ఎత్తుకుపోయేది రెండురోజులు గడిచాక, తిరిగి తెచ్చి, సరికొత్త ఆట వస్తువులతోనూ, అరుదైన వస్త్రాలతోనూ అప్పగించేది. వాటిని చూసిన వాళ్ళు విస్తుపోయేవాళ్ళు.

రాజకుమారుడి పుట్టినరోజున రాజు ఫకీర్లతో, "పిల్లవాణ్ణి ఎవరు తీసుకుపోయి తిరిగి పంపుతున్నారో నాకు బోధపడకుండా ఉన్నది. ఇది గొప్ప వింత ఇలా ఎంతకాలం జరుగుతుందో చూడాలి" అన్నాడు.

ఫకీర్లు రాజుతో, "ఒకపని చెయ్యండి. ఒక ఉత్తరం రాసి, పిల్లవాడి తొట్టెలో ఉంచండి," అన్నారు.

ఫకీర్ల సలహాపై రాజు ఈ విధంగా ఒక ఉత్తరం రాసి, పిల్లవాడి తొట్టెలో ఉంచాడు.

"నా కుమారుడిపట్ల మీరు చూపే వాత్సల్యమూ, దయా చూసి, నాకు మీ పరిచయం చేసుకోవాలని ఉంది. మీరు స్నేహపూర్వకంగా మీ సమాచారం అందజేసినట్టయితే నేను ఎంతో కృతజ్ఞుడనుగా ఉండగలను."

మామూలుప్రకారం పిల్లవాడు మాయమయాడు. ఆ సాయంకాలం రాజు ఫకీర్లతో కలిసి కూర్చుని ఉండగా, ఆయన సమీపంలో ఒక ఉత్తరం మడత పడింది. దాన్ని విప్పి చూడగా, అది రాజుకు సమాధానం; అది ఇలా ఉన్నది.

"నాయకుడా మిమ్మల్ని చూడాలనే ఉన్నది. మీకోసం ఒక సింహాసనం వస్తుంది మీరు వెంటనే వచ్చి, మనం కలుసుకోవటం మంచిది. మీరే లోటు."

రాజు ఫకీర్లతోసహా దేవతాసింహాసనం ఎక్కి కూర్చున్నాడు. అది ఆకాశంలోకి లేచి, కొంతసేపు ప్రయాణంచేసి, ఒక చోట దిగింది. అక్కడ మహత్తరమైన భవనాలూ, సన్నాహమూ కనిపించింది. గాని ఎవరూ ఉన్న జాడలేదు.

ఇంతలో ఎవరో రాజు కళ్లకూ, ఫకీర్ల కళ్లకూ అంజనం పూశారు. వాళ్ల కళ్ల నుంచి రెండు కన్నీటి చుక్కలు రాలే సరికి, తమకు స్వాగతం చెప్పటానికి సిద్ధంగా ఉన్న భూతాలు కనిపించారు. వాళ్లు మేలైన దుస్తులు ధరించి ఉన్నారు. వారి చేతుల్లో పన్నీరు చల్లటానికి బుడ్లు లున్నాయి

అజాద్ బఖ్త్ మరికొంచెం ముందుకు వెళ్లి, పదివేలమంది భూతాలను చూశాడు వాళ్లు రెండు సోల్పులలో నిలబడి ఉన్నారు. మధ్యలో రత్నఖచితమైన సింహాసనం ఉన్నది. దానిమీద షారుఖ్ కుమారుడైన మలిక్ షెబాలీ ఠీవిగా



కూర్చుని ఉన్నాడు. ఆయన ముందు భూతాలజాతికి చెందిన ఒక అందమైన పిల్ల కూర్చుని ఉన్నది. ఆమె రాజకుమారుడు భక్తియార్‌తో ఆడుకుంటున్నది.

సింహాసనానికి రెండుపక్కలా ఆసనాలు అమర్చి ఉన్నాయి. వాటిమీద కులీనులైన భూతాలు కూర్చుని ఉన్నారు. ఆజాద్‌బఖ్త్ రాజును చూడగానే మలిక్‌షేబాల్ లేచి, సింహాసనం దిగివచ్చి, ఆలింగనం చేసుకొని, తీసుకుపోయి, సింహాసనంమీద తన సరసన కూర్చోబెట్టుకున్నాడు. వాళ్లు ఎంతో ఆదరంతో మాట్లాడుకున్నారు. రోజంతా విందులతోనూ, వినోదాలతోనూ, సంగీతంతోనూ, నృత్యాలతోనూ గడిచిపోయింది.

రెండోరోజు తిరిగి రాజులిద్దరూ కలుసుకున్నప్పుడు, మలిక్‌షేబాల్ ఆజాద్‌బఖ్త్‌ను, ఫకీర్లను వెంట తెచ్చిన కారణం అడిగాడు. ఆజాద్‌బఖ్త్ ఆ ఫకీర్ల కథలన్నీ చెప్పి, భూతాలరాజు సహాయం అర్థిస్తూ, "వాళ్ళు, పాపం, చాలా ఆవదల పాలై, దౌర్భాగ్యాన్ని అనుభవించారు. ఇప్పుడు మీ సహాయంవల్ల వారి కోరికలు సిద్ధించినట్టయితే, ఎంతో మేలు జరుగుతుంది," అన్నాడు.

ఫకీర్ల పాట్లూ, రాజు కోరికా విన్న మీదట మలిక్‌షేబాల్, "తప్పకుండా! మీ ఆజ్ఞ ఉల్లంఘించను," అన్నాడు.

ఎక్కడెక్కడ ఉండే భూతాల రాజులూ వెంటనే తనవద్దకు రావలసిందనీ, ఎవరైనా తాత్సారంచేస్తే వాళ్లు తీవ్రంగా దండించబడి, బలాత్కారంగా ఈడ్చుకురాబడతారనీ, వచ్చేటప్పుడువాళ్లు తమవెంట ఉన్నమానవులను, స్త్రీలయేది, పురుషులయేది, వెంటబెట్టుకురావాలనీ, తమవద్ద ఉండే మనుషులను దాచినవాళ్లు

సకుటుంబంగా నాశనం అవుతారనీ ఉత్తరాలు రాసి, తన సేవకులద్వారా పంపాడు.

రాజు లిద్దరిమధ్యా, గొప్ప స్నేహ బంధం ఏర్పడింది. ఇద్దరూ సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నప్పుడు, మాటల మధ్య మలిక్‌షేబాల్ ఫకీర్లతో ఇలా అన్నాడు:

"నాకు పిల్లల కాంక్ష అమితంగా ఉండేది. కొడుకుగాని, కూతురుగాని కలిగితే మనుష్య జాతికి చెందిన రాజులతో వివాహసంబంధం పెట్టుకుందామను కున్నాను. ఇలా అనుకున్న తరవాత నా భార్య గర్భిణిగా ఉన్నట్టు తెలిసింది. రోజులు గడవగా గడవగా ఆమె ఈ పిల్లను కన్నది. ముందు అనుకున్న ప్రకారం ప్రపంచమంతా గాలించటానికి భూతాలను పంపాను. ఏ రాజుకుగాని కొడుకు పుట్టితే వాణ్ణి తెమ్మన్నాను. నా భూతాలువెళ్ళి కొద్ది సేపటికల్లా ఈ రాజకుమారుణ్ణి తెచ్చారు. నేనా పిల్లవాణ్ణి ఎత్తుకుని, నా కూతురికంటె ఎక్కువగా ప్రేమించాను. వాణ్ణి క్షణంకూడా విడవబుద్ధి కాలేదు. అందుచేత, నెలకొక సారి వాణ్ణి తెప్పించి, రెండేసి రోజుల పాటు ఉంచుకుంటున్నాను. అయితే వాణ్ణి విడిచి వాడి తల్లిదండ్రులు ఉండలేరు గనక, తిప్పి పంపిస్తూ వచ్చాను ఇప్పుడు మే మిద్దరమూ కలుసుకున్నాం గనక వీళ్ళిద్దరికీ పెళ్ళి చేస్తాను."

ఆజాద్‌బఖ్త్ ఈ మాటలకు ఎంతో సంతోషించి, "పిల్లవాడు మాయమవుతూ, మళ్ళీ కనిపిస్తూ ఉండటం చూసి మొదట ఖంగారుపడ్డాను. కాని మీ మాటలు విన్న మీదట నా ఆందోళనపోయి, పూర్తి సంతోషం కలిగింది. ఈ కొడుకు ఇప్పుడు మీవాడు. మీ ఇష్టంవచ్చినట్టు చెయ్యండి," అన్నాడు.

పది, పన్నెండు రోజులలోగా, భూత జాతికి చెందిన గొప్ప గొప్ప రాజులందరూ దిగారు. ముందుగా మలిక్ సాదిఖ్ తనవద్దఉన్న సుందరాంగిని విడిచిపెట్టవలసి వచ్చింది. అతనికది ఎంతమాత్రమూ ఇష్టంలేకపోయినా, గత్యంతరంలేక ఆమెను బయట పెట్టాడు.

తరవాత ఒమ్మాన్ భూతరాజు తన కుమార్తెను ఇచ్చుకోవలసి వచ్చింది; ఎద్దుమీద సవారీచేసిన నీమ్రోజ్ రాజకుమారుడు ఆమె కొరకే ఉన్మత్తుడై పోయాడు. ఒమ్మాన్‌రాజు చాలా కుంటి సాకులు చెప్పి, తన కుమార్తెను బయట పెట్టాడు.

యూరఫ్‌దీని రాజకుమార్తే, బెహజాద్‌ఖాన్‌ల ప్రస్తావన వచ్చినప్పుడు, వాళ్లను గురించే తమకు తెలియదని అందరూ ప్రమాణాలు చేశారు. చివరకు కుల్జుమ్‌నది రాజును అడిగితే అతను తల వంచుకుని, జవాబు చెప్పలేదు. మలిక్‌షేబాల్ అతనిపట్ల శాంతివహించి




వాళ్లను విడిచిపెట్టమని మంచిగా అడుగుతూ, విడిచిపెట్టకపోతే అపాయం ఉంటుందని హెచ్చరించాడు.

కుల్జుమ్‌నది భూతరాజు చేతులు జోడించి, "ఈ సందర్భం విశదపరుస్తాను సావధానంగా వినండి," అంటూ ఇలా చెప్పాడు:

"పర్షియా రాజు తన కొడుకును కలుసుకునేటందుకు నదివద్దకు రావటమూ, రాజకుమారుడు ఆత్రంగా గుర్రంతోసహా నదిలోకి ఉరకటమూ జరిగినప్పుడు, నేను అటుగా వేటకు పోతూ, ఆగి ఆ దృశ్యం చూస్తూ నిలబడ్డాను. ఇంతలో రాజకుమార్తె గుర్రం కూడా నదిలోకి దూకింది ఆమె నా కంట పడగానే నాకు తన్మయత్వం కలిగింది. ఆమెనూ, ఆమె ఎక్కిన ఆడగుర్రాన్నీ తీసుకురమ్మని తక్షణమే భూతాలను ఆజ్ఞాపించాను. బెహజాద్‌ఖాన్ కూడా తన గుర్రంతోసహా రాజకుమార్తె వెనకగా నదిలో దూకాడు. అతని ధైర్యసాహసాలకు ముచ్చటపడి, అతన్ని కూడా తెప్పించి, ఇద్దరినీ ఇంటికి తీసుకుపోయాను. వారిద్దరూ నావెంట క్షేమంగా ఉన్నారు."

ఇలా అని అతను వారిద్దరినీ తెప్పించి, మలిక్‌షేబాల్ ముందు పెట్టాడు.

సిరియా రాజకుమార్తె తెలిసినవారు ఒక్కరూ లేకపోయారు. పిలిచిన వారందరూ వచ్చారా అని విచారిస్తే, మోసల్‌సల్ జాదూ అనేవాడు, ఖాఫ్ పర్వతం మీద మాయచేత కోట నిర్మించినవాడు, రాలేదని తెలిసింది

"మేం బలాత్కారంగా అతన్ని తీసుకురాలేకపోయాం. ఆకోట దుర్భేద్యమైనది. అతను చాలా శక్తివంతుడు," అన్నారు భూతాలు.

ఈమాట వినేసరికి మలిక్‌షేబాల్‌కు చాలా ఆగ్రహం కలిగింది. ఆయన ఒక

పెద్ద సేనను నియోగిస్తూ, "అతను తానై, ఆ స్త్రీని వెంటబెట్టుకువస్తే నరే సరి, లేకపోతే చేతులూ కాళ్లూ కట్టి పట్టుకురండి. అతని కోటను నేలమట్టం చెయ్యండి," అని ఉత్తరువిచ్చాడు.

అసంఖ్యాకులైన సైనికులు వెళ్ళి, రెండురోజులలో తిరుగుబాటుదారుని గొలుసులతో బంధించి తెచ్చారు. రాజకుమార్తెను ఏం చేశావని మలిక షేబాల్ ఎన్నిసార్లు అడిగినా ఆ పొగరుబోతు సమాధానం చెప్పలేదు. రాజు కోపం, వచ్చి, తిరుగుబాటుదారును ముక్కలు ముక్కలుగా నరకమని ఉత్తరువిచ్చాడు. తరవాత భూతసైనికులువెళ్ళి ఖాఫ్ కొండమీద వెతికి రాజకుమార్తెను తెచ్చారు.

భూతాలరాజు కఠిన శాసనాలనూ, న్యాయబుద్ధినీ ఫకీర్లు చాలా మెచ్చుకున్నారు. రాజు ఆజాద్‌బఖ్త్ కూడా సంతోషించాడు. తరవాత రాజు స్త్రీలను అంతఃపురానికీ, పురుషులను రాజభవనానికీ పంపేశాడు. నగరమంతటా దీపాలంకరణ జరిగింది. పెళ్ళిళ్ళ సన్నాహాలు అతి శీఘ్రంగా సాగాయి.

మంచిముహూర్తంలో రాజకుమారుడు ఒక్తియార్‌కూ, రాజకుమార్తె రోషన్ అఖ్తర్‌కూ పెళ్ళి జరిగింది. అదే సమయంలో అరేబియా వర్తకుడు సిరియా రాజకుమార్తెనూ, పర్షియా రాజకుమారుడు బస్సోరా రాజకుమార్తెనూ, అజం రాజకుమారుడు (మూడవ ఫకీరు) యూరపు రాజకుమార్తెనూ, బెహజాద్ ఖాన్ నీమ్రోజ్ రాజకుమార్తెనూ, నీమ్రోజ్ రాజకుమారుడు భూతాలరాజు కుమార్తెనూ పెళ్ళాడారు. చీనారాజకుమారుడు ముసలి అంధుడి కుమార్తెను పెళ్ళాడాడు.

మలిక్‌షేబాల్ ధర్మాన అందరి కోరికలూ ఈడేరాయి. అందరూ నలభై రోజులపాటు సమస్త సుఖాలలోనూ ఓలలాడారు. చివరకు మలిక్‌షేబాల్ రాజకుమారులందరికి గొప్ప కానుకలిచ్చి, ఎవరిదేశానికి వారిని పంపేశాడు. బెహజాద్‌ఖాన్, అరేబియా వర్తకుడు మాత్రం ఆజాద్‌బఖ్త్ వెంట ఉండిపోగోరారు ఆజాద్‌బఖ్ వర్తకుణ్ణి కార్యదక్షుడుగానూ, బెహజాద్‌ఖాన్‌ను సర్వసేనానిగానూ నియమించాడు. అందరూ సుఖంగా ఉన్నారు

# జరుగుతున్నకథ




## గుత్తుల భాస్కరరావు

'రావ్ అండ్ రావ్ ఎడ్యుకేషనల్ ప్రమోటర్స్'లో నేను భాగస్వామిని, గుమాస్తాని, మా బాస్‌కి ఆంతరంగికుణ్ణి, ఆఫీసు బాయ్‌నీ, అన్నీను. ఆ మాటకొస్తే రావ్ అంటే మా బాస్. అండ్...రావ్ అంటే నేను. ఏదో బుల్లి వాటా. నా సేవలకి ఉబ్బితబ్బిబ్బయి వ్యాపారంలో నన్ను భాగస్వామిని చేసుకున్నారు బాస్. అంతేకానీ వ్యాపార రహస్యం చెప్పలేదాయన. ఎన్నోసార్లడిగాను. 'ఒరే అబ్బులూ (అది నా ముద్దుపేరు. ఆయన పెట్టిందే) సమయం సందర్భం రానీరా. డాబాకి-మేడకి, కారుకీ-జీపుకి, అసెంబ్లీకి-లోక్‌సభకి తేడా తెలీని వయసులో నిన్ను చేరదీసాను. యింతవాణ్ని చేసాను. నీ రుణం ఉంచుకోను. ఆ ఒక్క రహస్యం దాచుకుంటానా. ప్రస్తుతానికి భాగం అనుభవించు," అని నా ఉత్సాహాన్ని కొట్టిపారేసేవారు. నేను కూడా 'యస్ బాస్' అని ఆశ పెంచుకొనేవాణ్ని.

యింతకీ మా వ్యాపారం ఏమిటంటే.. పరీక్షల్లో దండయాత్రలుచేసే కుర్రకారుని మా బాస్ పాస్‌చేయిస్తారు. ఎలా చేయిస్తారోగానీ గొప్పగా చేయిస్తారు సబ్జెక్టుకు రెండొందలు పుచ్చుకుంటారు. చిత్రమేమిటంటే పరీక్షపోతే డబ్బు వాపసు యిచ్చేస్తారు. అదే మా వ్యాపారంలోని పెద్ద ఆకర్షణ. అందుకే క్లయింట్ల సంఖ్య నానాటికీ పెరుగుతూ

వస్తుంది. మా బాస్‌లాకాదు. ఆయన కంటే గొప్ప వ్యాపారస్తుణ్ని కావాలనేది నా చిరకాల వాంఛ.

మెట్లమీదనుంచి బాస్ పిలిచేవరకూ నే నీ లోకంలోలేను. "అరే అబ్బులూ చూశూ, ఎవరో బజర్ నొక్కుతున్నారు. క్లయింటులా ఉంది." "యస్ బాస్" అని లేచి గుమ్మంవైపు వెళ్లాను. బాస్ క్లయింటువాసన యిట్టే పసిగట్టారు. "మే ఐ కమిన్ ప్లీజ్" అన్నాడో వెటరనే. "రండిసార్. తలుపులు తీసే ఉన్నాయిగా," అని నవ్వుతూ ఆహ్వానించాను. బాస్ డ్రాయింగ్‌రూం అలకరించారు. "నా పేరు వెంకటరత్నం. విశ్వనాథంగారి ఉత్తరం యిచ్చారు"

"అర్థమయింది. ఏ కుర్రాడు ఏ పరీక్షకి ఎప్పుడు వెళ్ళాడు? నంబరెంత?"

"ఏం చెప్పకుంటే ఏం లాభంలెండి. నాకు నమ్మకం లేదు."

"అంత గడ్డు కేసా? అబ్బులూ వీరికి కోకాకోలా యివ్వు".

"అలాగే బాస్." యిచ్చాను.

"వాడికి బీకాంలో ఎకనమిక్సు మిగిలిపోయింది. నాలుగుసార్లు పరీక్షకి కూర్చున్నాడు. ప్రతిసారీ రెండుమూడు మార్కుల తేడాతో ఫెయిలవుతున్నాడు, నాకు విసుగెత్తి వాడిచేత కిళ్ళీకొట్టు పెట్టించాలనుకుంటున్నా"

"ఎందుకు? మాకో అవకాశం యిచ్చి చూడండి. రెండు మూడు మార్కుల్లో పోతుంటే—మిగతా మార్కులు వేయించి పాస్ చేయిస్తా."

"అయితే ఈ 'మే'కి పరీక్ష కట్టిస్తా."

"చూడండి. మా సంస్థలో గొప్పతనం చెప్పకోకూడదు. తప్పనిసరిగా పాస్‌చేయిస్తామని హామీ ఎవరికి యివ్వము... యిందులో మాకు మిగిలి చచ్చేదిలేదు. యిక్కడ డబ్బు తీసుకుంటాం. అక్కడ లంచాలు పెడతాం. నాలుగైదు మార్కుల తేడాతో పోయే కుర్రాళ్ళకి సాయంచేస్తాం. అంతకంటె ఎక్కువ మార్కులకి అక్కడా రిస్కు తీసుకోరు. కుర్రాడు పాసవ్వకపోతే డబ్బు తిరిగి యిచ్చేస్తాం. ఎలా ఉందంటారు?"

"చాలా చిత్రంగా ఉంది."

"మీ అబ్బాయి నంబర్ పేపర్లో చూసుకుంటే యింకా చిత్రంగా ఉంటుంది."

"అన్నట్టు రేటెంత ?"

"సబ్జెక్టుకి రెండువందలు."

"రెండుకాదు నాలుగు తీసుకోండి. ప్రస్తుతానికి రెండువందలు ఉంచండి. పాసయింతర్వాత మిగిలిన రెండువందలు బహుమతిగా యిస్తాను."

"ఎంతమాట. అలా కాకపోతే మీ సొమ్ము తిరిగియిస్తాను."

"అశుభానికి చోటివ్వకండి. మా అబ్బాయి పాసవుతాడనే గారంటీ యివ్వండి"




"మీ ఉత్సాహమే మా వ్యాపారానికి వెన్నెముక."

"అంగట్లో అన్నీ ఉన్నా అల్లుడి నోట్లో శనంటారు. జాతీయం అయినవీ కానివీ అన్ని బాంకుల్లో చచ్చేంత పరపతి ఉంది. కానీ వాడికి బీకాం ఆమడదూరంలో ఉండిపోయింది."

"దిగులు పెట్టుకోకండి మీ అబ్బాయి పాసయి వృద్ధిలోకి వస్తాడు. మా సంస్థకి గర్వకారణమవుతాడు."

"మంచిదండీ. అవునూ... నాకో సందేహం."

"శెలవివ్వండి"

"ప్రమోటర్స్ అని పేరు పెట్టుకొని యింత బాహాటంగా ఎలా చేస్తున్నారండీ పనులు."

"చంపేశారు. యింత రహస్య వ్యాపారం మరొకటి లేదు. తెలిసిన వాళ్ళ ఉత్తరాలద్వారా వస్తేనే ప్రవేశం. పై పురుగుకి ప్రవేశంలేదే."

"నిజంగా?"

"కాగితాలమీద మా సంస్థ ఏమిటో అడగరేం."

"చెప్పండి."

"పాపం, బీద విద్యార్థులకి తక్కువ వడ్డీలమీద పైచదువులకోసం ఋణాలిప్పిస్తుంది."

"గొప్ప మోసం," అన్నాడు నవ్వుతూ.

"మరేనండి, ఏదో పొట్టతిప్పలు. నా జానెడు పొట్టకోసం వీడి జానెడు పొట్టకోసం ... యింట్లోవాళ్ల జానెడు జానెడు పొట్టలకోసం — చెయ్యాలి తప్పదు."

"చాలా చమత్కారి మీరు".

"అబ్బాయికి మీరిలా ప్రయత్నించినట్టు చెప్పకండి. కష్టపడి చదవమనండి మనం కుర్రాళ్లని చేతులారా పాడుచెయ్యకూడదు."

"యిలాంటి సలహా ఎవరూ యివ్వలేదు. ఆశ్చర్యంగా ఉంది."

"అవునండి. అబ్బాయి పరీక్ష రాసిం

తర్వాత నంబరివ్వండి. పరీక్ష ఫలితాలకి వారంముందే మీకు కబురంపుతాను."

"మరి శెలవు" ఆయన నిష్క్రమించాడు బాస్ వివరాలన్నీ బ్లాక్ రిజిష్టర్‌లో వ్రాసుకున్నారు. మళ్ళీ మరో ఖాతాదారు తయారు

"నా పేరు లక్ష్మీపతి," అంటూ ఉత్తరం యిచ్చాడు బాస్‌కి బాస్ ఆయనకి కోకాకోలా యిమ్మన్నారు. ఆయనకి అందించాను. సేవించి "సబ్జెక్టుకి ఎంత?" అని అడిగారు.

"రెండువందలు."

"మైగాడ్. యిటీజ్ టూమచ్."

"మీకు టూమచ్‌గా ఉంటుంది కానీ మా బాధలు ఎవరికి తెలుసు? ఎన్ని గుమ్మాలు తొక్కాలి. ఎందరికి పంచాలి. మాకేం మిగిలిచావదు"

"చూడండి, నేనో బీద గుమాస్తాని. నా తమ్ముడి భవిష్యత్తుమీద కొండంత ఆశతో వచ్చాను. వాడికి కెమిస్ట్రీ ఒకటే డౌటు. ఒక్క వందతో తృప్తిపడండి."

"క్షమించాలి. డబ్బు విషయంలో పైమాటలేదు"

"ఒక్కసారి ఆలోచించండి."

"లక్ష్మీపతిగారూ, మీరు కేసు యివ్వండి. యివ్వకపోండి షరతులు వినండి రెండువందల చొప్పున తీసుకొని నాలుగైదు మార్కుల తేడాతో పోయినవాళ్లకి సాయంచేస్తాం. పని జరక్కపోతే డబ్బు వాపస్ యిస్తున్నాం కాదా. మార్జిన్ నాలుగైదు మార్కులు గాబట్టి కుర్రాడు కష్టపడి చదవాలి."

"ఏమన్నారూ? కుర్రాడు కష్టపడి చదవాలా. దిక్కుతోచక చీకట్లో తడుముకుంటున్న నాకు చక్కటి ఆశా కిరణం చూపించారు. అంత యిచ్చుకోలేను. వాణ్ని రాత్రింబగళ్ళు తోమి చదివించుకుంటాను ఎందుకు పాసవ్వడో చూస్తాను."

"వెరీగుడ్. మేం కాదంటామా?"

"వస్తాను."

"ఆగండి కన్సల్టేషన్ ఫీజు ఒక రూపాయి ఆ డబ్బీలో వెయ్యండి."

"యిది అందరికీ వర్తిస్తుందా?"

"అఫ్‌కోర్స్. పోయిన కేసులకే."

"అంటే కోకాకోలా ఖర్చన్నమాట.

"అలా అని ఎలా అనగలం... ఏదో..."

"ఇదుగో" అని సర్రున రూపాయి తీసి డబ్బీలో వేసి దూసుకుపోయాడు.

"కేసు జారిపోయింది, బాస్. రెండోవంద వాయిదాల పద్ధతి మీద ఏర్పాటుచెయ్యాల్సింది."

"మంచి అయిడియా. వాయిదాలంటే మిడిల్ క్లాసుకి పెద్ద మోజు. కళ్ళుమూసుకుని విమానం కొనడానికికూడా సిద్ధపడతారు"

మరో క్లయింటు కనిపించాడు. ఎవరో పల్లెటూరి ఆసామీ. ఒళ్ళంతా బంగారు మలామా, అరచెయ్యంత పులి

గోరు. మెడలో రెండు వి డి వి డి గొలుసులు. చెవులకి బండపోగులు, చేతులకి బంగారు కడియాలు, బాస్ చూసి కేసు బంగారమయి ఉంటుం దన్నారు.

"అంటే అన్ని సబ్జెక్టులూ పోయి ఉంటాయా బాస్?" అన్నాను. ఆయన నవ్వి "చూద్దాం" అన్నారు గొడుగు మూసుకుంటూ లోపలికి వచ్చాడు ఆసామీ "రండి రండ"ని ఆహ్వానించి బాస్ముందు కూర్చోబెట్టాను.

"విశ్వనాథంగారి ఉత్తరం యిచ్చారు. యివరాలన్నీ దాన్లో ఉన్నయ్."

"అబ్బాయి పరీక్షకు వెళ్తున్నాడండీ"

"ఆయ్. దాన్లో లేదాండే ఆడెన్ని సార్లు చెప్పినా గుర్తుండదు.''

"బిఎస్సీనా?"

ఆయ్. అదేనండీ. నోట్లోఆడతంది."

"రెండు పరీక్షలు పోయినట్టు రాశారు "

"ఆయ్. నాకు తెలవదండే. మీరూ మీరూ సూసోక్కండి డబ్బిడమే నా పని. ఆణ్ని గంగలో ముంచండి, నాకు తెలవదు. యదవ యదవ యదవన్నరని. ఆడికి సదువు రాదండి.''

''అబ్బులూ వీరికి..."

"కోకాకోలా యిస్తున్నా బాస్" అని యిచ్చాను తాగి "డబ్బెంతండే?"

"నాలుగు వందలు''.

"ఆయ్. అంతియ్యను!''

"అయితే."

"ఎయ్యి–ఎయ్యి రూపాయలిత్తాను."

ఉండబట్టలేక 'బాబోయ్' అన్నాను నేను. ఆసామీ కుర్చీలోంచి లేచిపోయాడు బాస్ నవ్వి "వాడంతే. పగటి నిద్ర. పైగా కలవరింతలూ" అన్నారు.

"అంతే బాస్" అన్నాను. ఆయన కూర్చొని "ఎంతిత్తానని చెప్పాను."

"వెయ్యి రూపాయలు."

"ఆయ్. ఒక సరతు. ముందు డబ్బి య్యను ప్యాసయితే క్యాసిత్తాను. కావాలంటే నోటు రాయించుకోండి."

"ఎంతమాట. నోటు అక్కరలేదు. మీ నోటిమాట చాలు. మీకే ఈ సదు పాయం. ఎవరికీ ఉరువు పెట్టం "

అరువు కాదండే. మిగతా ఆరొందలు మీకు నా బగుమతి.''

"సరే. అబ్బాయికి మీ ప్రయత్నం తెలియనివ్వకండి. బాగా చదవమనాలి."

"అదెట్టాగండి. ఆడు సదివితే మీదగ్గరెక్కందు కొత్తా."

"మీ వాణ్ని కష్టపెట్టాలని కాదు. మన కృషి మనది. వాడి కృషి వాడిది. ఏమంటారు?"

"ఏటంటాను మీరు చెప్పాక" అని వెళ్ళిపోయాడు గొడుగు విప్పుకుంటూ.

నాకు అవకాశం వచ్చింది. "వెయ్యేందుకు బాస్, నాలుగు వంద లివ్వక."

బాస్ నవ్వి "అదంతేరా అబ్బులూ!

అవసరంకొద్దీ కొందరు, సంతోషం కొద్దీ కొందరు. ఎందరో మహానుభావులు, వారందరికీ వందనాలు పెట్టాలి "

బాస్ చాలా ప్రసన్నంగా కనిపిస్తున్నారు. శుభ్రంగా తలంటుకొని పూజ ముగించుకొని పాపిటమధ్య కుంకుమ పెట్టుకున్నారేమో దేదీప్యమానంగా వెలిగిపోతున్నారు.

"ఏవిట్రా తినేసేలా చూస్తున్నావు?"

"వట్టినే బాస్. మన చేతిలో పని కదా. కొందర్ని పాస్‌చేయించి కొందర్ని అట్టే పెడతారెందుకు. డబ్బు వాపస్ యిచ్చే ఖర్మెందుకు."

"పిచ్చివాడా సరే యిప్పటికైనా నీకు చెప్పితీరాలి. తలుపులు దగ్గరగా వేసిరా."

"యస్ బాస్" అని గంతులో వెళ్లి తలుపులు బిగించాను.

"విను మనం ఎవర్నీ పాస్ చేయించడంలేదు. అదంత తేలికకాదు. ఒక వారంరోజుల ముందు హైదరాబాదు, విశాఖపట్నం వెళ్లి వాళ్ల కాళ్ళూ వీళ్ల కాళ్లూ పట్టుకొని పరీక్షా ఫలితాలు, మార్కులు తెలుసుకుంటున్నాం."

"నిజంగానా బాస్ "

"మ రేమనుకున్నావ్ "

"అయితే వీళ్లంతా ఎవరికి వాళ్లు పాసయినవాళ్లేనా?"

"అవును. కొందరు...ఎవరికి వాళ్ళు పాసవుతున్నారు. మిగతావాళ్ళు ఎవరికి వాళ్ళు ఫెయిలవుతున్నారు. యిందులో మన లిఫ్టేమీలేదు "

"గొప్పగా ఉంది బాస్."

"మనం పేరెంట్సుని హెచ్చరిస్తూ వస్తున్నాం ప్రతిసారీ. అబ్బాయి కష్టపడి చదవాలి. నాలుగైదు మార్కుల తేడాలో సాయం జరుగుతుందని."

"అవును."

"పిచ్చివాళ్ల. యింకెంత దూరం. బాగా కష్టపడి మొత్తం లాగించేస్తున్నారు యిట్టే పాసయి డబ్బు మనపరం చేస్తున్నారు."

"మరి పోయినవాళ్లు."

"చెబుతున్నాంగా సంజాయిషి, మళ్ళీ సారి విజయం తథ్యమని భుజం తడుతున్నాం. రిజల్ట్సు రాకుండానే డబ్బు తిరిగి యిచ్చేస్తున్నాం. యింకేంకావాలి."

"ప్రజల వెర్రితనమే మన పెట్టుబడన్నమాట. వాళ్లెంత అమాయకులు బాస్."

"ప్రజలవరకూ ఎందుకురా. నీ మాట చెప్పు. నాతో ఉంటూ యిన్నాళ్లూ కనిపెట్టగలిగావా?"

"లేదు బాస్."

"అదీ మన వ్యాపార రహస్యం. జాగ్రత్త. మాట తూలితే మనం బోర్డు దించి శంకరగిరి మాన్యాలు పట్టాలి."

"అంతఫూల్‌ని కాదు బాస్."

"కొంత ఫూల్‌వన్న మాటేగా".

యిద్దరం కడుపునిండా నవ్వుకున్నాం.

---




'...మా అమ్మమ్మని మా తాతయ్య కొట్టేవాడు. నోరెత్తేదిగాదు. మాబామ్మని మరో తాతయ్యా, నలుగురెదుటా అవమానించేవాడు. కిక్కురు మనేదిగాదు. ఎందుకు అన్న ప్రశ్న వచ్చేదిగాదు. మా అమ్మని నాన్న తిట్టడం నే నెరుగుదును. చాటున కళ్ళు వత్తుకుని ముక్కు చీదుకునేది అమ్మ. చీదుకుని నన్ను కావలించుకొని, 'నాన్నా, నువ్వుమాత్రం ఇట్లా చెయ్యొవద్దురా' అనేది. నేనుమాత్రం ఇట్లా చెయ్యను అనుకునేవాణ్ణి. ఇప్పుడు అట్లా చెయ్యటంలేదుకూడాను.

స్త్రీ మగవాడి ఆస్తిక్రింద చలామణి అయే రోజులు పోయేయి నేటి స్త్రీ అట్లా పడివుండటం లేదు తనకూ ఒక వ్యక్తిత్వం వుందనీ- తనూ మనిషేననీ- అంటూవుంది. తన అస్తిత్వాన్ని నిల్పుకోటాన్కి ప్రయత్నం చేస్తూవుంది. పోరాటం సల్పుతూవుంది. ఆ ప్రయత్నంలో గెలుపు సాధిస్తూవుంది. ఇది శుభ పరిణామం. ఏ దేశంలో అయితే స్త్రీ వ్యక్తిగా గుర్తింపబడుతుందో- ఏ దేశప్రజలు స్త్రీని దేవతగా ఆరాధిస్తారో- ఆ దేశంయొక్క సంప్రదాయం వుత్కృష్టమైనదిగా పరిగణింపబడుతుంది. ఈ సిద్ధాంతం మన దేశంలో అనాదిగా

వున్నది– కానయితే మధ్యకాలంలో విస్మరింపబడింది. ఇవాళమాత్రం స్త్రీ హక్కులు గుర్తించబడినయి. స్త్రీ వ్యక్తిత్వానికి పరిగణన లభించుతూంది. పురుషుడు స్త్రీని అర్థం చేసుకోవటాన్కి ప్రయత్నిస్తున్నాడు. ఆమె పురోగతిలో చాతనయిన సాయం చేస్తూవున్నాడు. ఇది గొప్ప పరిణామం. అందుకే నేటి స్త్రీ కృషిని మనం ప్రశంసించాలి. అందుకు సహకరిస్తున్న పురుషుడి ధోరణి హర్షించబడాలి. ఇతక్కృష్టతని మనం గ్రహించాలి. గ్రహించి నేటి నవ భారత నవలామణికి అన్నివిధాలా చేయూతనివ్వాలి'... రాంరావు వుపన్యాసం ముగిసింది. కరతాళ ధ్వనులతో హాలు మారుమ్రోగింది. ముందువరసలో కూర్చునివున్న రాంరావుభార్య రాంభాయి చిరునవ్వుతో గర్వంగా భర్తని చూసింది.

మీటింగు అయి బయటికి వచ్చాక రాంభాయి సినిమా ప్రపోజలు పెట్టింది.

'ఇంటికెళ్లొద్దూ? పిల్లలువచ్చి అల్లరి చేస్తారేమో?' అన్నాడు రాంరావు, ఆలోచిస్తూ. 'ఫర్లేదులెద్దురూ. సీత వుందిగా. చూసుకుంటుందలే,' అంది రాంభాయి.

వాళ్ళు ఎక్కిన రిక్షా సినిమాహాలు వయిపు పరుగెత్తింది.

సరిగా అదేసమయంలో 'రాంరావు ఇంటి'దగ్గర సీత పోయి రాజేసి మండని కట్టెలతో యుద్ధం చేస్తూంది. ఆ ఇంట్లో మూడు సంసారాలున్నాయి. అందులో ఒకటి భీంరావుగారిది. ఆయనకి ఆయన భార్యకి ఒకరిజోలి పట్టదు. సంతానం లేదు. ఆయనది మంచి వుద్యోగమే. వెనకాల ఆస్తివుంది. వంటపనిలేదు. భార్యాభర్తలు ఇద్దరూ 'టిప్‌టాప్'గా తిరిగి హోటల్‌లో భోంచేసివచ్చి తలుపులు మూసుకుంటారు. రెండవది రాంరావు సంసారం. భార్య రాంభాయి. ముగ్గురు పిల్లలు. గారాబం ఎక్కువ. అందుకే ముగ్గుర్నీ మూడు కోతులనవచ్చు. ఇంట్లో రాంభాయిమాటే రాంబాణం రాంరావు భార్యకి జడుస్తాడు అంటే ఒప్పుకోడు రాంరావుది చిన్న వుద్యోగం, బి. ఎల్. చదివాడు అందువలన లాజిక్కుతీసి, తన 'హెన్‌పెక్‌డ్‌నెస్'కి కొత్త అర్థాలు చెపుతాడు. పైగా రాంరావు రచయిత. స్టేజి ఎక్కితే అతన్ని పట్టుకోవటం కష్టం. అతని వుపన్యాసాలు శ్రోతలకి తమాషాగా వుంటాయి దాన్ని అభినందనగా తీసుకుని అతను పొంగిపోతాడు. సీత రాంరావుకి చెల్లెలు. భర్త ఈ మధ్యనే పోయేడు. అప్పట్నుంచి ఆమె అన్న పంచన చేరింది. రాంరావుకి చెల్లెలంటే విపరీతమయిన జాలి. కాని అది చూపించటానికి రాంరావు వెనకాడతాడు. రాంభాయిమీద తన గౌరవాభిమానాలే అందుకు కారణం అని అనుకుని తృప్తి పడతాడు. అభ్యుదయ భావాలుగల తన భర్త మరి భార్య మాటకి విలువ ఇవ్వాలిగదా!

ఆ మధ్యాహ్నం, మీటింగుకి బయలు దేరేటప్పుడు రాంరావు భార్యని సంప్ర దించాడు. 'సీతనుకూడ తీసుకెడదాం, ఏమంటావు?' అని.

'సీత ఎందుకూ?!' అని ఆశ్చర్య పోయింది రాంభాయి.

'వూరికే. మనతోపాటు వస్తుంది. రానీరాదా?'

'మీరు భలేవారండి! ఇల్లు ఏమయి పోవాలి?పిల్లలు స్కూళ్ళనించి వస్తారు. వంటపని—ఇంటిపని ఎట్లా? వచ్చినాక మీరు చేస్తారా?' అంటు అడ్డుపడింది. రాంబాబు అదేదో ఆతని డ్యూటి అయి నట్లుగా. రాంరావు తెల్లమొహం వేసేడు. 'అవు న్నిజం' అని గొణిగి భార్యవెంట మీటింగుకి బయలుదేరాడు అతనికి అంత తృప్తిగాలేదు. కాని సంసారం సాఫీగా సాగాలంటె కొన్ని కొన్ని కోరి కల్ని భర్తో, భార్యో చంపుకోవాలి. తప్పదు, అనుకొని నోరుమూసాడు, రాంరావు

సినిమాలో భార్య పక్కనకూర్చున్నా డన్నమాటేగాని రాంరావు సీతగురించి ఆలోచిస్తూనే వున్నాడు ఒక్కగా ఒక్క తోబుట్టువు. తలిదండ్రులు లేరు. భర్త పోయి నిండుయవ్వనాన్ని అడివి గాచిన వెన్నెలచేసుకుని తన పంచన చేరింది. ఆమెకోసం తను ఏం చేయ్య గల్గుతున్నాడు? స్టేజిఎక్కి స్త్రీ జనాభ్యు దయం గురించి వుపన్యాసమైతే ఉద్రే కంగా దంచేడుగాని ఆచరణలో ఏం చెయ్యగల్గుతున్నాడు?

సరిగా అదేప్రశ్న, అదే సమయంలో, తన గది తలుపుదగ్గర కూర్చుని సందు ల్నుంచి సీతనిచూస్తూ, తనకి తనూ వేసు కున్నాడు రంగారావు. రంగారావు చిరు ద్యోగి. వెనకముందూ ఎవరూ లేరు స్నేహితులే అతని బంధువులు. ఆతను ఫైల్‌మాన్‌లా గుంటాడు. వ్యాయామం చేసిన శరీరం. కాని కారునలుపు. తనని చూసి ఏ ఆడపిల్లా మస్ఫూర్తిగా ఇష్టపడ దని అతను స్వానుభవంవలన నేర్చు కున్నాడు అందుకే రంగారావుకి ఆడ పిల్లలంటే అభిమానం, జాలి. రంగారావు పత్రికలు అదేపనిగా చదువుతాడు. మీటింగుల కెళ్ళి ఉపన్యాసాలు వంట పట్టించుకుంటాడు. రాంరావు ఆ ప్రాంతపు ఆస్థాన ఉపన్యాసకుడు గనుక రంగారావు రాంరావు ఉపన్యా సాలుకూడ అనేకసార్లు వినివున్నాడు. విని రాంరావుమీద గౌరవం పెంచు కున్నాడు అయితే, ఆ గౌరవం ఈమధ్యన పునాదుల్తోసహా కదిలిపో ఉంది

ఇంటిఅద్దె భరించలేనని, తన పోర్ష నులో ఒకగదిని రంగారావుకి అద్దెకిచ్చాడు రాంరావు. ప్రత్యక్షంగా అన్నీ చూస్తూ రాంరావు ఉపన్యాసాలు గుర్తుకుతచ్చు కొని ఇప్పుడు పళ్ళు నూరుతాడు రంగా రావు. 'దమ్ము లేదు. పెళ్ళాంచెపినట్ట ఆడే దద్దమ్మ. గతిలేక పంచను చేరని,

స్వంత చెల్లెలనయినా జాలిలేక పని మనిషిగా ఆ పిల్లని ఉపయోగించుకొని అన్యాయం చేస్తున్నాడు. ఎందుకు వీడి ఉపన్యాసాలు?' అని గింగిలలాడుతాడు రంగారావు. మరి - గదిలో తను చేరి నప్పట్నుంచి చూస్తున్నాడు. అతను అప్పట్నుంచి సీతకి సానుభూతి తెల పాలని ప్రయత్నం. కాని అటునుంచి రెస్పాన్సు లేదు.

కట్టెలు మండటంలేదు.

పొగకి కళ్ళలో నీరు కారుతున్నాయి. పొయిమీద ఎసరుపెట్టి కళ్ళుతుడుచుకొని బావిలోంచి నీళ్ళుతోడాలని బిందెతీసుకు వెళ్ళింది సీత.

అదేసమయానికి మొహం కడుక్కు నేందుకు అక్కడికి వచ్చాడు రంగారావు.

'పాపం ఒక్కళ్ళూ, ఎంత శ్రమ పడ్తున్నారు? ఇంత కష్టమయిన పన్లు మీరు చెయ్యగల్రా? ఆగండి, నేను తోడు తాను' అని చేద అందుకున్నాడు రంగా రావు

సీత మాట్లాడలేదు, మెదలకుండా అవతలకి వెళ్ళిపోయింది.

అరగంట తర్వాత ఆమె బావిదగ్గ రకి వచ్చేసరికి రంగారావు లేడు కాని బిందెలన్నీ నీళ్ళతో నింపివున్నాయి

కోతులు ఇల్లుచేరేసరికి వంటయింది. కాని అమ్మాబాబుల్లేరని గొడవచేసి అలిగి, అన్నం తినకుండానే పడుకున్నాయి కోతులు, సీత ఎంత బతిమాలినాకూడా వినకుండానె. సినిమానించి వచ్చాక మొగుడుతో కలిసి ఫోంచేస్తూ, సీత పిల్లలకి అన్నాలు పెట్టనందుకు అరిచి అక్షింతలువేసింది రాంబాయి. హోట ల్నించి, ఫోంచేసి అప్పుడే వచ్చిన రంగారావు, అది విని 'యుద్ధం మొదలై నట్లుంది, పాపం!' అనుకున్నాడు ఓ సెకన్సనవలని తిరగేసి ఆ వులించి రంగారావు లైటార్పేసరికి ప్రక్కగది తలుపుసందునించి కిరకిరలు, గలగలలూ వినవచ్చాయి 'వీళ్ళ కిక పనిలేనట్లుంది?' అనుకుని రంగారావు వెనకతలుపుతీసి పెరట్లోకి వెళ్ళేడు, సిగరెట్టు వెలింగిచు కొని

బావిదగ్గర, వెన్నెట్లో ఇన్ని అంట్లు ముందేసుకుని గరగర తోమిపడే స్తూంది, సీత.

'పాపం! ఒక్కరూ చీకట్లో పనిచేసు కుంటున్నారా,' అంటు నూతి గట్టుమీద కూర్చున్నాడు రంగారావు సీత మాట్లాడ లేదు.

'ఏమండీ? నాతో మాట్లాడరు? నన్ను చూస్తే అసహ్యమా?' అన్నాడు. సీత నవ్వునాపుకుంది.

'నన్ను చూస్తేఎవరయినా అంతేలెండి. నాకు అందంలేదు. అందువలన ఎవరికి మాత్రం నాతో మాట్లాడాలని వుంటుంది?' అన్నాడు జాలిగా, మళ్ళీ 'అదేం లేదులెండి. మీకేం తక్కువ? మగ మహారాజులు.' అంది సీత జాలిపడి.

అడదానికి గుండెల్లో కొంచెం జాలి కలిగిందంటె, వరద కట్టకి గండీపడి నట్లె. 'అదిగాదండి. అసలు నాకే ముందని? తల్లా? తండ్రా? తోడబుట్టిన వాళ్ళా? ఎవరూ లేరు. తోడు లేరు. ఎందుకు నా బ్రతుకు' నేనంటే అందరికీ అసహ్యం. అప్పుడప్పుడు చచ్చిపోదా మనిపిస్తుంది '- అన్నాడు అవకాశం దొరకబుచ్చుకొని.

సీతగుండె ఆర్ద్రమయింది.

'అయ్యో. అంతపని చెయ్యకండి' అంది సీత కంగారుగా.

'సీతగారు! మీరే చెప్పండి. ప్లీజ్. నేను ఎందుకు బ్రతకాలి? ఎవరికోసమని? నేను, నా వుద్యోగం, నా సంపాదన- ఇవన్నీ ఎందుకు? మీమట్టుకుమీరు నన్ను అసహ్యించుకుంటున్నారు. అందు కే ఇంతకాలంగా నేను మీ సానుభూతి కోసం ఎంత ప్రయత్నించినా మీరు కఠినంగా తప్పుకు తిరుగుతున్నారు. అవునా?'

మగబుద్ధి అంతే.

ఆడదాని మనసు కరిగిందని గ్రహిస్తే చాలు దాన్ని ఎక్స్‌ప్లాయిట్ చెయ్యటానికి ప్రయత్నిస్తాడు, మగాడు.

'అదిగాదండి...నేను.. నేను. అయ్యో మీకెలా చెప్పను?'

'సర్లెండి. ఒక మాట చెప్పండి. నేనంటే మీకు అసహ్యమా?'

కాదని తల అడ్డుగా తిప్పింది, సీత.

"అది చాలు నాకు. థాంక్స్. మరి నాతో మాట్లాడటానికి మీకు అభ్యం తరం లేదుగా?'అంటూ సీతని 'కార్నర్' చేసాడు రంగ్రావు.

'అదిగాదు ... నేను ... నా భర్త పోయారు. గతిలేక ఈ పంచనుచేరాను నాతో మీకు మాటలేమిటి? ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు?'- అంది భయంగా.

'పిచ్చి సీతా! అదా నీ భయం? మీ అన్నను అడుగు. ఒక వుపన్యాసం ఇవ్వమను. తెలుస్తుంది. స్త్రీజనాభ్యు దయంకోసం అతను అహర్నిశలూ పాటు పడుతున్నాడు. వీరేశలింగం గురించి చెపుతాడు. విధవా వివాహాల్ని గురించి మాట్లాడ్తాడు. విడాకులంటూ లెక్చ ర్లిస్తాడు. ప్రపచం మారుతోంది సీతా! నాలాంటివాడు సిద్ధపడితే నీవు మరలా వివాహం ఎందుకు చేసుకోవు? నీకేం తక్కువని? అన్యాయంగా నిన్ను వాళ్ళు పనిమనిషిగా వాడుకుంటున్నారే? నీ జీవితం ఇట్లా అడివిగాచిన వెన్నెల కావలసిందేనా? నీ గురించి ఎవరికి జాలి? ఛీ. ఈ ప్రపంచానికి దయలేదు. సాను భూతి లేదు. పైగా దక్కేది చివాట్లూ, ఛీదరింపులేగా? అదే నా బాధ..'

కన్నీరు పెట్టుకొని సీత తోమిన గిన్నెలు తీసుకుని ఇంట్లోకి వెళ్ళి పోయింది. సీత మరల వస్తుందని చాలా

సేవు చూసి రంగ్రావు ఇంటో కెళ్ళి నిద్ర పోయాడు.

ఈ ప్రపంచంలో అనాదిగా దోపిడీ సాగుతూనే వస్తూవుంది.

ఎదుటి మనిషి వీక్‌పాయింటు పట్టుకుని, 'ఎక్స్‌ప్లాయిట్' చేయాలన్న తాపత్రయం మనిషిని పిచ్చివాణ్ని చేస్తుంది.

స్నేహితుడింటికి అని—ఆ మర్నాడు రాంరావు, భార్యని, పిల్లల్ని తీసుకుని, సీతని ఇంటికి కాపలావుంచి, వెళ్ళినప్పుడు, మరల సీతని పట్టుకున్నాడు రంగ్రావు.

'సీతా! నా గురించి నీకు సందేహం వద్దు. నువ్వు సరేనంటె ఈ క్షణాన నిన్ను పెళ్ళిచేసుకోటానికి సిద్ధంగా వున్నాను. నా మాట విను. ఎన్నాళ్ళీ చాకిరీ, ఈ నరకం? ప్చ్. వద్దు. సీతా! నువ్విట్లా అన్యాయ మవటం నేను సహించలేను,' అన్నాడు.

సీత కన్నీరు పెట్టుకొని జాలిగా చూసింది

'సీతా! నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తాను. నీకోసం ఏమయినాచేస్తాను. దేవతలా పూజిస్తాను. నన్ను అనుగ్రహించు. ప్లీజ్!' అని బ్రతిమాలాడు

'నేను అభ్యుదయవాదిని. నీ మనసు కేం కష్టంరాకుండా చూసుకుంటాను మీ అన్నయ్య, వదిన్ని చూసుకున్న దానికంటె బాగా చూస్తాను. ఇంక నన్ను ఏడ్పించకు. సీతా. ప్లీజ్. నన్ను కాదనకు,' అంటూ కన్నీటితో పిచ్చిగా చూస్తూవున్న సీతని ఆవేశంగా చేతుల్లోకి తీసుకోబోయాడు.

ఒక్కసారిగా మేల్కొన్నట్లయి 'వద్దు. వద్దు,' అని విదిలించుకుని పారిపోయి తలుపేసుకుంది సీత, జాలిగొలిపేట్టు ఏడుస్తూ.

రంగారావు విలవిలలాడిపోయేడు.

కసిగా పళ్ళు కొరుక్కున్నాడు.

'రాంరావ్! ఏది నీ అభ్యుదయం? నీ పిండాకూడు. రాస్కెల్, నువ్వు పెళ్ళాం పిల్లలతో షికార్లుకొట్టి కులుకుతున్నావ్. ఇవతల నీ రక్తం పంచుకు పుట్టిన తోబుట్టువు, దిక్కుతోచక గిలగిల కొట్టుకుంటూ వుంది. ఏం పట్టించుకొన్నావ్? ఏంచేస్తున్నావ్? నిన్ను ఏం చేస్తే పాపం వుంటుంది? ఎదటివాడి కయితే ఉపన్యాసాలు దంచుతావ్? అదేగా నీ తీరు. ఉండు నీ పని చెపుతాను,' అనుకుని గది తలుపులు 'ధాం' మనివేసి వెళ్ళిపోయాడు, బైటకి. పూర్తిగా సీతని ఎక్స్‌ప్లాయిట్ చెయ్యలేక రంగ్రాపయితే రాంరావునికోపంతో అన్ని మాటలన్నాడు కాని రాంరావులో నిజాయితీ లేకపోలేదు. రాంరావు సీత గురించి రోజూ తెగబాధపడిపోతూనే వున్నాడు. కాని అది బయటికి వెలిబుచ్చటానికి అవకాశాలు లేవు. ఒక ఆడదే తోటి ఆడదాన్ని అవసరంకోసం వాడు

కొనాలని, అణచి వుంచాలని స్వార్థంతో తాపత్రయం పడిన పరిస్థితి ఎదురైనపుడు ఏ మగవెధవమాత్రం ఏం చెయ్య గల్గుతాడు ? ఒకవేళ చెయ్యటానికి ప్రయత్నించి, చిత్తశాంతీ, గృహశాంతీ కరువైతే ఎలా సంసారం సాగిస్తాడు ? ఇది బహు సున్నితమయిన సమస్య. ఓర్పు-నేర్పువున్నా పరిస్థితులు అనుకూలించకపోతే అట్టివాడు రాంరావులాగ తిట్లు తినవలసిందే.

అక్కడికీ రాంరావు ఒకటి రెండు సార్లు సీత పునర్వివాహం గురించి రాంబాయితో ప్రస్తావించాడు. ఆమె ఉగ్రురాలై 'ఛీ వూరుకోండి. మన ఇంటా వంటా లేదు' అంది. రాంరావు నచ్చ చెప్పబోయాడు. 'మీకు పిచ్చి ఎక్క లేదుగదా! ఒకవేళ ఏ పిచ్చివాడో ముందుకొచ్చినా, వాడు ఈ రెండో పెళ్లి దాన్ని చిరకాలం ఏలుకుంటాడన్న నమ్మకం ఏమిటి? లేనిపోని లంపటం. పైగా- నా వంట్లో బాగా లేదని మీకు తెల్సు. పనిమనిషిని పెట్టగలమా ? సీతని అలా పంపేస్తే మన గతి ఏంగాను ? మీరు పడతారా ఆఫీసు బాధా ? ప్లస్ ఇంటిగొడవా రెండూ ? అలా అయితే చెప్పండి?' అని రాంరావుని నొక్కిపట్టింది.

రాంరావు హతాశుడై ఊరుకుండిపోయాడు.

'కనుక నోర్మూసుకొని మీ ఆదర్శాలని ఉపన్యాసాల వరకే పరిమితం చెయ్యండి. అందరికీ మంచిది,' అని హితోపదేశం చేసింది రాంబాయి. సంఘ సంస్కారం గురించి పదేపదే వాగేవాడికి ఇటువంటి పరిస్థితి ఎదురైనపుడు మనసు గిలగిలలాడుతుంది.

ఆదర్శాలు మాటిమాటికి గుర్తువచ్చి గుండెల్ని తొలిచేస్తయి.

అయినా స్వార్థానిది పైచెయ్యి అయినపుడు మనస్సు కిక్కురుమనకుండా చచ్చి వూర్కుంటుంది.

ఆ మర్నాడు చెయ్యదల్చుకున్న పనిని చేసాడు రంగ్రావు, ఆవేళ పరులకి ముందూ వెనుకా వుండదు. సాయంత్రానికి-ఆఫీసులో పగలల్లా కొట్టుకుని అలిసి గొడుగు చేతపట్టుకుని ఇల్లు చేరిన రాంరావుని, కాపువేసివున్న రంగారావు, 'ఏమండీ! రాంరావుగారూ! మాట' అని పిలిచి అవతలకి తీసుకెళ్ళాడు.

'ఏమిట్రా బాబు?'అనుకుంటూ వెళ్లిన రాంరావు చెవిలో చెవిపెట్టి 'నా మాట విని ఒక పని చేస్తారా? చేస్తే అందరికీ మంచిది. లేకపోతే అల్లరితప్ప ఏం మిగలదు?'అన్నాడు, రంగారావు. 'ఏమిటండీ విషయం?' అని ఆశ్చర్యంగా చూసేడు రాంరావు.

'మీ సీతని నా కిచ్చి పెళ్ళిచేయండి' అన్నాడు రంగారావు తాపీగా.

'ఏం? ఎందుకని?' అని కళ్లెర్ర చేసాడు రాంరావు.

'వినండి మరి. నేను సీతకి కడుపు చేసేను. తర్వాత మీ ఇష్టం,' ధీమాగా అన్నాడురంగ్రావు మరుక్షణం రాంరావు

గొడుగు రంగారావుమీద విరుచుకు పడింది. తల్చుకుంటే రాంరావుని, అతని గొడుగునీ పట్టుకుని వంగదీసి మూలను పెట్టగలశక్తి కండలు తిరిగిన రంగారావు శరీరానికుంది కాని రంగారావు పూర్కాని దెబ్బలు తిన్నాడు! ఎదురు తిరగలేదు.

రంగారావు తల పగిలి రక్తం వరద లైంది. ఈలోగా షికారెళ్ళి వచ్చిన భీంరావు దంపతులు 'అరెరె! ఏమిటది ? ఏమయింది ? అయ్యయ్యో...' అంటూ కేకలు వేసారు. ఆ కేకల్నీ, రక్తాన్నీ చూసి కన్ను చెదిరిన రాంరావు పరుగెత్తేడు, పిచ్చాడలాగా.

ఆ రాత్రి రాంరావుకోసం చూసిచూసి-అన్నాలు తిని రాంభాయీ, పిల్లలూ నిద్రపోయేక-నెత్తిమీద కట్లతో మంచం మీద పడుకుని, పైన వాసాలు లెక్క పెడ్తున్న రంగారావు దగ్గరకి- వెనక తలుపుతోసుకుని. దొంగచాటుగా కాఫీ గ్లాసు తీసుకువచ్చింది సీత.

వచ్చి, ఇచ్చి, 'ఏమండీ ఏమయింది? అసలు అన్నయ్య మిమ్మల్నెందుకు కొట్టేడు?'-అని ఏడ్చింది. 'అయితే నువ్వు చూశావన్నమాట?' అన్నాడు. తలూపింది. సీత.

రంగారావు వీరోచితంగా నవ్వాడు.

నవ్వి, 'సీతా! ఏం చెప్పమంటావు' ఇప్పటి కిది అదృష్టమేననాలి. రేపు, ఇంటికి తిరిగివస్తే మీ అన్నయ్య నన్ను పొడిచి చంపేస్తాడు. ఖాయం' అన్నాడు.

'అయ్యో! ఎట్లాగ ? అసలు ఎందుకొచ్చింది గొడవ?' అంది సీత జాలిగా.

'నీ గురించే సీతా ! లేకపోతే అసలు మాకేం గొడవలున్నాయి? పోన్లె, నేను నీ గురించి ప్రాణాలు వొదులుకోడానికైనా సిద్ధం. సంతోషంగా పోతాను కాని సీతా! నీ గురించే నా బాధ నీ సుఖం గురించే నా తాపత్రయం. ఒకవేళ నేను మీ అన్నయ్య చేతుల్లో చచ్చిపోయినా నన్ను గుర్తుంచుకుంటావు గదూ!' అని జాలిగొలిపేట్టు అన్నాడు రంగారావు

ఎక్స్‌ప్లాయిటేషన్ పూర్తయింది !

రంగారావు పాదాలదగ్గర కూలబడి వాటిని కన్నీళ్లతో తడిపింది సీత.

భయంతో రాత్రి ఎక్కడెక్కడో తిరిగి తిరిగి-బిక్కుబిక్కుమంటు మరునాడు ప్రొద్దుగూకి ఇల్లు చేరిన రాంరావుని-ఖాళీ అయిన రంగారావు గదీ - దావానంలాగ మండిపోతున్న రాంభాయీ పల్కరించారు, చిటపటగా. ఆ చిటపటల్ద్వారా-

-సీతని రంగారావు తీసుకెళ్ళిపోయిన వైనం విని రాంరావు ఒక విధంగా సంతోషించాడు-కాగల కార్యం గంధర్వులు తీర్చినందుకు. మరొక రకంగా విచారించాడు, చచ్చిపోయిన మనసు మరల బ్రతికి తిట్టిన తిట్లకి.

ఆ తర్వాత భీంరావుద్వారా రాంరావుకి తెల్సింది-వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకుని ఆ వూళ్ళోనే వేరేచోట కాపురంపెట్టి సుఖంగా వున్నట్టు తెల్సి ఆశ్చర్యానందవిచారాల్తో నిట్టూర్చాడు, రాంరావు.




(గత సంచిక తరువాయి)

"చూడండీ, ఈబిడ్డలకు మీరున్నారు. ఫర్వాలేదు. అయినాసరే ఇప్పుడే వాళ్ళని విడచి చావలేను. నాకు బలవన్మరణం వద్దు. ప్రశాంతంగా ఆఖరిశ్వాస మీ ఒడిలోనే తీసుకోవాలని వుంది. నన్ను ఆత్మహత్యకు పాల్పడేట్టు చేయకండి." అన్నాను భోరున ఏడుస్తూ. ఆయన విస్తుపోయారు. "ఏమిటి దేవీ, ఏమిటీ కొత్త ధోరణి? ఈ రోజు నీ కేమైంది?" అంటూ ఎంతో ఆత్రంగా అడిగారు. దుఃఖం తోనే స్థిరంగా చెప్పాను. 'నేను మీ ఇల్లాలిని, ఈ యింటి గృహిణిని, మీ తోనే నా సుఖమూ సర్వమూ మీరు ఎలా ప్రవర్తించినా ఓర్చాను కానీ, వుంపుడు కత్తెలను మాత్రం ఈ యింట వుంచటం సహించలేను. ఆ నీడ సోకిన చోట నేను అడుగుపెట్టలేను. ఆ గాలి వీచినచోట నేను నీరైనా త్రాగలేను... నన్ను "అమ్మగారూ" "తల్లిగారూ" అని పిలచే నౌకరూ చాకరూ నా ఎదుటే ఆమెను కూడా నాతో సమంగా గౌరవించుతారా? ఇహ అటువంటి రోజున నా గౌరవం నిలుస్తుందా? ఒక అధమురాలిపై అనురాగంతో ఇల్లాలి గౌరవం నిలువునా మంట గలుపుతారా?...... ఆలోచించండి, నా కొరకు మీరు బాధ పడక్కర్లేదు. మీ అభిప్రాయం నిశ్చయంగా అదే అయితే సంతోషంగా నేను నేడే ఆఖరిశ్వాస పీల్చుకుంటాను."

"దేవీ!" ఉద్వేగంతో అంటూ

ప్రేమగా నా కనుల నీరు తుడిచారు. మౌనంగా అక్కడినుంచి లేచి వెళ్ళి పోయారు. మరో అరగంటలోనే ఆ స్త్రీని ఎక్కడికో పంపివేశారు. మరలా ఈ నాటివరకూ ఎన్నడూ అటువంటి వారిని ఇంట ప్రవేశపెట్టలేదు. ఎంత విలాసంగా తిరిగినా, భార్య బాధతో నిమిత్తం లేకపోయినా గృహిణికీ జారిణికీ గల భేదాన్ని గుర్తించ గలిగారు. ఇల్లాలి పరువు దక్కించారు.

"మరి కన్నబిడ్డవు-మరలా నీవేం చేస్తావో ఈ నాడు? మీ నాన్నగారికంటె నీకు బుద్ధి ఆలోచనలు అధికమని నే ననుకుంటున్నాను ఇన్నాళ్ళుగా."

దేవకి మాటలు ఆపుజేసి కుమారుని పరీక్షగా చూడసాగింది.

మురళి మెల్లగా తలెత్తాడు. "అమ్మా నాన్నగారి వలన మీరు చాలా మానసిక బాధ అనుభవించారు. అందుకు నేనూ బాధపడుతున్నాను. కాని నేను మీ పరువు తీయాలనీ, మిమల్ని బాధపెట్టాలనీ అనుకోవటంలేదు. వ్యక్తి మంచిదైనప్పుడు ఎక్కడ ఏ యింట ఏ కులంలో పుడితే మన కెందుకని అంటున్నాను? బృందను చూస్తే మీరిలా అనరమ్మా." భావ గర్భితంగా నవ్వింది దేవకి. "మరి ఉదయం ఆలయానికి వెళ్ళేదారిలో తామరపద్మాల గురించి నువ్వేం మాట్లాడావ్? పువ్వులు అందంగా వున్నాయని నేనంటే ఆ బురదలో వెందుకని అడిగావుకదా? అవి దైవపూజకుఅనర్హమనీ, ఆతావే అడుగిడటానికి అసహ్యంగా వున్నదనీ అన్నావ్ కదా? నిజ జీవితాలకు కూడా అదే సత్యం అన్వయిస్తుంది 'మురళీ."

దిగ్భ్రాంతితో నిరుత్తరుడై మూఢుని వలె చూడసాగాడు మురళి.

ఆతడు తత్తరపాటును సర్దుకొని తిరిగి మాట్లాడబోయే లోపుననే దేవకి కూర్చున్న తావునుంచి లేచి, గంభీరంగా అన్నది మురళినే సూటిగా చూస్తూ. "నీవు నాతో వాదించవద్దు మురళీ. నా మాట వినటమే నీ పని అంతే. మేము అనుభవజ్ఞులం, నీ కింకా లోకం తెలియదు. బృంద గుణవతే కావచ్చు, కానీ ఆ బురదలోని పూవు వంటిదే ఆమె అది ఆమె దురదృష్టం అలా జన్మించటం, అంతే,...నువ్వు నా కుమారుడవు. నీ భార్యా నా తర్వాత నా స్థానంలో-నా బాధ్యతలతో నిలబడి ఈ వంశగౌరవ ప్రతిష్ఠలు నిలిపే బరువును మోయాలి. తనకే గౌరవం లేనిది ఒక వంశపు గౌరవం ఎలా నిలుపగలదు? కుటుంబ జీవితమేమిటోవంశప్రతిష్ఠేమిటో బొత్తిగా ఎరుగని-వినని-అర్థంకాని ఇంటిలోనిది ఈ గౌరవనీయ కుటుంబాలలో ఒక్కగంట కూడా యిమడలేదు. కుక్కను తెచ్చి సింహాసనాధిపత్యం అంటగట్టబోకు. నీవు చేసే తప్పుడుపని నీఒక్కడితోనే పోదు. ఈ వంశ ప్రతిష్ఠకు తరతరాలూ మానని మచ్చగా నిలచిపో

తుంది. ఒక అధమురాలిని ఉద్ధరించ టానికి నీవు వేయిమెట్లు సునాయాసంగా దూకబోతున్నావ్ అజ్ఞానంతో; కానీ దూకిన తర్వాత అతి ప్రయాసతోనైనా ఒక్క మెట్టు కూడా తిరిగి పైకి ఎక్క లేవు. నీకు నీ విలువెంతో, నీ అంతస్థు ఏమిటో, నీ దెంత అదృష్టకరమైన జన్మో అర్థంకావటం లేదు గౌరవధనిక కుటుంబాలలో జన్మనెత్తడం కూడా ఒక అదృష్టమే. అది పోగొట్టుకుంటే మాత్రం వేయి జన్మలకైనా తిరిగి లభించదు. తెల్సుకో, జాగ్రత్తగా ఆలోచించుకో."

అతడి సమాధానం వినగోరని దేవకి చర చరా నిష్క్రమించింది.

## 17

ఏనాడూ తనతో మాట్లాడని- పలుక రించని తండ్రి వాసుదేవరావు ఈనాడు మురళిని తన గదిలోనికి పిలచి ప్రశ్నించాడు: "ఏమిటి సంగతి? ఏవో ఘనకార్యాలు చేస్తున్నావట! మీ అమ్మ చాలా బాధపడ్తూన్నది."

'ఆమె బాధతో మనస్తాపంతో ఏనాడూ అవసరం లేనివానికి ఈనాడు కావలసివచ్చిందా? ఏనాడూ ఏ విషయం లోనూ సమరసతే లేని తల్లికి తండ్రికి ఈనాడు తన వివాహ విషయంలో మాత్రం ఏకీభావం కుదిరిందా' అని ఆశ్చర్యపోయాడు మురళి

"ఆ కులంలో పుట్టినా బృంద అటు వంటిది కాదు నాన్నగారూ ఎంతో ఉత్తమ హృదయినీ, సద్వర్తనకలదీ నాన్నగారూ." ఎన్నో విధాలుగా వాదించాడు మురళి తండ్రితో.

వాసుదేవరావు దేవాంతకుడు. మన సునూ, ఆగ్రహావేశాలనూ తేలికగా పైకి ప్రదర్శించే వ్యక్తికాదు. కుమారుని మాటలన్నీ చిరునవ్వుతో విన్నాడు.

"వెర్రివాడా!" తేలికగా నవ్వేశాడు. "నువ్వేమైనా ఆకవిల్లవటోయ్ ఈవ్యక్తే కావాలని ఏడవటానికి? మగవాడికి కోరి కలు తీరటానికి ఇల్లొకటే స్థానంకాదు ఇల్లాలు ఇల్లాలే; ప్రియురాలు ప్రియు రాలే! నీ గృహిణిగా, నీ పిల్లలతల్లిగా, ఈ వంశాభివృద్ధి చేయటానికి సద్వం శంలోని కన్యే రావాలి. ఆ స్థానం మరొకరికి లేదు. ఎన్ని సరదాలయినా— ఎన్ని రుచులైనా బయట అందుకోగల ఐశ్వర్యమున్నది నీకు. పిచ్చివేషాలు వెయ్యకు."

నివ్వెరపోయిన మురళి తేరుకొనే లోపుననే తండ్రి నిష్క్రమించాడు.

తల తిరిగిపోసాగింది మురళికి. ఇది తండ్రి కుమారునికి ఉపదేశించవలసిన విషయమేనా? ఈ ఉపదేశంతో అతడి హృదయంలో తండ్రిపై గౌరవం తగ్గిందే కాని లేశమైనా అతడి మాటలను ఆమో దించలేకపోయాడు. 'ఎందరు స్త్రీలతో తిరిగినా తప్పు లేదనే రోజులు గతిం చాయి. కాలం మారింది. కట్టుకున్న భార్యనే గౌరవించి ప్రాణాధికంగా

ప్రేమించే రోజులివి. విషయ లాలన గల పురుషునికూడా తేలికగానే చూచే రోజులివి," అంటూ వాదించాడు తండ్రితో మరొకనాడు.

బిగ్గరగా నవ్వాడు వాసుదేవరావు, మేడ అంతా దద్దరిల్లేట్టు "జీవితంలో మూడువంతులు గడచిపోయిన తండ్రికి పాఠాలు నేర్పకు నేర్చుకో! ప్రేమించు, ఎంతైనా ప్రేమించు ప్రేయసికోసం అశ్రులు చాచిన వారంతా భార్యను ప్రేమించ రనుకుంటున్నావా? భార్యను ప్రాణాధికంగా ప్రేమిస్తారు. దేని దారి దానిదే. శృంగార జీవితానికి ప్రేయసి; శాంత సరస గృహస్థ జీవితానికి అర్ధాంగి! గృహిణి వేరు! ప్రణయిని వేరు! కుర్రవాడివి-నీకేం తెలుసు ప్రేమ భావం! అనుభజ్ఞులు చెప్పినది విని బాగుపడు లక్షణంగా జమునను వివాహం చేసుకో. ఆపైన నీ సరదాల కెవరూ అడ్డురారని నేను హామీ ఇస్తున్నాను." మృదువుగా మెత్తగా పలుకుతూన్న కంఠం అంతలోనే మెల్లమెల్లగా కర్కశత్వాన్ని పుంజుకొన్నది. "వెర్రి మొర్రి సిద్ధాంతాలు కట్టిపెట్టు వచ్చే నెలలో జమునతో నీ వివాహం జరిగి తీరుతుంది. వంశగౌరవాన్నీ ప్రతిష్ఠనూ నాశనం చేసేహక్కు నీకు లేదు." శాసించినట్టే అన్నాడు.

"వంశ గౌరవం, ప్రతిష్ఠా అంటే ఏమిటి నాన్నగారూ? ఒక వెలయాలితో సంబంధం ఏర్పరుచుకొని, రాత్రిం బవళ్ళూ ఆమె ఇంట గడిపినా పోని గౌరవ ప్రతిష్ఠలు, ఆమె మెడలో తాళి కట్టినంతమాత్రాన ఎలా పోతాయో నా కర్థం కావటంలేదు."

"మురళీ!!" గర్జించాడు వాసుదేవరావు. "వితండవాదాలు కట్టిపెట్టు. హద్దులు దాటకు. ఆ బజారు వీధిలో దాన్ని తెచ్చి ఈ యింట అందలం ఎక్కిస్తే ఏమౌతుందో ఏమైనా ఆలోచించావా? 'దాని కిమ్మత్తు ఒక రాత్రికి పాతిక రూపాయలురా! నీ పెళ్ళాన్ని ఒకప్పుడు మేం కొనుక్కునేవాళ్ళంరా! దీని అమ్మ ఫలానా వేశ్యరా!' అని నీ వెనుకా ముందూ పది కంఠాలు పక పక లాడుతుంటే నీవు జీవించగలవా? ఆశయం వేరు అనుభవం వేరు!"

"నాన్నగారూ!!!" వినలేనట్లుగా చెవులు మూసుకుంటూ ఆక్రందన చేసాడు మురళి.

గంభీరంగా నవ్వాడు వాసుదేవరావు "అంత సాహసంతో పెళ్ళాడగలవాడివి ఈ మాత్రం వినటానికే భయపడుతున్నావేం? ఇంతకంటె అసహ్యాకరమైన మాటలుకూడా నువ్వు వినవలసి వస్తుంది మురళీ! ఈ నాడు దేవకీదేవి దేవకీదేవి పుత్రునిగా నీకు గల గౌరవ మన్ననలు, నువ్వే గనక ఒక వెలయాలి కుమారుడవైతే పొందగలిగి వుండేవాడివా? వంశానికీ, ఇంటికీ, పురుషునికీ కూడా గౌరవ

ప్రతిపత్తి లభించేది గౌరవనీయురాలైన తల్లివలన, గుణవతియైన భార్యవలన—స్త్రీ వలన! పురుషుడు ఎంతైనా చెడి తిరగనీ – లెఖ్ఖచేయనివారు కుమార్తెగానీ భార్యగానీ చెడు నడత నడిస్తే ప్రపంచానికి ముఖం చూపలేక కృంగిపోతారు. ఆత్మహత్యకూడా చేసుకుంటారు. ఇది మన సంఘం! ఈ సంఘంలో జన్మించిన నీవు ఈ సంఘ నియమాల నతిక్రమించి బ్రతకలేవు!"

"నాన్నగారూ! ఆ నాడు కాలేజి స్టేజిపై అంతగా ప్రశంసించి వెయ్యి రూపాయల బహుమానమిచ్చిన మీరేనా ఈ మాటలనేది!"

'ఆమెలోని కళను నేను మెచ్చుకొన్నానే కాని, అందువల్ల ఆమె ఆ మురికి కూపంనుంచి ఒక ఉన్నత గృహిణీ స్థానానికి బదిలీ కాబడవలెనని నేను అనలేదే! ఆమెలోని కళను ఎంతైనా ఆరాధించు, అంతేకాని నీ వంశ గౌరవాన్ని ఆమెకోసం ధారపోయకు. వంశ ప్రతిష్ఠ కాపాడటం ముఖ్యం. ఈ యింటికి వచ్చినంత మాత్రాన ఆమె విలువ మారదు సరికదా, మన విలువలుకూడా మట్టిలో కలిసిపోతాయి. నీకూ ఆమెకూ పుట్టిన పిల్లల కులం ఏదౌతుంది? ఈ నాడు ను వ్వామెను ఉద్ధరించటానికి తయారైనట్టు నీ బిడ్డలకోసంకూడా తయారు కాగల విశాలహృదయు లుండగలరనే ఆశ వున్నదా? లోకం ఆమెను నీ బిడ్డలుగా గుర్తించదు – ఆమె బిడ్డలుగా మాత్రమే విలువనిస్తుంది!"

భయంకరంగా చిత్రింపబడుతూన్న ఈ భవిష్యత్తును గురించి మౌనంగా ఆలోచిస్తున్నాడు మురళి.

చేతికందిన ఫ్లవర్ వాజ్‌ను తీసుకుని ఎదుటి నిలువుటద్దంపై విసిరేశాడు వాసుదేవరావు. నిలువుటద్దం భళ్ళున బ్రద్దలైంది, తునాతునకలుగా.

నివ్వెరపోతూ చూచాడు మురళి

"అంతే. ఏదైనా ఒక పని తొందరపడి చేస్తే ఫలితం అలాగే వుంటుంది. గాజు వస్తువుకంటె పదిలంగా చూచుకొనవలసినవి పరువు ప్రతిష్ఠలు. ఆ అద్దాన్ని తిరిగి అతికించలేవు. అలాగే పోయిన పరువునుకూడా పొందలేవు! ఈ పరువు నీ ఒక్కడిదే కాదు. వంశం మొత్తానిది!"

* * *

## 18

జమునలో ఆగ్రహం, అభిమానం రేకెత్తాయి. "నాపై ప్రేమ లేదనేవాడిని ప్రాకులాడి పాణిగ్రహణం చేసుకొనవలసిన అగత్యం లేదు. నాకీ పెళ్ళి వద్దు," అంటూ ఎదురుతిరిగింది. ఎందరు చెప్పినా లాభం లేకపోయింది.

ఆ కోపంలో బృందను కలుసుకొని తిట్టి వస్తుంది. బృందకూడా గట్టి సమాధానాలు చెప్తుంది.

"మగవాడి ఖుషీకోసం రెండుమూడు

నిముషాలు కాలి మసిఅయిపోయే సిగ రెట్టుకూ నీ బ్రతుక్కూ ఏమీ తేడాలేదు. నీ హద్దులలో నీ వుండు. మరానా యింటి పరువు నాశనం చేయకు," అన్నది జమున.

హేళనగా నవ్వింది బృంద. "మీ పరువుగల ఇళ్ళల్లోని చాటుమాటు భాగో తాలు మాకూ తెల్సులే. మీలో బుద్ధి హీనులున్నట్టే మాలోనూ ఉత్తము లుండ గలరని తెల్సుకో."

"నోర్ముయ్."

"ఆ మాట నేనూ అనగలను జమునా కానీ నేను నీ అంత అహంకారిని కాను. చేతనైతే మీ మనుషులను మీ ప్రేమలతో బంధించి ఇంట కట్టిపడవేసుకోవాలి కాని మమ్ము నిందించడం దేనికి? ఇంతింత ఉపన్యాసా లీయగలవారికి పురుషులను అదుపులో పెట్టుకోవడం మాత్రం రాదు. మమ్మల్ని నాశనం చేయటానికి మా ఇళ్ళపై దండెత్తిస్తారు."

"ఛీ, నీతో వాదించాల్సిన అవసరం నాకు లేదు."

"నా ఇంటికి నేను నిన్ను రమ్మని పిలవలేదు."

"మంచిది వెళ్తున్నాను. ఒక మాట విను. నా మురళి, నా బావ, పుట్టుకతోనే నా సొత్తు. మమ్మల్ని విడదీసి నువ్వు సుఖపడలేవు."

"మురళికి నీ మీద ప్రేమ లేనప్పుడు మమ్మల్ని విడదీసి నువ్వు మాత్రం బావు కునే దేమిటి?"

"నీవంటి వగలమారి వలలో పడితే ఎటువంటి ప్రేమ అయినా రూపాంతరం చెందుతుంది."

"జమునా! ఇంతవరకు నువ్వు మురళీ మరదలివనే సహిస్తూవచ్చాను, నీ వాచాలతనంతా! నా ఇంటికి వచ్చి నన్నే నిందిస్తావా? తక్షణం బయటికి నడు."

"నీ కొంపకు నా నిలువెత్తు ధనం పోసినా రావలసిన అవసరం నాకు లేదు. అయినా వచ్చాను. సరే వెళ్తున్నాను. మురళి ఏదో భ్రమలో వున్నాడు. ఆ భ్రమ సమసిపోయిన తర్వాత నిన్ను పురుగును చూచినట్టు చూస్తాడు. సంఘం లోని ఏ సభ్యమానవుడూ నిన్ను వివాహ మాడడు, మురళివంటి అమా యకుడైతే తప్ప. దోమలు పుట్టేది గిట్టేది మురికిలోనేనని గుర్తుంచుకో! దోమ మనిషిరక్తం పీల్చి బాధపెట్టగలదే కానీ, మనిషి విలువను పొందజాలదు." గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది.

* * *

## 19

"బృందా! మనం త్వరగా వివాహం చేసుకోవాలి" ఇంట జరుగుతూన్న సంఘర్షణలన్నీ చెప్తూ మురళీకృష్ణ తన ఆత్రతనూ, నిర్ణయాన్నీ వ్యక్తపరచాడు.

"అయితే అందరూ అంత వ్యతి రేకంగా వున్నారన్నమాట?" ఆలోచిస్తూ అడిగింది బృంద నెమ్మదిగా.

"ఇంకా మెల్లగా అడుగుతున్నావా?—

మనం త్వరలో రిజిష్టర్ మ్యారేజ్ చేసుకోవటానికి ఏర్పాట్లు చేస్తాను.''

మురళి మాటలు వింటూనే బృంద ఉలికిపడింది.

"ఏం మాట్లాడవేం?''

''మురళీ! నా మనసు నువ్వు పూర్తిగా అర్థంచేసుకోలేదేమో?"

"అంటే?"

''మురళీ! మనం ఇద్దరం ఎవరి అనుమతీ అంగీకారాలూ లేకుండా వివాహం చేసుకొంటే అది లోకం పరిభాషలో 'లేచిపోవడం'గానే చలామణీ అవుతుందిగా?''

''లోకం ఏదైనా అననీ, మన కేం లెఖ్ఖ?"

"లెఖ్ఖ ఎందుకుండదు మురళీ? తప్పకుండా వుంటుంది. లోకుల ఈ నీచపు మాటలనుండీ అల్పదృష్టినుండీ తప్పించుకోవటానికే నేను సభ్యప్రపంచపు సభ్యత్వాన్ని కోరుకుంటున్నాను. ఇక మనం ఇలా చేయటంలో అర్థం ఏమిటి?"

మురళికి కొంచం కోపం వచ్చింది. ''ఓహో! అంతేకాని నా కోసం కాదన్న మాట!''

నవ్వింది బృంద. "అలా కోపం తెచ్చుకోకు. పెద్దలందరినుండీ నిన్ను విడదీసి, వారి ఆశీర్వాదం లేకుండా మనం వివాహమాడి సుఖపడ లేమని పిస్తూన్నది మురళీ నిన్ను నీవా రందరి మధ్యనే పొంది నిండుగా కాపురం చేయాలని కలలు గంటున్నాను. 'కోడలా,' 'వదినా,' 'అత్తయ్యా' అనే మధురమైన సంబోధనలకోసం నేను పరితపిస్తున్నాను. తొందరపడి నలుగురి దృష్టిలో తేలిక కావడంకంటె లాభం వుండదు."

"నీ ఆశలూ, ఆశయాలూ మంచివే, కాదనను. కాని వాటిని అర్థంచేసుకొనే సహృదయత ఎవరికీ లేనప్పుడు మన మేం చేస్తాం? అలస్యమైనకొద్దీ 'అమృతం విషం' అన్న ఆర్యోక్తి నిజం కావచ్చునని నా భయం."

"ఇంకొద్ది రోజులు వేచి వుందాం మురళీ. మన అదృష్టం పండి దైవం పెద్దల మనసులను మార్చకపోతాడా?"

"సరే." అయిష్టంగానే అంగీకరించాడు మురళి. 'ఎంత అమాయకురాలు!' అని శ్లాఘించకుండా వుండలేకపోయిం దతడిమనసు.

*　　*　　*

## 20

సాహసించి తల్లిని అడిగి బ్రతిమాలబోయాడు మురళి మళ్లీ ఒకనాడు.

"మురళీ. నీ మనసు నాకు తెలుసు బాబూ. నీ ఎన్నిక సరియైనదేనని నా నమ్మకం కూడా. నీవు అంత గట్టి శిక్షణలో మంచి చెడులను తెల్సుకొని పెరిగావు."

తల్లినోట వినవచ్చిన ఈ మాటలు అమృతమయంగా తోచి, మనసున ఆశ రేకెత్తింది మురళికి.

"కాని మురళీ, నీ ఒక్కడి వరంగానే ఆలోచించకు. నీ మనసూ, నీ సుఖం, నీతో మాత్రమే వుండి, నీతో మాత్రమే పోయేవి. కాని నీ వల్ల వచ్చే కళంకం ఈ వంశ వృక్షాన్ని తరతరాలవరకూ చీడపురుగై పీడిస్తుంది. పీల్చి పిప్పిచేసి వృక్షాన్నంతనూ నాశనం చేస్తుంది... ఇప్పుడు చెప్పు, నీ ఒక్కడి కోసమై ఇంత ఘోరాని కొడిగడతావా?"

"రోజులు మారాయి, నీ భయాలు అర్థహీనమైన"వని మురళి వాదించాడు.

"లేదు బాబూ. నీకు తెలియదు. ఫ్యాక్టరీ గొట్టం దేవాలయ గోపురంకంటె ఎత్తుగా వుండవచ్చు, కాని దేవాలయానికి వందన మాచరించినట్టు ఆ ఫ్యాక్టరీ గొట్టానికి తలవంచి నమస్కారం చేయం. మనసున గౌరవం వుండవచ్చు. అది వేరే విషయం. ఘోటక విషం బంగారు పాత్రలో వున్నంత మాత్రాన పానం చేయలేము కదా! బురద అంటిన పూలు భగవంతునికి సమర్పింపలేము కదా!"

ఇక తల్లిని బ్రతిమాలి లాభంలేదని, చెల్లెలు రాధను 'ఏదైనా ఉపాయం చెప్పు' మని అర్థించాడు మురళి, సిగ్గువిడచి.

బాధగా నవ్వింది రాధ. "లాభం లేదన్నయ్యా. వ్యక్తిగతమైన కోరికలను చంపుకొన్నప్పుడే ఈ ఉన్నత వంశపు కిరీటాన్ని ధరించి, పేరు ప్రతిష్ఠల సింహాసనాన్ని అధిరోహించగలం. ఈ కిరీటపు బరువూ, ఈ సింహాసనంలో నిత్యం పొడిచే ముళ్ళూ సామాన్యులకు తెలియక మనవంటి వారిని ఎంతో గొప్పగా ఊహించుకుని ఈర్ష్యపడతారు. సామాన్యుడు అనుభవించే సుఖ స్వాతంత్ర్యాలలో వెయ్యోవంతుకూడా ధనవంతుడు అనుభవించలేడు. మన జీవితాలు కేవలం మేడిపళ్ళు. మంచి తిండి తింటాం. మంచి వేషం వేస్తాం. ఈ సద్వంశాలలో ఈ ఆకాశహర్మ్యాలలో మనం అనుభవించే సుఖం ఇదొక్కటే!"

రాధ మాటలలో దోబూచులాడుతూన్న దైన్యాన్ని గమనించిన మురళి కలవరపడ్డాడు. ఆ త్తింటినుండి రెండు రోజుల క్రితమే వచ్చింది రాధ. 'ఆమె సంసారంలోకూడా ఏమైనా అపశ్రుతు లున్నాయా?' అనే అనుమానం తోచగానే ఖేదపడింది అతడి మనసు. కానీ స్పష్టంగా అడగలేకపోయాడు.

'భగవాన్ ఏది దారి!'

* * *

## 21

పరిస్థితులు ఆనాటి కానాకు విషమించగలవనే భయంతో మురళి ఆరాటపడ్డాడు. 'అర్జంటుగా నీతో మాట్లాడాలి. హోటల్ 'లిల్లీ'లో కలుసుకుందాం.' అంటూ కబురు చేశాడు బృందకు. ఆ ఉత్తరం గోపాలరత్నం చేతబడింది. బృందకు అందనేలేదు. గోపాలరత్నం ఆ లేఖను క్షణాలలో నాగేందర్‌కు

అందించింది. సంతోషంగా ఎగిరి గంతే శాడు నాగేంద్ర.

నాగేంద్ర నడుపుతూన్న హోటల్ లోనే మురళీ బృందలు కలుసుకోబో తూన్నది. చాలాసార్లు అలా షికారుగా సముద్రపు ఒడ్డుకువచ్చి, దగ్గరనే వున్న హోటల్‌లో అల్పాహారాలూ కూల్ డ్రింక్సూ తీసుకోవటం మామూలే బృందకూ మురళికీ. ఈనాడు తన పథకం అమలు జరిపే సదవకాశం లభిం చింది నాగేంద్రకు. నిముషాలలో ఏర్పా ట్లన్నీ చేసేశాడు.

నిర్ణీత సమయానికంటె ముందుగానే వచ్చి హోటల్ బయట ఆవరణలో ఎదురుచూడసాగాడు మురళీ బృంద కొరకై... బృంద ఇంకా రాలేదు. గేటు వైపే చూస్తూ అటూ ఇటూ పచార్లు చేస్తూన్న అతడిని నాగేంద్రవచ్చి మాటల లోకి దింపాడు.

"ఏమిటోయ్ బయటే నుంచుని పోయావ్? పదపద లోపలికి."

"వస్తాలే, కొంచెం సేపున్నాక."

"ఏం, ఎవరైనా రావాలా?"

ఏమీ చెప్పలేని సందిగ్ధత కదులాడింది మురళి వదనంలో.

"పద పద. వచ్చేవాళ్ళు లోపలికి రారా ఏమిటి?" ఒక విధమైన బల వంతంతోనే లోపలికి తీసుకువెళ్ళాడు నాగేంద్ర మురళిని. "నువ్వు హోటల్‌ను పూర్తిగా చూడలేదు కదూ ఎప్పుడూ? రా చూద్దాం. నాకూ అంతపని లేదులే ఇప్పుడు."

అన్యమనస్కంగానే అనుసరించాడు మురళి నాగేంద్రను. ప్రతి అంతస్థునూ, అందులోని గదులనూ చూపించుతూ, తా నింకా ఏమేమి మార్పులూ చేర్పులూ చేయదలచుకున్నాడో వివరిస్తున్నాడు నాగేంద్ర ధ్యాస అటు లేకపోయినా తప్పని సరిగా 'ఊఁ' కొడుతూ చూస్తు న్నాడు మురళి.

"అరె! ఏమిటి, మాటిమాటికీ వాచీ చూచుకుంటున్నావ్? ఎవరైనా రమ్మ న్నావా ఏమిటి?" నాగేంద్ర అడిగాడు.

"ఆఁ. ఒకరు రావాలి." నసిగాడు మురళి. "అయితే, ఇంకా పావుగంట టైము ఉన్నదిలే. నేను పోయి బయట నుంచుంటాను."

నవ్వేశాడు నాగేంద్ర. "బాగుందిరా, నీ మొహమాటం నువ్వూనూ. ఇది నీ స్నేహితుడి హోటలని మర్చిపోయా వేమిటి? నీ కెప్పుడు అవసరమైనా తిన్నగా నాకు ఫోనుచెయ్యి. ఫస్టుక్లాసు రూం నీ కోసం అట్టే పెడతాను. అటెం డర్‌కి చెప్పి వుంచామంటే ఆ వచ్చేవారిని తిన్నగా నీ సన్నిధికే తీసుకొస్తాడు సకల మర్యాదలతో!"

"ఛ. ఛ. నోర్మూయ్యరా. అటువంటి పద్ధతులు నాకు నచ్చవ్. ఊరికే..."

మురళి మాటలను పూర్తి కానీయలేదు నాగేంద్ర. "ఏమిటి కాదు? ఆడపిల్లలా

అలా సిగ్గు పడుతున్నావేమిటి? ఇలా రా పై అంతస్తులోకి, నీకు అనేక తమాషాలు చూపిస్తాను."

సముద్రం అందంగా కన్పిస్తోంది అక్కడికి. ఇద్దరూ బాల్కనీలో నిల బడ్డారు. మురళి దృష్టి వీధి గేటుపైననే కేంద్రీకరింపబడింది.

ఆ పై అంతస్థులో సాయంకాలపు నీరెండలో తన్మయంగా త్రాగి విందు చేసుకుంటున్నారు ముగ్గురు పురుషులూ నలుగురు స్త్రీలూ. మరో కార్నర్‌లోకి నడచిపోతూ, చూచీ చూడనట్లుగా అటు చూచాడు మురళి. అందులో ఒకడు మాజీమంత్రి. మరొకడు పెద్ద రిటైర్డ్ ఆఫీసర్. ఊరిలో చాలా పలుకుబడిగల వ్యక్తులూ, ప్రముఖులూ గనుక ఆ యిద్దర్నీ మురళి లోగడ చాలసార్లు చూడటం జరిగింది. గుర్తించటంలో పొరపాటు ఏమీలేదు. మూడవ అత డెవరో తెలియదు కానీ ఆకారాదులు ఘనంగానే వున్నాయి. ఆ నలుగురు స్త్రీలూకూడ ఇరవై - ముప్పై ఏళ్ళ మధ్య వయసులో వున్నారు. శరీరపు వొంపుల్ని ప్రదర్శిస్తూన్న వస్త్రధారణా, వెకిలిగా - మగవాడిని రెచ్చగొడుతూ వున్న చూపులూ, నవ్వుల వికవికలూ.

దూరంగా మరో కార్నర్‌లోకి పోయి నిలబడ్డారు మురళీ, నాగేంద్రా.

"చీకటి పడేవరకూ ఈ పార్టీ ఇలా సాగుతుంది. కాని వాళ్ళు ఇక్కడనుంచి ఇళ్ళకు వెళ్ళేది మాత్రం రేపు తొమ్మిది తర్వాతనే," అన్నాడు నాగేంద్ర నవ్వుతూ.

"అంటే?". మురళికి అర్థంకాక అడిగాడు.

"ఈ ఉదయమే నలుగురికీ నాలుగు రూమ్స్ బుక్ అయిపోయి వున్నాయి. నాలుగోవాడుకూడా వచ్చాక మెల్లగా గదుల్లో సర్దుకుంటారు ... ఇంకా ఏం చూశావ్‌లే. ఇంతకీ అసలైన ఆవిడ రాలేదు, మహారాణి!"

"అదేమిటి?"

"రూం నంబరు పధ్నాలుగులో చాలా ధనవంతు డొకడు దిగాడులే. బిజినెస్ మాన్. అటువంటి వాళ్ళకి కొంచం స్పెషల్ సరకు కావాలి. ఆమెగారికోసం కారు వెళ్ళింది. ఇంకా సింగారింపు కాలే నట్లుంది"

"నాగేందర్! ఒకటి అడగనా?" మురళి కంఠంలో ఏదో బాధ; కనులలో మరెంతో జుగుప్సా తాండవించాయి.

"అడుగు, దానికేం?"

"ఏదైనా వ్యాపారం చేస్తున్నామూ అంటే అది నికరంగా డబ్బు సంపాద నకే, కాదనను. కాని, ఆ డబ్బుకోసం యింతింత నీచాలు చెయ్యాలంటావా? ఈ విధమైన హోటల్ నడపడానికి నీకు సిగ్గులేదూ?"

తేలికగా గలగల నవ్వేస్తూ మురళి భుజం తట్టాడు నాగేంద్ర. "వెర్రివాడా!

ఇందులో నేను చేస్తూన్న దేముంది? గడ్డి తినేవాడు ఎక్కడైనా తింటాడు. మరో హోటల్‌కి పోతాడు. ఇక నేను మడి గట్టుకోవటం ఎందుకు? నువ్వే వున్నావ్-వచ్చా విక్కడికి. నీ యిష్టంలేనిదే నిన్ను నేను ఏ గదిలోనికి పంపి విలాసినిని సప్లై చేయలేనుకదా!"

'ఛ. ఈ హోటల్‌లో కల్సుకోవడం ఇక మానివేయాలి. పరువు తక్కువ. బృందను గురించికూడా చూచేవారు ఇలాగే అనుకోవచ్చు,' అనుకున్నాడు లోలోన మురళి.

అంతలో పోర్టికోలో ఓ కారు ఆగడం, నాగేంద్ర మనుషులు దాని దగ్గరకు పరుగున వెళ్ళి మర్యాదగా డోర్ తెరిచి నిలబడడం, అందులోనుండి అందమైన అమ్మాయి దిగడం జరిగింది. ఆమెతో ఒక దేదో మాట్లాడాడు. ఆమె చిరునవ్వుతో తల పంకించి అతడి ననుసరించి, లోపలికి దారితీసింది.

"హమ్మయ్య, వచ్చింది. మాట దక్కించింది," అంటూన్న నాగేందర్‌ను విస్మయంగా చూస్తూ, "ఎవరు? ఆ అమ్మాయి బృందకాదూ?" అనడిగాడు మురళి క్రిందికి దారితీస్తూ.

"ఔను. బృంద! ఈ ఊరికెల్లా కీర్తి గాంచిన భోగంది — గోపాలరత్నం కూతురు!"

"నాగేంద్రా! ఏమిటి వాగుతున్నావ్?" గర్జించాడు మురళి. "ఆమె ఎవరి కూతురైనా కానీ, ఆమె గుణం మాత్రం మంచిది. మరెప్పుడూ ఇలా మాట్లాడకు," శాసించుతూన్నట్లు అనేసి, మెట్లు దిగుతూ, "నేనే ఆమెను రమ్మన్నాను ఒక విషయం మాట్లాడటానికి. నా స్నేహితురాల్ని గురించి తేలికగా వాగకు"

"అహ్హహ్హ!" నాగేంద్ర వికటంగా నవ్వాడు. "పధ్నాలుగో నెంబర్ గదిలోని పిల్లరాజాగారి కోసం రప్పించామోయ్ ఆమెను. మా హోటల్ కాల్ గరల్స్‌లోకెల్లా కాస్త చదువూ, దర్జా ఎక్కువ కలదిలే. రేటుకూడా ఎక్కువే!" క్రీగంట మురళి ముఖభంగిమలనుచూస్తూ లోలోన సంతసించాడు నాగేంద్ర.

"నాగేంద్రా! వాచాలత కట్టిపెట్టు!" క్రూరంగా చూస్తూ అన్నాడు మురళి. "స్నేహితుడవు గనుక బ్రతికిపోయావ్."

"ఆవేశపడకు భాయ్!" నెమ్మదిగా అన్నాడు నాగేంద్ర మురళి వీపు తడుతూ. "అదుగో, నీ కళ్ళతో నువ్వే చూడు, ఆమె ఎక్కడ కెళ్తూన్నదో! నేను కారు పంపాను రమ్మని, వచ్చింది!"

అలా మేడమెట్ల మధ్య నిలబడి చూస్తూంటే ఆ అంతస్థులో గుండ్రంగా వున్న బాల్కనీలోని అధునాతనపు గదుల వరస అంతా స్పష్టంగా కన్పిస్తోంది. రూం నంబరు 14లో బృంద

నవ్వుతూ ప్రవేశించడం స్పష్టంగా కన్పించింది.

దూకుడుగా అటు వెళ్ళబోయిన మురళిని బలంగా పట్టి ఆపాడు నాగేంద్ర. "నీకు పుణ్యముంటుంది కానీ, నా హోటల్‌ని అల్లరిపెట్టి పరువు తీయకు. అయినా ఏదైనా గొడవచేస్తే నీకే నామర్దాకాని, పరువు అనే పదమే తెలియని వాళ్ళకేం సిగ్గు?"

ఈ సారి కోపం రాలేదు మురళికి అతడి మాటలు విని. ఆలోచించసాగాడు. 'బృంద నాగేంద్ర కారులో వచ్చిందంటే ఇంకా అనుమానం దేనికి? ఇదన్న మాట ఆమె అసలు రంగు?'

అదను జారవిడచుకోకుండా తాను వాగదలచుకున్న విషమంతా ఒలికించేశాడు నాగేంద్ర. "కోపం వద్దుకానీ మురళీ — ఒక్కటి ఆలోచించు, గడ్డి పువ్వు చామంతి ఎలా ఔతుంది? దాని జన్మ అంతే 'లేదు, దీనిని సంపంగిగా మారుస్తాం; మల్లెగా మార్చి భగవంతుని పూజిస్తాం' అంటే వీలౌతుందా? లోకం దృష్టిలో పిచ్చివాళ్ళ మౌతాము...... అటువంటి వాళ్ళకి పవిత్రత వుంటుందని ఆశించడం మనది బుద్ధి తక్కువ. తల్లి కోసం అందరు వచ్చిపోయే ఆ యింట, ఇంత వయస్సు వచ్చిన బృంద అసలు పవిత్రంగా వుండడం ఎలా సంభవం? ఈ బంగారు బొమ్మను వదలి ఆ ముసలి దాని మొహంచూసే తలకుమాసినవాడెవడుంటాడు? అంగట్లో వస్తువుపై అందరి కళ్ళూ చేతులూ పడడం సహజం! అందుబాట్లో వున్నదాన్ని కొనుక్కొని ఆస్వాదించగల. సరసులకేం తక్కువ కాదు మన మహా నగరం! తండ్రి ఎవరోకూడా తెలియని జన్మ లివన్నీ!"

ఇంటికి ఎలా జేరాడో, తన శరీరంలో ప్రాణం వున్నదో లేదో తనకే తెలియదు మురళికి.

*   *   *

బృంద మురళిని ఎన్నిసార్లు కల్సుకో ప్రయత్నించినా అతడు అవకాశమీయలేదు. పురుగును చూచినట్టు చూచి తప్పుకు పోయేవాడు. తన నిరపరాధత్వాన్ని వివరించటానికి తిరిగి మురళి అభిమానాన్ని సంపాదించటానికి బృంద చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. అతడు తనపట్ల ఎందుకంత విముఖుడయ్యాడో ఆమెకు తెలియలేదు.

"అంతేనే తల్లి కలవారి బిడ్డలు! ఆడుకున్నన్నాళ్ళు ఆడుకొని వదిలేస్తారు మనలను," అనసాగింది గోపాలరత్నం. ఏమీ తెలియనిదానిలా.

"నిజమేనేమో!" అన్పించింది బృందకు.

మురళి మనసులో బృందపై ఎనలేని అసహ్యం పేరుకొన్నది. వివాహంపై స్త్రీ ప్రేమపై నమ్మకమే నశించిపోయింది.

## 22

జమున తల్లి చావు బ్రతుకులలో వున్నది. మురళీ జమునల వివాహం

చూచికొని ఆ ముసలి ప్రాణం పోయేట్లు లేదు. మురళి తనకు వివాహమే వద్దని భీష్మించుకు కూర్చున్నాడు ఎందరు చెప్పినా లాభం లేకపోయింది.

"తల్లీ తండ్రీలేని జమున ఏమై పోతుంది? నీ యింట కోడలిగా అయితే నీ బిడ్డలాగే వుంటుంది. పరాయి యింటికి దానిని పంపవద్దు అన్నయ్యా," అంటూ వాసుదేవరావు చేతులుపట్టుకు రోదించ సాగింది ఆఖరు క్షణాలలోవున్న సుభద్ర.

'తండ్రి లేనేలేదు. తా నెరుగదు. ఉన్నతల్లి ఈనాడు అసంతృప్తితో మరణించితే ఇక బ్రతుకంతా తనకు మనశ్శాంతి వుండదు.' అని బాధపడింది జమున.

"బావా!" జమున పిలుపు విని ఆశ్చర్యపోయాడు, ఒంటరిగా తోటలో కూర్చున్న మురళి. చాల రోజులనుండీ యిద్దరికీ మాటలులేవు. ఒక యింట్లో వున్నా పరాయివారిలాగా ముఖాలు చూచుకోవడం మానివేశారు.

"బావా! నిన్ను ఒక భిక్ష అడగటానికి వచ్చాను!" అన్నది మురళి సామీప్యంలో కూర్చుంటూ.

నిర్జీవంగా నవ్వాడు మురళి. "నా వంటి అభాగ్యుడు అందరికీ అసంతృప్తిని తప్ప ఏమీ ప్రసాదించలేడు జమునా. నీ మనసులో నాపై ఎంత అసహ్యమున్నదో ఎరుగుదును."

"ఇది పంతాలకూ, పట్టుదలలకూ

సమయం కాదు." ఎంత నిగ్రహించినా ఆగక అశ్రువులు జలపాతాలై దుముక సాగాయి. "అమ్మ ప్రాణం ప్రశాంతంగా పోవాలంటే నువ్వు నన్ను వివాహమాడాలి!"

"జమునా!" అదరిపడ్డాడు మురళి. "ఎందుకు పదే పదే నన్నిలా హింసిస్తావ్? చెల్లెలివంటి యువతిని వివాహమాడటంకంటె మరణశిక్ష ఉత్తమం మానవుడికి"

"బావా." గంభీరంగా మారిపోయింది కంఠస్వరం. "బావా. నిన్ను నేను ఈనాడు ఈ ఒక్క కోరిక మినహా ఇంక ఎప్పుడూ ఆజన్మాంతం ఏమీ కోరనని మాట ఇస్తున్నాను. వాగ్దానం చేస్తున్నాను... ఒకప్పుడు చాలా ఆశించాను. కోరికలు పెంచుకున్నాను. కాని అన్నిటినీ సమాధి చేసేశాను. నిజం చెప్పాలంటే నాకు జీవించాలనే లేదు. ... నిన్ను బాధించడం నా అభిమతం కాదు. కానీ మరణశయ్యపైవున్న అమ్మ సంతృప్తికోసం నేను ఏం చెయ్యగలను? అది నీపై ఆధారపడి వున్నది. నలుగురి ఎదుటా మాత్రం నన్ను భార్యగా స్వీకరించు. నాతో సంసారం చెయ్యక్కర్లేదు. ఎప్పుడూ ఆ విషయంలో నిన్ను దూషించటం కానీ, బలవంతం చేయడం కానీ నేను చేయనని, చనిపోతూన్న అమ్మపై ఆనగా మాట యిస్తున్నాను. రా బావా. నీ కాళ్ళు పట్టుకుంటాను. అమ్మ ఆత్మను నిశ్చింతగా అనంతంలో కలవనియ్. బావా...!"

"ఏడవకు, జమునా. నీ దుఃఖం నేను చూడలేను" కళ్ళు తుడుస్తూ దగ్గరకు తీసుకున్నాడు. అతడి చేతులలో యిమిడి పోయింది జమున. "చూడు నిన్నింత దగ్గరగా తీసుకున్నా నాలో ఏమీ అనుకంపన కలగదు. అత్తవారింటికి వెళ్ళే ముందు రాధ ఇలాగే నన్ను పట్టుకుని ఏడ్చింది ఇలాగే ఆమెను ఓదార్చాను. మీ ఇద్దరితో కలసి మెలసి పెరిగిన నాకు మీ ఇరువురిలో తేడాయే కన్పించదు జమునా! ఏం చేయను? నన్ను కట్టుకుని నువ్వు ఒక్కనాడుకూడా సుఖపడలేవు. ఇంత అన్యాయంగా ఎందుకు నీ జీవితాన్ని బలిచేసుకుంటావ్?"

"నీ స్థితి అర్థం చేసుకున్నాను. నువ్వు చెప్పక్కర్లేదు. కానీ అమ్మకోసం మన పెళ్ళి జరగక తప్పదు. ఆ తర్వాత... అవసరమనుకుంటే నీ జీవితంనుండీ, ఈ లోకంనుండీ శాశ్వతంగా అడ్డు తొలగిపోతాను."

"అలా మాట్లాడకు జమునా!" ఆమె నోటిని చేతితో మూశాడు. "ఇందువల్ల కొందరైనా సుఖపడతారంటే సరే. ఇక ఈ జన్మకు మన కెటూ సుఖపడే యోగం లేదు." మనసులో దావానలాన్ని ఎలా కప్పిపెట్ట గలుగుతున్నాడో అతడికే ఎరుక.

జమునా మురళీకృష్ణల వివాహం అతి వైభవంగా జరిగిపోయింది.

బృంద పాతాళానికి కృంగిపోయింది. ఆమెకు మనశ్శాంతితోపాటు ఇంట స్వేచ్ఛ, సౌఖ్యంకూడ నశించాయి. తల్లి ఆమెను ఒక్క క్షణంకూడ నిర్మలంగా వుండనీయడంలేదు. త్వరలో వృత్తిలో ప్రవేశపెట్టాలనే ఆత్రతతో వున్నది. తనను తాను ఈ నీచజీవితం బారి పడకుండా తప్పించుకొనే ఉపాయం కన్పించడంలేదు. ఒకసారి ఆత్మహత్యకు కూడా పాల్పడింది. దీనితో గోపాలరత్నం, నాగేంద్ర కూడా కొంత జంకారు. బృందను మోసం వలనా, లాలన వలనా మినహా మరే విధంగానూ తమ దారికి మలచుకోలేమని గ్రహించారు.

"బృందా, నేను నిన్ను వివాహం చేసుకుంటాను. దీనికి నీ కేమభ్యంతరం?" ఒకనాడు హఠాత్తుగా నాగేంద్ర అడిగిన ప్రశ్నకు విచలిత అయింది బృంద.

ఆలోచించింది.

తా నెటూ చావలేక పోతూన్నది. ఇక బ్రతకాలి. కాని మర్యాదగా బ్రతకాలంటే పెళ్ళి, ఒక మగవాని అండా అవసరం. మురళి వివాహం అయిపోయింది. నన్ను పెళ్ళిచేసుకోకుండా ముఖం చాటువేశాడు. తెలివైనవాడు! నా చుట్టూ ఆరాధించుతూ తిరుగుతూన్న నాగేంద్ర నన్ను ప్రాణంగా

చూసుకొంటాడనటం నిస్సందేహం... కానీయ్. మనసు రాయిచేసుకొని ఒప్పు కోవాలి."

'నీ హద్దులలో నీ వుండు. సంఘం లోని ఏ సభ్యమానవుడు నిన్ను వివాహమాడతాడో నేనూ చూస్తాను. రోమలు పుట్టేదీ గిట్టేదీ కూడా మురికి లోనే గుర్తుంచుకో,' అని జమున. హీనాతిహీనంగా నిరశించిన మాటలు ఎప్పుడూ ఆమె చెవులలో శూలాఘాతాల వలె హింసించుతున్నాయి. మరపు రాకుండా, మురళితోటి భగ్నప్రణయం కంటె జమున విసిరిన మాటల ఈటెలు మదిలో అనుక్షణం భగభగ మండు తున్నాయి.

'నన్ను సభ్యమానవుడెవడూ వివా హం ఆడడూ? నాగేంద్రతో నా వివాహం ఔతుంది. ఆ పెళ్ళికి మురళినీ జముననూ ఆహ్వానిస్తాను. నాకూ సభ్యప్రపంచంలో ప్రవేశించే అర్హతవున్నదని నిరూపిస్తాను.'

లక్షణంగా బ్రతికే అవకాశం కల్పిం చుకోటానికై అలా నాగేంద్రతో వివాహా నికి అంగీకరించిందేకానీ ఆమె మనసులో రగులుకున్న మహాగ్నిజ్వాల ప్రతాపం అనుభవజ్ఞులకే తెలియాలి.

* * *

## 23

"బృందకూ నాగేంద్రకూ వివాహమా?" ఆహ్వానపత్రికనుచూస్తూనే నిర్విణ్ణుడయ్యాడు మురళి.

'బృందను గురించి అంత నీచంగా మాట్లాడినవాడు, తన హోటల్‌లోనే తనువు నమ్ముకొని బ్రతుకుతూన్న తక్కువదానిని బాహాటంగా వివాహ మాడుతున్నాడా?...లేదు; ఇందులో ఏదో మోసం వున్నది.' వెంటనే బయల్దేరాడు నాగేంద్రను కలుసుకోటానికి.

నాగేంద్ర హోటల్‌లో లేడు. ఇంటి దగ్గర ఉన్నాడని తెలిసి అక్కడికి వెళ్ళాడు మురళి.ముగ్గురు వారాంగనలతో త్రాగుతూ, గంతులేస్తూ విలాస విహ్వ లుడైయున్నాడు నాగేంద్ర. మురళిని చూచికూడా లెఖ్ఖలేనట్లె ప్రవర్తించ సాగాడు. పలుకరించనుకూడా లేదు.

"నాగేంద్రా, ఇదేమిటి?" చేతిలోని శుభలేఖ అతడి కనులదగ్గరగా వుంచుతూ అడిగాడు మురళి.

"ఎవరూ? ఓ నువ్వా?" అతి నిర్ల క్ష్యంగా చూచాడు నాగేంద్ర. "అది నా పెళ్ళి ఆహ్వానం. నేను పంపలేదే! ఓ! నీ స్నేహితురాలు పంపుకొందన్నమాట, పాత ప్రియునికి!" మొద్దు నాలుకతో వాగుతున్నాడు నాగేంద్ర.

"నాగేంద్రా" కోపంగా అంటూ సోఫాలో పడుకొనివున్న అతడిని లాగి లేపి కూర్చోబెట్టాడు. "నేను సీరియస్‌గా మాట్లాడుతున్నాను. ఏమిటో చెప్పితీరాలి నువ్వు. బృందను గురించి అన్ని వాగిన వాడివి ఇప్పుడెందుకు చేసుకుంటున్నావ్?"

విరగబడి నవ్వాడు నాగేంద్ర. "ఒక

పెళ్ళికోసం వెయ్యి అబద్ధాలు ఆడవచ్చ న్నారు పెద్దలు."

"అందుకని? ఏంచేశావ్ చెప్పు?" నాగేంద్ర చొక్కాకాలరు పట్టుకొని అడి గాడు రౌద్రంగా.

కాలర్ వదిలించుకుంటూ క్రూరంగా చూశాడు నాగేంద్ర. "ఏమిటి నువ్వడగ దలచుకున్నది?"

"బృందను గురించి ఆనాడు హోటల్లో నీవు చెప్పినవన్నీ అబద్ధాలేనా- అని అడుగుతున్నాను."

"ఔను." సగర్వంగా అన్నాడు. "నేను చెప్తే నీ బుద్ధి ఎక్కడేడిసింది?" త్రాగివున్న నాగేంద్ర నాలుకను, రహ స్యాలనూ హద్దుల్లో వుంచలేకపోయాడు. "ఔను. నీ ఉత్తరం గోపాలరత్నం నాకు అందించింది పదిలంగా. ఆ ఉత్త రం, కారూ నేను ఒకేసారి పంపేటప్ప టికి నమ్మి వచ్చింది బృంద. నువ్వు ఫలాని గదిలో వున్నానని చెప్తే అక్క డకు వెళ్ళింది! అహ్హహ్హా! నా పాచిక పారింది!"

నిలువునా నీళ్ళుగారిపోయాడు మురళి. "ధౌర్భాగ్యుడా! ఎంత ఘోరానికొడి గట్టావ్!" అని మాత్రం అనగలిగినాడు.

"నోర్ముయ్. ఏం నేను చెప్తే నీ కనులెందుకు పొరలు కమ్మాయి? ను వ్వెందుకు నమ్మాలి?"

"ఇలా మమ్మల్ని విడదీసి నువ్వు మళ్ళీ ముఖం ఎలా చూపగలుగు తున్నావ్? నీ కెందుకింతకక్ష నామీద?"

"అలా అడుగు చెప్తాను." నవిలా సంగా మరో సీసా అందుకుంటూ అన్నాడు. "బృందవంటి అందగత్తె మీ ధనికుల అంతఃపురాలలో పిల్లల్ని కంటూ వదిలిపోవడానికి కాదు. నువ్వు తలచుకుంటే అంతకంటె అందగత్తెలైన సంసారి పిల్లలే వేలకువేలూ లభిస్తారు. నావంటివాడికి మాత్రం బృందవంటి పడుచులు చాలా అవసరం."

అవాక్కుగా చూడసాగాడు మురళి.

"అర్థం కాలేదా?" హేళనగా అడి గాడు నాగేంద్ర. విను, చెప్తాను. "నా దగ్గర బృంద పదిరెట్లు రాణిస్తుంది. నా హోటల్ స్టేటస్‌కూడా పెరుగుతుంది. బృందను క్లాస్ డాన్సర్‌ని చేస్తాను. వవావ్వా - కోట్లకి పడగలెత్తుతాను. తెల్సిందా? వెళ్ళు వెళ్ళు. ఈ రంగుల పిట్టకోసం ఇక ఆలోచించకు!"

"దుర్మార్గుడా." పళ్ళు పటపట కొర కాడు మురళి.

"నిన్ను చంపి రక్తం త్రాగుదామని వచ్చానివ్వాళ. కానీ ... ఛీ. నిన్ను కొట్టినా కుక్కను కొట్టినా ఒకటే ప్రయో జనం. భార్యని హోటల్ డాన్సర్‌ని చేసి ఆ పాపిష్ఠికూడు తిని బ్రతక్కపోతే ఒక్కసారి చావరాదా? ఛి ఛీ." ఛీత్కారంచేస్తూ వెళ్ళిపోయాడు.

(స శే షం)

Printed and Published by A. Sudhakara Rao, at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-500001. Controlling Editor: "CHAKRAPANI"

# షేవర్ స్విష్

## మృత్యువును ఎదిరించే "ప్రాణాంతక దుముకుడు"

డేరా క్రింద పెద్ద సంచలనం

మన ట్రిక్ సైక్లిస్ట్‌కు వెన్నెముక బెణికింది! అతను 5 నిమిషాలలో వెళ్ళ వలసి ఉంది!

హొరగూాక్! రక్షించు! అతనే మా ముఖ్యమైన ఆకర్షణ! జనం తమ డబ్బు తిరిగి ఇచ్చేయమని గల్లంతు చేయటం ప్రారంభిస్తారు

షేవర్ స్విష్ అక్కడ ఉన్నారు ఎవరైనా చేయగల్గినవాడుంటే అది అతనొక్కడే!

దేనికీ వెనుకాడని నీకు జయమగు గాక! ఓహ్! డార్లింగ్! నీవు మనోవిశ్వాసాన్ని పెంచే షేవ్ ఇంకా చేసుకోలేదు!

అదనంగా పొడుగు హేండిల్ గల స్విష్ రేజర్‌కు చాలా ధన్యవాదాలు. చాలా కొద్ది సార్లు మాత్రమే గీసుకుని అతి త్వరగా క్షౌరము చేసుకోవచ్చును

స్విష్ బ్లేడుకు చాలా ధన్యవాదాలు. వాటి అద్వితీయమైన పాలిమెర్ పూయబడిన అంచు మామూలు 5 బ్లేడ్లు చేసే పనిని 3 బ్లేడ్లు చేసేటట్లు చేస్తుంది.

Swish stainless

Swish STAINLESS

Swish STAINLESS

Swish STAINLESS

ఇప్పుడు! అతి భయంకరమైన "ప్రాణాంతక దుముకుడు" అతను తన ఆరోగ్యశక్తితో దుముకుతాడా?

నేను ఇది చూడలేను

పరిస్థితి చాలా ఉద్రిక్తంగా ఉంది మోటారు సైకిలు నెమ్మదిగా కదులుతూ ఒక్క సారిగా దుమికి, గాలిలో తేలియాడుతోంది.

ఓహ్! మీరు దానిని చూసేరా? అత్యద్భుతం! అతను దానిని చేసాడు!

**దాని సంగతే అంత: స్విష్‌తో క్షౌరం చేసుకునే వారిని ఎవ్వరూ ఓడించ లేరు!** (కాని అతని రాబోయే సాహస కృత్యంలో అతనితో కలిసి పనిచేయవచ్చును)

mcm/ci/113 tel

YUVA, DECEMBER, '74 Three Rupees Regd. No. H/HD 7

ప్రతియింట తప్పకవుండదగినవి!

# జిందా

## తిలిస్మాత్




దగ్గు, జలుబు, తలనొప్పి
ఒళ్ళునొప్పులు, కలరాకు



REMEMBER THE TRADE MARK



# ఫారూఖీ

## దంతమంజన్

శుభ్రతకు, ఆరోగ్యమైన దంతములకు



తయారు చేయువారు:
కార్ఖాన జిందా తిలిస్మాత్ హైదరాబాద్.